ఆంధ్ర చంద్రికా గ్రంథమాల. ౧.

# విస్తృత సామ్రాజ్యములు

[ కాల్డియా, బాబిలోనియా, అస్సీరియా ]

రచయిత:

ఖండవల్లి బాలేందుశేఖరం, ఎం. ఏ.

లెక్చరర్, ఉస్మానియా కాలేజి, వరంగల్.

1949

వెల:—

చందాదారులకు రు. 2-0-0

ఇతరులకు రు. 2-12-0

ఆంధ్ర చంద్రికా గ్రంథమాల. ౧.

# విస్మృత సామ్రాజ్యములు

[ కాల్డియా, బాబిలోనియా, అస్సీరియా ]


రచయిత :

ఖండవల్లి బాలేందుశేఖరం, ఎం, ఏ.

లెక్చరార్, ఉస్మానియా కాలేజి, వరంగల్.



1949

వెల:—

చందాదారులకు రు. 2-0-0

ఇతరులకు రు. 2-12-0

# విజ్ఞాపనము

"నా హృదయము భూతమునందున్నది. నా శరీరము వర్తమానమునందున్నది. నా ఆత్మభవిష్యత్తునందున్నది" అని యొకానొకతత్త్వవేత్త నుడివియున్నాడు. ఈ మాటలు వినోదార్థముగాని, అజ్ఞానులను మోసగొట్టుటకు వాడిన పదాడంబరముగాని కావు. ఈ మాటలలో గర్భితమైన యొక సత్యమునే యతడు ప్రవచించి యున్నాడు. మానవుడు భూతకాలమునకు ఋణపడి యున్నాడనియు, వర్తమానముతో సన్నిహిత సంబంధము కలిగియున్నాడనియు, భవిష్యద్విషయముల యెడ బాధ్యత వహించి యున్నాడనియు, ఆతత్త్వవేత్తభావము. మన భవిష్యత్ నిర్మాణ కథ చెప్పుట జోస్యము. భూతకాలము మన కెట్టి పరిణామ పరిస్థితులను కలిగించినదో తెలిపెడు కథ చరిత్ర యనబడును. పూర్వకాలపు వివిధోద్యమముల, వివిధ సంఘటనముల పరంపరాజనిత పరిణామ పరిస్థితులే మనప్రస్తుత స్థితియని మనము గ్రహించినచో, చరిత్ర పుక్కిటి కథగానుండక, మన కత్యంత సన్నిహిత సంబంధముగల వాస్తవిక జ్యోతిగా ప్రకాశింపగలదు. ఇత్యాది భావ పరంపరలలో విశ్వాసముగల వారమై, ఆంధ్ర జనానీకమునకు మోదావహముగ, ఆంధ్రభారతీ దేవి కుడుగరగా "విస్మృత సామ్రాజ్యములు" అను నీ చరిత్ర గ్రంథమును "ఆంధ్రచంద్రికా" గ్రంథమాలలో ప్రథమ కుసుమముగా ప్రకటించుచున్నాము.

# విన్నపము

"నా హృదయము భూతకాలమునందున్నది. నా శరీరము వర్తమానమునందున్నది. నా ఆత్మ భవిష్యత్తునందున్నది" అని యొకానొక తత్త్వవేత్త నుడివియున్నాడు. ఈ మాటలు వినోదార్థముగాని, అజ్ఞానులను హడలగొట్టుటకు వాడిన పదాడంబరముగాని కావు. ఈ మాటలలో గర్భితమైన యొక సత్యమునే యతడు ప్రవచించి యున్నాడు. మానవుడు భూతకాలమునకు ఋణపడి యున్నాడనియు, వర్తమానముతో సన్నిహిత సంబంధము కలిగియున్నాడనియు, భవిష్యద్విషయముల యెడ బాధ్యత వహించి యున్నాడనియు, ఆతత్త్వవేత్త భావము. మన భవిష్యత్ నిర్మాణ కథ చెప్పుట జోస్యము. భూతకాలము మన కెట్టి పరిణామ పరిస్థితులను కలిగించినదో తెలిపెడు కథ చరిత్ర యనబడును. పూర్వకాలపు వివిధోద్యమముల, వివిధ సంఘటనముల పరంపరాజనిత పరిణామ పరిస్థితులే మన ప్రస్తుత స్థితియని మనము గ్రహించినచో, చరిత్ర పుక్కిటి కథగానుండక, మన కత్యంత సన్నిహిత సంబంధముగల వాస్తవిక జ్యోతిగా ప్రకాశింపగలదు. ఇత్యాది భావ పరంపరలలో విశ్వాసముగల వారమై, ఆంధ్ర జనానీకమునకు మోదావహముగ, ఆంధ్రభారతీ దేవి కుడుగరగా "విస్మృత సామ్రాజ్యములు" అను నీ చరిత్ర గ్రంథమును "ఆంధ్రచంద్రికా" గ్రంథమాలలో "ప్రథమ కుసుమముగా ప్రకటించుచున్నాము.

మానవ జీవితములో అతిప్రాముఖ్యము కలిగియున్నట్టి చరిత్రగ్రంథసంచయము ఆంధ్ర భాషలో పరిమితముగనే యున్నది. ఇట్టి గ్రంథ రచన విషయములో కందుకూరి వీరేశలింగము, కొమర్రాజు లక్ష్మణరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, చిలుకూరి వీరభద్రరావు, అయ్యదేవర కాళేశ్వరరావు, చిల్లరిగె శ్రీనివాసరావు, పసుమర్తి శ్రీనివాసరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, కురుగంటి సీతారామయ్య మున్నగు విద్వాంసులు చేసిన కృషి అమూల్యమైనది. మనము కృతజ్ఞతాపూర్వకముగా స్మరించ వలసియున్నది. అయితే ఇంతవరకు జరిగిన కృషి చాలదు. దేశీయ, విదేశీయ చరిత్రలింక నెన్నియో రచనగావించి ఆంధ్రభారతి నలంకరింప వలసి యున్నది. చరిత్ర భాగములో రకరకాల గ్రంథములు బయలు దేరవలసి యున్నది. ఒక మహాభవనమును నింపుటకు సరిపోవు చరిత్ర గ్రంథములు ఇంగ్లీషు వాఙ్మయమున గలవనియు తెలుగులో ఒక బీరువా నిండకూడ లేవనియు తెలిపినచో, మన ఆంధ్ర వాఙ్మయము యొక్క బీదతనము వెల్లడి కాగలదు. ఈ బీదతనమును ఉడుతభక్తి చందమున నివారించుటకు మా "ఆంధ్ర చంద్రికా" గ్రంథమాల సంకల్పించి యున్నది. ఆ మహదాశయమును పురస్కరించుకొనియే "విస్మృత సామ్రాజ్యములు" అను నీ చరిత్ర గ్రంథమును సమర్పించుకొనుచున్నాము.

"ఆంధ్ర చంద్రికా గ్రంథమాల" మహోద్దేశములతో స్థాపితమైనది. చిరకాల వాంఛితమైనట్టిది. తెలంగాణ జనులు సుమారర్థశతాబ్ద కాలము తపస్సు చేయగా జనించినట్టిది. సద్వాంఛలు ఫలించి తీరును. అయితే నిర్దిష్ట కార్యజాతమును క్రమ వికాసము నొందజేసి, దేశ కాలములను పరిపక్వ స్థితికి దీసికొనివచ్చి ఫలింపజేయుట ఈశ్వర సంకల్పము. అట్టి శుభ తరుణమును పురస్కరించుకొని మా సేవా విధానమును ఆంధ్ర భాషామతల్లి పాదపద్మముల సన్నిధిని ఈ గ్రంథ మాల రూపమున సమర్పించుటకు ఉత్సాహులమై యున్నాము

ఒకప్పుడు ఆంధ్ర వాగ్దేవికి విహారరంగమై, "అచ్చ తెనుంగు శబ్దమునకాది పదంబయి పొల్పుభాగ్యమున్ హెచ్చుగ గన్న దేశమై" ఖ్యాతిగలిగిన నీ తెలంగాణమున తెలుగు భాష దిక్కుమాలిన దయి పోయెను. పరభాషలగు ఉర్దూ, ఇంగ్లీషు భాషలు రాజావలంబనమున "జోరు" కలిగి తెలుగునకు వెలుగులేకుండ జేసెను. మధురమైన ఆంధ్రభాషను మన్నించువారే లేకుండపోయిరి. వీనులవిందగు తెలుంగును విని పించువారే లేకుండపోయిరి. విన్నాణమగు తెలుంగు వికార రూపమును దాల్చెను.

ఇట్టి విచారకరమగు పరిస్థితిని గమనించి మన పెద్దలు దూరదృష్టితో 1901 వ సంవత్సరమున "శ్రీ కృష్ణదేవరా యాంధ్ర భాషానిలయము"ను హైద్రాబాదునందు స్థాపించి యుండిరి. ఈ శుభ సంకల్పమే తెలంగాణమున ఆంధ్రభాషా

వికసనోద్యమమునకు విఘ్నేశ్వర పూజయయ్యెను. గ్రంథాలయోద్దేశములు ఆంధ్ర జనుల మనస్సుల నాకర్షించెను. నూతన భావ సమన్వితులై ఆంధ్ర భాషాభిమానముతో ఆంధ్ర గ్రంథాలయములు తెలంగాణమున ఆంధ్రావళి స్థాపింపకడంగిరి. ఆవేశసంరంభముతో ఆంధ్రులు తమ మాతృభాషా దేవి నారాధింప నారంభించిరి. తత్ఫలితముగా హైదరాబాదునందు 7 సికిందా్రబాదులో 4 అత్రాఫుబల్దా జిల్లాలో 2 వరంగల్ జిల్లాలో 15 కరీంనగరము జిల్లాలో 6 నల్లగొండ జిల్లాలో 13 మహబూబునగర జిల్లాలో 5 మెదకు జిల్లాలో 5 నిజామాబాదు జిల్లాలో 1 ఆదిలాబాదు జిల్లాలో 1 రాయచూరు జిల్లాలో 1-ఇట్లు 1927 వరకు 60 ఆంధ్ర భాషానిలయములు లెక్కకు స్థాపితము లయ్యెను. ఇంకను లెక్కకురాని వందలాది గ్రంథాలయాములు కలవని మేము నమ్మకముగ చెప్పగలము. ఈ విధముగా ఒక వంక స్థావర గ్రంథాలయములందు భగవతియగు మహా సరస్వతియొక్క ఆధి భౌతిక స్వరూపమును, మరియొక వంక విద్యా వృద్ధులగు జంగమ గ్రంథాలయములందు భగవతి మహా సరస్వతి యొక్క అధ్యాత్మిక స్వరూపమును వ్యక్తము కాసాగెను. స్వాధ్యాయ ప్రవచనములు నిత్యములయ్యెను.

ఒక మహానది జనించినప్పుడు అల్పారంభము కలదిగా నున్నను, అది క్రమక్రమముగా విశాలమై, మహోదారమై వివిధ శాఖోపశాఖాసంభృతమై ప్రకటితమగునట్లే, ఇచ్చటి ఆంధ్ర భాషాప్రవంతియు మహోత్సాహ రంగములతో వివిధ

శాఖలయందు విజృంభమాణమై ప్రకటితము కాసాగెను. హిత బోధిని, ఆంధ్రమాత నీలగిరి, తెలుగు పత్రిక, గోలకొండ పత్రిక, భాగ్యనగర్ పత్రిక, తెలంగాణ పత్రిక, మీజాన్ పత్రిక, శైవ మణి, దివ్యవాణి, మున్నగు వార్తా పత్రికలును, సుజాత, ఆంధ్రా భ్యుదయము, దేశబంధు, దక్కన్ కేసరి, ఆంధ్ర కేసరి, పూల తోట, మద్యపాన నిరోధక పత్రిక, తెలుగుతల్లి, విభూతి, శోభ, మున్నగు మాసపత్రికలును తెలంగాణ జనుల మానస ముల కలరింపసాగెను. గోలకొండ పత్రిక, కిన్నెర, మాతృ భారతి. ఆంధ్రశ్రీ మున్నగు వార్షిక సంచికలు గంభీర సాహిత్య రంగమున ప్రచండ కృషితో ప్రవర్తిల్లెను. విజ్ఞాన చంద్రికా గ్రంథమాల, కాకతీయ గ్రంథమాల, వీరేశలింగ కవి కంఠాభరణ గ్రంథమాల, కృషి ప్రచారిణీ గ్రంథమాల, అణా గ్రంథమాల, విజ్ఞాన ప్రచారిణీ గ్రంథమాల, వేంకటేశ్వర గ్రంథమాల, గోలకొండ గ్రంథమాల, మున్నగునవి గ్రంథ సాహిత్యమును ప్రకటింప దొడంగెను. శ్రీ లక్ష్మణరాయ పరి శోధక మండలి, ఆంధ్ర వాఙ్మయ సేవాసమితి, ఆంధ్ర విద్యాభి వర్ధనీ సమాజము, సారస్వత సేవాసమితి, కాకతీయ కళా సమితి, సాధనసమితి, సాహితీ మేఖల, విజ్ఞానవర్ధనీ పరిషత్తు, నిజాంరాష్ట్ర ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదాంధ్ర సాహిత్య పరిషత్తు మొదలగు మహాసంస్థలు సాహిత్య రంగ మున ఉన్నత స్థాయిలో సమంజస కార్యకలాపములను నిర్వ ర్తింప సాగెను. గోలకొండ కవుల సంచిక, హనుమంత రాయ

షష్టిపూర్తి సంచిక, శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ రజతోత్సవ సంచిక, పోతన మహాక సంచికవి ఇత్యాది ప్రత్యేక సంపుటములు వెలువడెను. విద్వాంసులు గ్రంథ రాజములను రచించిరి. నవ్యభావ తరంగితులై యువకులు భావగీతములను గానము చేయసాగిరి. నన్నయభట్టు, తిక్కన సోమయాజి, శ్రీ కృష్ణదేవరాయలు, పోతనామాత్యుడు, వీరేశలింగం పంతులు, లక్ష్మణరాయ మంత్రి మున్నగు విద్వన్మణుల జయంతులు జరుగుచుండెను. మైలవరపు నరసింహశాస్త్రి, అదిపూడి సోమనాథరావు, మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణరావు, దూపాటి వేంకట రమణాచార్యులు, సురవరం ప్రతాపరెడ్డి, ఒద్దిరాజు సీతారామచంద్రరావు, మున్నగు మహనీయులు తమ రచనలచేతను, భాషణములచేతను ఆంధ్ర సేవాభినివేశమును ప్రకటింప సాగిరి. ఈ యుద్యమములన్నింటికి ఆంధ్ర పితామహులవారి ఆంధ్రోద్యమము మకుటాయమానముగానుండి ఉత్తేజ మొసంగెను.

ఈ విధమున మాతృ భాషోద్యమ తరంగములు వెల్లివిరిసి ఆంధ్ర జనుల మానసముల ఉత్సాహమున ముంచుచుండగా, సంకుచితమగు రాజకీయ వాతావరణము ఈ పవిత్రోద్యమముపై గొప్ప దెబ్బతీసెను. అన్ని సంఘములు జారిపోయెను. అయినను ఉద్యమ ప్రవాహము నరికట్టుట సాధ్యమా? గట్టులను గుట్టలను, దప్పించుకొని ద్విగుణితోత్సాహముతో ప్రవాహము వేర్వేరు పథములను ద్రొక్కుచు

ముందుకు సాగుచునే యుండెను. ఆంధ్ర భాషాభిమానము సన్నగిలలేదు. ఏతదుద్యమము కుంటుపడలేదు. ఇట్టిది మా ఆంధ్ర భాషోద్యమ చరిత్ర. మా ఆంధ్ర చంద్రికా గ్రంథ మాల యవతరణమునకు పూర్వరంగపు సంగ్రహ స్వరూపము. ఈ విన్నపము ప్రారంభమున మేము నిర్వచించిన సూత్రము ననుసరించి మనము భూతకాలమునకు ఋణపడి యున్నాము. కార్యరంగమును సిద్ధపరచినట్టు భూతకాల పరిస్థితులను సింహా వలోకనముచేసి స్మరించుట మన విధాయకము. ఆ విధి నిర్వ హింపబడినది.

ప్రప్రథమమున విజ్ఞాన చంద్రికా గ్రంథమాల హైద్రా బాదునందే 1907లో స్థాపితమయ్యెను. ఏతద్గ్రంథమాలయందు నాలుగు గ్రంథములు హైదరాబాదునుండియే, ప్రకటితము లయ్యెను. విజ్ఞానచంద్రికా కార్యస్థానము 1908లో కార్య సౌలభ్యముకొరకు చెన్నపట్టణమునకు మార్చబడెను. శ్రీ కొమ ర్రాజు లక్ష్మణరావుగారి మరణముతో విజ్ఞాన చంద్రికా మండలి కార్యజాతము స్తభించి పోయెను. తదుపరి దానిని శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు బెజవాడకు దీసికొనివచ్చి తమ యాధిపత్యములోనుంచుకొని గ్రంథ ప్రకాశ కార్యమును ప్రకాశమానము గావించుటకు నిశ్చయించిరి. ఆ ప్రయత్నము జయప్రదము కాలేదు. విజ్ఞానచంద్రికా గ్రంథ మాల నామమాత్రావశేషమయ్యెను.

శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయమును, విజ్ఞాన చంద్రికా మండలిని స్థాపించి ఆంధ్రభాషకు మహోపకారము

చేసిన శ్రీ రాజానాయని వేంకట రంగారావు బహద్దరువారు విజ్ఞాన చంద్రికా గ్రంథమాల పరిస్థితికి మిగుల విచారపడిరి. శ్రీ రాజావారును, విజ్ఞాన చంద్రికతో కొంత సంబంధముగల మాలో నొకరిద్దరమును మంతనములు సలిపి మండలిని జన్మస్థానమగు హైదరాబాదునకు దీసికొనివచ్చి, ప్రచురణ కార్య భారమును వహించుటకు నిశ్చయించితిమి. శ్రీ కాళేశ్వరరావు పంతులుగారు, యట్టి యభిప్రాయమునే మొదట వెల్లడించిన వారగుటచే, తమ యామోదము నొసంగిరి. కానివారి మాట సాగలేదు. ఆ విషయములో మేము చేసిన ప్రయత్నము లన్నియు విచారకరముగ వ్యర్థములయ్యెను. అయినను మా యుత్సాహము సన్నగిలలేదు. విజ్ఞాన చంద్రికను ఆదర్శముగా బెట్టుకొని, యొక గ్రంథమాలను స్థాపించుటకు కృతసంకల్పుల మైతిమి. ఆ సంకల్పానుసారమే ఈ ఆంధ్ర చంద్రికా గ్రంథ మాల ప్రభవించినది.

ఆంధ్ర చంద్రికా గ్రంథమాల స్థాపనావకాశములను తెలుపుట అవసరమును, ఆనందకరమునునయియున్నది.

ఆంధ్ర పితామహ పండిత మాడపాటి హనుమంతరావు పంతులుగారికి షష్టిపూర్త్యుత్సవము 6-2-1947 నాడును, తరు వాతను తెలంగాణము నందంతటను మహోత్సాహముతో జరిగియుండెను గదా! ఆ సందర్భమున హైదరాబాదు వారు తులాభార ద్రవ్యము రు. 6400-0-0లతో శ్రీవారిని బహూ కరించిరి. ఇతర ప్రాంతములవారును శ్రీవారిని సత్కరించిరి. ఈ ద్రవ్యపు మొత్తమును ఆంధ్ర భాషలో గ్రంథ ప్రచురణ

కార్యమునకే వినియోగించుటకు ఉదార భావముతో శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు నిశ్చయించి తమ చిరకాల వాంఛితము నిరాటంకముగ సాగునట్లు వ్యవస్థ కల్పించిరి. పంతులుగారి సదుద్దేశమును గ్రహించి, శ్రీరాజా రామదేవరావు బహద్దరువారు రు. 1500-0-0లు భూరి విరాళ మొసగి, తమ భాషాభిమానమును, వదాన్యతను ప్రకటించిరి. ఈ విధముగా సమకూడిన రు. 8420-15-0లు "ఆంధ్ర సారస్వత నిక్షేపము"గా హనుమంతరావుగారు, స్థిరీకరించిరి. ఆంధ్ర సారస్వత నిక్షేపము యొక్క అధికార పత్రమును, ఆదర్శములను, కర్తవ్యములను, నియమములను, అనుబంధమునందు వివరించుకొని యున్నాము. ఈ ఆంధ్ర సారస్వత నిక్షేపమునకు అధ్యక్షులు శ్రీ కొండా వేంకట రంగారెడ్డిగారు, కోశాధిపతి మాడపాటి హనుమంతరావుగారు, కార్యదర్శి కొమ్మవరపు సుబ్బారావుగారు.

మరియు మా గ్రంథమాల ఆదర్శములను విని సంతోషించి, సిరివేల కాపురస్తులగు శ్రీ మద్ది వేంకట నారాయణ రెడ్డిగారు రు. 200-0-0లును, శ్రీ దోమలపల్లి యాదగిరి రావుగారు రు. 91_0-0లును విరాళము లొసంగి మమ్ములను కృతజ్ఞతా బద్ధులను జేసియున్నారు.

ఇట్టిది మా ఆంధ్ర చంద్రికా గ్రంథమాల జననకథ. నిజాం రాష్ట్రములో ఆంధ్ర జనులను మేల్కొల్పి, ప్రబోధము గావించి, వివిధోద్యమములకు కర్తావలంబన మొసంగి, ఆంధ్ర పితా మహులై కీర్తిగడించినవారు శ్రీ పండిత మాడపాటి

హనుమంతరావుగారు. శ్రీ హనుమంతరావుగారి సౌహార్ద్ర భావమే మా గ్రంథమాలకు కొంగు బంగారమై తనరారుచున్నది. ఆంధ్రమాత ప్రియపుత్రులైన శ్రీ హనుమంతరావుగారి యమోఘాశీర్వాద బలము, ఆంధ్ర జనుల యాదరాభిమానములు మాయీ ప్రయత్నమును విజయవంతము గావించుగాక యని ఆశించుచున్నాము.

ఆంధ్ర చంద్రికా గ్రంథమాల ఆదర్శములను, నియమములను రెండవయనుబంధమునందు వివరించుకొని యున్నాము. ఆంధ్రభాషాభిమానముతో మా సోదరులు సభ్యులుగాచేరి పరమార్థచింతతో మాయీ భాషా వ్యవసాయమునకు ప్రోత్సాహము కలిగింపవలయునని ప్రార్థించుచున్నాము.

గడచిన పదునాల్గు మాసములలో నిజాం రాష్ట్రమున ఆవిర్భవించిన అసాధారణ అశాంతి పరిస్థితులవలన అనుకొనినంత వేగముగ పని నారంభింప లేక పోయినాము. ఈ ఆలస్యమునకు పరిహారముగా ఈ గ్రంథమున పుటలు పెంచినాము. విస్మృత సామ్రాజ్యములను పేరుతో నిందు కాల్డియా, బాబిలోనియా, అస్సీరియా అను మూడు ప్రాచీనరాజ్యముల చరిత్ర వర్ణితమైనది. ఈ కథలు మూడును ఇంచుమించుగా ఒక్క దేశము యొక్క చరిత్ర యన్నను సత్యేతరముగాదు. వేర్వేరు కాలమునందు వేర్వేరునామములతో ప్రఖ్యాతిచెందిన పరస్పర సంబంధముకల యీ కథనమంతయు, ఒక్క సంపుటమునందే వర్ణితమైనచో పాఠకులకు సమగ్ర కథనము నవగాహనము చేసికొనుటకు సుకరముగానుండునని తలంచినారము.

మా యాశయములోని రహస్యమును మా పాఠకులు గమనింప గోరుచున్నాము.

"విస్మృత సామ్రాజ్యము"లను నీ గ్రంథమును రచించినవారు ఖండవల్లి బాలేందు శేఖరంగారు. సంస్కృతాంధ్రములయందు పాండిత్యపటిమగలవారు. చరిత్రను అభిమాన విషయముగా గైకొని మద్రాసు విశ్వవిద్యాలయమున ఎం. ఎ. పట్టమును బొందిన విద్యాధురీణులు, యువకులు, ఉపాధ్యాయులు. ఇవ్వాళ్ళ గ్రంథకర్తలు. మా గ్రంథమాల ప్రథమ కుసుమముగా నీ గ్రంథము రచించి యిచ్చినందులకు బాలేందు శేఖరంగారి సౌజన్య శీలమును, భాషాభిమానమును మిక్కిలిగ కొనియాడుచున్నాము.

ఈ గ్రంథమునకు ఉపోద్ఘాతము వ్రాసియిచ్చిన ప్రొఫెసరు ఎస్. హానుమంతరావు, ఎం. ఏ ఎల్. టి. గారికిని గ్రంథ ముద్రణ కార్యమును ఓపికతో చక్కగ నెరవేర్చిన శ్రీ, గోలకొండ ప్రెస్ వారికిని మేము కృతజ్ఞులమై యున్నాము.

ఇట్లు విన్నవించు విధేయులు

1-12-1949 ధర్మకర్తృత్వ సమితి

హైద్రాబాదు ఆంధ్రసారస్వత నిక్షేపము

# రెండవ కూర్పు పీఠిక.

"విస్మృతసామ్రాజ్యము" లను నీగ్రంథమునకు శీఘ్రకాలములోనే రెండవముద్రణము వేయు అవకాశము గలిగినందులకు మిగుల సంతోషించుచున్నాము. మాయీ చరిత్ర గ్రంథమును విద్వాంసులు, పత్రికలు ప్రశంసించి మాకును గ్రంథకర్తకును ప్రోత్సాహము కలిగించి యున్నారు. మా ఆంధ్ర చంద్రికా గ్రంథమాల నభిమానించి సుమారు ౨౦౦ మంది శాశ్వతచందా దారులుగా చేరి మాచేయు విజ్ఞాన ప్రసారక కార్యమునకు ఎంతయు తోడ్పడియున్నారు. ఆంధ్ర భాషాభిమానులగు ఆంధ్ర సోదరుల యభిమానము మూలకముగా "విస్మృత సామ్రాజ్యములు" అనునీ గ్రంథముయొక్క ప్రతులు దాదాపుగ నయిపోయినవి. ఇట్లుండగా, హైదరాబాదు సర్కారు విద్యాశాఖవారు ఈ గ్రంథమును అయాచితముగ హెచ్.యస్.సి.పరీక్షకు పాఠ్య గ్రంథముగా నిర్ణయించి మాకు ప్రోత్సాహమొసంగి యున్నారు.ఇది యెంతయు ముదావహము.ఇట్టి కారణ పరంపరల చేత దీనిని పునర్ముద్రణము గావించి ప్రకటించుచున్నాము. మమ్మిట్లు ప్రోత్సాహపరచిన ఆంధ్ర సోదరులకును, హైదరాబాదు సర్కారు విద్యాశాఖవారికిని, ఈగ్రంథముపయి సదభిప్రాయము నొసంగిన పత్రికాధిపతులకును మా ధన్యవాదములు.

మా ఆంధ్రచంద్రికా గ్రంథమాల స్వయంపోషకమయి, ఉద్గ్రంథములను పెక్కింటిని ప్రకటించు శక్తి గలిగి యుండవల యు నన్నచో వేలకొలది శాశ్వత చందాదారులు చేరవల యును. ఆంధ్ర భాషాదేవి నుపాసించుటలో మాచేయు సంప్రయ త్నమునకు ఆంధ్ర జనుల ఔదార్యమును, అభిమానమును ఆశించుచున్నాము.

సంపాదకుఁడు

1-7-1949<br>
హైద్రాబాదు.

# ఉపోద్ఘాతము

ఇదివరలో మనము ప్రత్యేక దేశ చరిత్రలకే ప్రాముఖ్యత నిచ్చుచుంటిమి. ఇప్పుడు ప్రపంచమంతయు నొక్కటియై యున్నది. ప్రపంచ చరిత్ర తెలిసికొనుట ముఖ్యము. ఈ చరిత్రలో నతిప్రాచీనమైన నాగరతలలో కాల్డియా, బాబిలోనియా, అస్సీరియా దేశములు ప్రసిద్ధి చెందినవి. ఈ దేశములు నేడు మెసపొటోమియా అని పిలువబడు ప్రాంతములోనుండెను. సుమారు క్రీ॥ పూ॥ 8000 సం॥ నుండి అనగా ఇప్పటికి 10,000 సంవత్సరముల క్రిందటి కాలమునుండి ఈ ప్రాంతములందుద్భవించిన నాగరికత సుమేరియన్ నాగరికతయని వ్యవహరింపబడుచున్నది. ఈ దేశమునందు టైగ్రిస్, యూఫ్రటీస్ నదులు ప్రవహించి దేశమును సారవంతముగ జేయుచుండినవి. ఈ సుమేరియనులు ఇటుకపై విచిత్రమైన లిపిని వ్రాసియుండిరి.

క్రీ॥ పూ॥ 2750 సం॥ నందు అక్కాడు రాజైన మొదటి సారగన్ సుమేరు రాజ్యముపై దండెత్తివచ్చి సుమేరుల నోడించి, సుమేరియన్ అక్కేడియన్ రాజ్యమును స్థాపించెను. ఈ రాజ్యము రెండు వందల సంవత్సరముల తరువాత తిరిగి సుమేరియనుల స్వాధీనమై అత్యున్నత దశ ననుభవించెను. క్రీ॥ పూ॥ 2298 సం॥ నందు ఊర్ యెంగూరు అనురాజు, చంద్ర దేవునికి ఊర్ పట్టణమునందు ఆలయమును నిర్మించెను. సుమేరు రాష్ట్రమందలి వివిధ పట్టణములకు తరుచు యుద్ధ

ములు సంభవించుచుండెను, లాగాష్ నగరరాజైన ఉరు కాగినా, ఉమ్మారాజైన లూగాల్ జగేసి వలన ఓడింపబడి, సుమేరు నాగరికతా క్షీణతకు కారణభూతుడాయెను.

ఈ సందర్భమున, తూర్పునుండి ఏలామ్ జాతివారు పశ్చిమమునుండి సెమిటిక్ తెగమొదలైనవారు, సుమేరియన్ రాజ్యముపై దండయాత్రలు చేసిరి. అట్టివారి రాకపోకలతో నూరు సంవత్సరములు పోరాడి రాజ్యమంతయు నాక్రమించి 2100 క్రీ॥ పూ॥ లో హమ్మురబ్బిరాజు ఆధిపత్యము క్రింద, మొదటి బేబిలోనియా యనే రాజ్యమును స్థాపించిరి. ఈ హమ్మురబ్బి కాలమును, చరిత్రకారులు హమ్మురబ్బి స్వర్ణ యుగము [The Golden Age of Hammurabbi] అందురు. ఈతని ధర్మ శాసనములు మిక్కిలి ప్రశంసనీయములు. మార్డూన్ బాకీ అను పురదైవత దేశమును కాపాడినదనియు, ఆదేవత కృపవల్లనే, తాను రాజ్యముచేయుచున్నాననియు, హమ్మురబ్బి శాసనము లందు చాటించెను. కొంతకాలమైనతరువాత, సుమారు క్రీ॥ పూ 170 సం॥ ప్రాంతమున కాస్సైట్ తెగవారు, ఈదేశమాక్రమించి ఆరుశతాబ్దములు రాజ్యముచేసిరి. క్రీ॥ పూ॥ 18 సం॥ ప్రాంతమున, ఏలాము రాజులు కాస్సైట్ వంశమును నాశనముచేసిరి.

అస్సీరియా, బాబిలోనియాకు సరిహద్దునున్నది. వారి ముఖ్యపట్టణములు అష్షుర్, నినివా. యుద్ధముచేయుటయేవారి ముఖ్యవృత్తి. ఈరాజ్యమునకు పూర్వవైభవమును పునరుద్ధరించినవారు టిగ్లాత్‌పిలేసర్ ( క్రీ॥ పూ॥ 1120 ) కాని సుమారు

మూడుశతాబ్దములవరకు, అస్సీరియాకును, బాబిలోనియాకును పరస్పర వైరముతోనే కాలము గడచుచుండెను. క్రీ॥ పూ॥746వ సం॥మందు, మూడవ టిగ్లాదుఫిలాసుర్ రాజాయెను. ఈతడు బాబిలోన్ పైదండెత్తి, స్వాధీనముచేసికొని, నూతనఅస్సీరియస్ మహారాజ్యమును స్థాపించెను. 732 వ సం॥మందు డెమెస్కసుపట్టణమునుస్వాధీనముచేసికొనెను. ఫిలాసర్ తరువాతరాజులైన, రెండవసార్గను, సెన్నా షెరిబ్ లగురించి, బైబిల్, కింగ్సు 11లో వివరించియున్నది. ఈ సెన్నా షెరిబ్ కాలములో బాబిలోనునగరము నాశనముచేయబడెను. 977 వ సం॥ మందు, ఇసార్ హాడన్ రాజు, సిరియాపట్టణమైన సైడన్ను స్వాధీనముచేసికొనెను. అతనికొమారుడగు అషురబనిపాలుడు. మెమ్ఫిసీను జయించెను. కాని ఈ విజయములన్ని యీ రాజ్యమునకు శాశ్వతలాభము కలిగించలేదు. 606 వ సం॥ నినివాపట్టణము నాశనముచేయబడి. అస్సీరియా రాజ్యము సమాప్తముపొందెను.

దీనికి కారణభూతుడు, బాబిలోనియా రాజైన, బోనపొలాస్సర్. ఇతనికొమారుడైన రెండవ నెబుకడ్నెజర్ 905 వ సం॥ నందు కార్షెమిష్ అను ప్రదేశమున ఈజిప్టువారి సైన్యములను సంపూర్ణముగానోడించెను. 538 వ సం॥ నందు, పారసీ రాజైన సైరస్, బేబిలోనియా నాక్రమించుకొనెను. రెండు వందల సంవత్సరముల తరువాత, గ్రీక్ నాయకుడైన ఎలెక్సాండరు పారసీరాజ్యమునునోడించి, బేబిలన్ తన రాజధానిగా చేసికొనెను.

ఇదంతయు క్రీ॥ పూ॥ జరిగెనచరిత్ర. సుమేరియన్, బేబి లోనియన్ , కాల్డియన్ రాజ్యములు. క్షీణించిపోయినవి గాని వారు నాగరికతకు చేసిన సేవ శాశ్వతమయినది. వీరు..బహు దేవతోపాసకులుగ ప్రారంభించినను, క్రమముగానీశ్వరుడొక్కడే యనుభావమును పొందగలిగిరి. ఈ దైవమే అందరిని కాపాడు వాడనియు, రాజులందరును, దైవాజ్ఞకు లోబడియుండవలె ననియు, రాక్షసులను సంహరించి, దేవతలకు శ్రేష్ఠుడయిన మార్డూన్ బాల్ పూజనీయు డనియు వారు నమ్మియుండిరి. మహేంజదారో, హరప్పాకాలమునాటి నాగరకతకు, సుమేరి యనునాగరికతకు సంబంధముకలదు. రెండు నాగరకతలయందు భూదేవిపూజ ముఖ్యముగ నుండెను. సుమేరియన్ మాతపేరు ఇష్టార్ దేవి. జ్యోతిశ్శాస్త్రమందు సుమేరియనులుమిక్కిలిశ్రద్ధను తీసుకొనిరి. ఏడుగ్రహములు, సూర్యుడు, చంద్రుడు, శని బృహ స్పతి, అంగారకుడు, శుక్రుడు, బుధుడు, వీరు సజీవులనియు, వీరి సంచారమువలన, మనుష్యజీవితముల మంచిచెడ్డలు మారు చుండు ననియువారు విశ్వసించిరి. వీరిఉద్దేశములే జ్యోతిశ్శాస్త్ర మునకు పునాది.

నక్షత్రమండలమునందు జరుగునదంతయు ఒకపద్ధతిని అవలం బించు చున్నది. ఏకాలమునకు సూర్యచంద్ర గ్రహణములు వచ్చునో, యేకాలమునకు ఏగ్రహము ఏస్థానములోనుండునో, మనము ముందుగా చెప్పగలముకదా. అదేప్రకారము విశ్వ ప్రపంచమునందు జరుగుకార్యములన్నియు గ్రహములస్థానముల వలన తెలిసికొనగలము.

అస్సీరియనులు భాషకు, లిపికి చాలసేవచేసి యున్నారు. ఈలిపికి మహెంజదారో లిపికి సంబంధముండి యుండవచ్చును. 19 వ శతాబ్దమందు (క్రీ॥ శ॥) పాశ్చాత్యచారిత్రకులు, పరిశోధనలుజరిగించిరి. లయార్డుఅను ఆంగ్లేయపరిశోధకుడు, ఒకగ్రంథాలయమును, విచిత్రమగు లిపిలో వ్రాయబడిన ఇటుకలను కనుగొనెను. జార్జిస్మిత్ అను పరిశోధకుడు తనజీవితమునే ధారపోసి, అతిఉత్సాహముతో మెసపొటేమియాకు మూడుపర్యాయములు ప్రయాణముచేసి, ఈ భాండాగారమును సంపూర్ణముగా పరిశోధించి, అపూర్వమైన చారిత్రిక సేవ చేసి యున్నాడు.

ప్రపంచచరిత్ర ఒక ఊగుటుయ్యెలవంటిది. కొన్ని నాగరికతలు పతనమగుచు, మరికొన్ని ఉచ్ఛదశకువచ్చుచు, ఎల్లకాలము ఈశ్వరేచ్ఛ ప్రకారము విశ్వసృష్టి జరుగుచునే యుండును Goethe అనుకవి Faust లో వ్రాసినట్లు, quoted

from page 556 Joynbee's Study of History.

In currents of Life, in tempests of motion.
In fervour of act, in the fire, in the storm,
Hither and thither,. over and under,
Wend I and wander; Birth and the grave,
Limirless ocean, where the restless wave
Undulates ever, under and over
Their seething strife heaving and weaving
The changes of life
At the whirring loom of time unawed
I work the living mantle of god.

(తిరుమూరి హనుమంతరావు, ఎం ఏ నిజాంకాలేజి)

# విషయసూచిక.

పటముల సూచిక.



IV ఆంధ్ర చంద్రికా గ్రంథమాల నియమములు మొ॥

మన మెల్లరమును నివసించుచున్న ఈ భూమండల మెన్ని సహస్రాబ్దములకు పూర్వము సృజింపబడెనో నేటివరకును కూడ శాస్త్రజ్ఞులు నిశ్చితముగ తెలుపజాలకున్నారు. ఈ భూమిపై వివిధములగు జీవజంతువు లుద్భవించి, అనేక వేల సంవత్సరములలో చిత్రవిచిత్ర పరిణామములకు లోనైన పిదప సృష్టికి మకుటాయమాను డగు మానవుడు జన్మించినట్లు జీవశాస్త్రపరిజ్ఞాతలు తెలుపుచున్నారు. మన పురాణాదులయందు వర్ణింపబడిన దశావతారములను శ్రద్ధగ పరిశీలించిన యెడల జీవజంతువుల పరిణామమందలి వివిధదశలు స్థూలరూపముగ మనకు గోచరించును. మానవుడు భూమిపై అవతరించిన తరువాతకూడ అనేక సహస్రాబ్దములు గడచినవి. చిరకాలము వరకును అతడు ద్విపాదపశువువలెనే ఉండెను. ఆత్మసంరక్షణము, ఆహారసముపార్జనము మాత్రమే అతని ముఖ్యధర్మములుగానుండెను. సమస్తజంతువులకును సామాన్యమైన ఆహార నిద్రాది కార్యములయందే మనుష్యుడు సంపూర్ణముగ నిమగ్నుడై చిరకాలము గడపెను. ఈ దీర్ఘకాలములో మానవుడు ఎండవానలనుండియు క్రూరజంతువులనుండియు తన్ను తాను రక్షించుకొనుటకై సదుపాయములను, ఆహారసంపాదనమునకై సులభోపాయములను కల్పించుకొనెను. ఈ యుగమును శాస్త్రజ్ఞులు మానవుని శైశవదశయనియు, మానవజాతియొక్క ప్రాథమికావస్థ యనియు వర్ణించు చున్నారు.

ఈ అనాగరకతయందు మానవుడు తనస్థితిగతులనుగూర్చిన యంశములను రాబోవు యుగమువారికొరకు లిఖిత పూర్వక ముగ కాని తదితర రూపముగగాని పొందుపరచుట యసం భవము. కాని ప్రతిజీవియు తనకు తెలియకుండగనే తన జీవిత మును గూర్చిన కొన్ని చిహ్నములను భూమిపై దిగనాడు చుండును. అదేవిధముగ ఆదిమ మానవుడు, తన పనిముట్ల రూపకముగను, కొండగుహాలు మున్నగు చోటులయందలి చిత్రలేఖన రూపకముగను, మరణించినవారి సమాధులయందును, ఆ పురాతనయుగమునాటి కొన్ని గుర్తులను దిగనాడి పోయినాడు. ఈ చిహ్నములు భూగర్భమునందును, నదీగర్భ ములందును, ప్రాచీనకాలపు కట్టడములందును, లభ్య మగు చున్నవి. వీటిని పరిశోధించి చారిత్రికులు మానవుని ప్రాథ మికదశ ఏయేవిధములుగా నుండెనో నిరూపించి యున్నారు.

మానవుడు నాగరకతావస్థను పొందుటకుపూర్వము మూడుదశలలోనుండి గడచినట్లుగ చరిత్రకారు లభిప్రాయపడు చున్నారు. వానిని (1) పురాతనపు రాతియుగము, (2) నూతన రాతియుగము, (3) లోహపుయుగము అని వ్యవహార సౌలభ్య మునకై విభజించి పేర్కొనుచున్నారము. మానవు డా యా యుగములయందు తన నిత్యోపయోగమునకై వాడుకొనెడి పరికరముల నే యే పదార్థములతో సిద్ధముకావించుకొనెనో ఆయా యాధారములపై పైనపేర్కొన బడిన యుగనిర్ణయము కావింపబడినది, లోహముల ఉపయోగము గ్రహించినప్పటి

నుండియు మానవు డనాగరక దశనుండి వెలువడి నాగరక ప్రపంచమున కాలిడినట్లు సర్వసాధారణముగ నేటి చరిత్రకారు లభిప్రాయపడుచున్నారు.

పురాతన పుడాతియుగము

ఒకానొక కాలమున భూమండలము నంతను ఆవరించి యుండెడి మంచు ప్రవాహములు వెనుకబట్టి భూమి మానవు నకు నివాసయోగ్యముగ మారినపిదప మానవుడిచ్చట యవత రించెను. నేడుమనకు కాన నగుచున్న జంతుజాలములో కొన్ని జంతువులు ఆ నాడుకూడ జీవించి ఈ ఆదిమ పూరుషునకు సహచరములుగ నుండెడివి. శీతోష్ణములనుండి ఈ జంతువు లకు బాధ కలుగకుండ ప్రకృతి వానిదేహమును దట్టమైన బొచ్చుతోకప్పి సంరక్షించెను. అడవిదున్న, అడవి ఎద్దు, ఎలుగు, నీటిగుఱ్ఱము, మున్నగు వన్యమృగములతోకూడ మాన వుడు వేరొక మృగమువలెనే జీవించుచు కాలక్షేపము చేసెడి వాడు. ఈ యుగమునందు మానవుడు తన పనిముట్ల నన్నిటిని రాతితో సిద్ధపరచెడివాడు. కొమ్ములు, ఏనుగుదంతములు, ఎముకలు మున్నగునవి కొంతవరకీ కాలమునం దుపయోగింప బడినను వాటికి విశేషవ్యాప్తి లేకుండెను. ఈ కాలమునందు మానవుడు ధనుర్విద్యయందు కూడ చాల కౌశల్యముమ సంపాదించినట్లు తెలుపుట కాధారములు కలవు. ఈ సాధనము లతో నీ పురాతన మానవుడు వన్యమృగములను వేటాడియో లేక చేపలనుపట్టియో జీవించుచుండెను. ఈనాటి కీమనుష్యునకు

గృహనిర్మాణకౌశల్యము బొత్తిగలేనట్లు తోచుచున్నది. ఈతనికి ప్రకృతి నిర్మితములైన గుహాలే నివాసస్థానములుగ నుండెడివి. నూలువడకుట వస్త్రములునేయుట మున్నగు నంశములలో నేర్పు కొంచెమైనను ఈ మానవు డలవరచు కొనలేదు. కావున నీతడు ఆకులు, చెట్లపట్టలు మున్నగువానినే శరీరమునకాచ్ఛాదనముగ వాడెడివాడు. ఇంతటి యనాగరకత స్థితియందు సైతము మానవుడు దినదినాభివృద్ధి గాంచుచుతా నుపయోగించుకొనెడి రాతిపనిముట్లను క్రమక్రమముగ సున్నితముగను, చూచుటకింపుగను సిద్ధపరుపగలుగుట గమనింపదగిన విషయము. కొన్ని పర్వతగుహాలయందు ఆదిమ మానవుడు వన్యమృగముల యాకారమును మిక్కిలి నేర్పుతోడను జీవకళ లుట్టిపడినట్లును, చిత్రించియున్నాడు. కావున నీ ప్రాచీన యుగములో సైతము మానవుని యందు కళాకౌశల్యము కొరత వడి యుండలేదని తెలుపవచ్చును. ఈ స్థితియందు మానవుడనేకవేల సంవత్సరములు గడపెనని శాస్త్రజ్ఞు లభిప్రాయ పడుచున్నారు.

## నూతనరాతియుగము

మానవ నాగరకతా పరిణామమందు రెండవదశయని చెప్పదగిన ఈ యుగమందు మానవుడు మరికొంత యభివృద్ధి కావించెను. ఈ నూతనయుగములో కూడ జనులు సర్వసాధారణముగ రాతిపనిముట్లనే వాడెడివారు. కాని యీ పరికరములు తొల్లింటి యుగములోకంటె సున్నితముగ నుండ

జొచ్చెను. తనపరికరములకు సానపెట్టి వానినందముగ కావించు టయం దీకాలపు జనులు శ్రద్ధచూపిరి. నిప్పు చేయుట నేడు మనకొక గొప్పవిషయముగ కాన్పింపదు. కాని మానవోత్పత్తి జరిగిన అనేక వేల సంవత్సరముల వరకును మానవు డగ్ని నెట్లు రగుల్కొలుపవలెనో యెరుంగకుండెను. పురాతన రాతియుగ మందే ప్రజలీనేర్పును గడించి రనుటకు నిదర్శనములు కలవు. ఈ నూతనయుగమందు మానవుడు సుఖసంపాదనా ప్రయత్న ములయందు మరింత ముందునకు సాగిపోయెను. ఈ కాలపు ప్రజలు కొండగుహలయందు నివసించుట పూర్తిగ మానక పోయినను గృహనిర్మాణము మాత్రముప్రారంభించిరి. ఈగృహ ములు సాధారణముగ సరస్సులు, నదులు గల చోట్ల వెలయు చుండెడివి. ఈ కాలపు జనులు భూమిని సేద్యము చేయుట జంతువులను పెంచుట మున్నగు నంశములలో కూడ కొంత నైపుణ్యమును చూపసాగిరి. తమనిత్యోపయోగమునకై వివిధ రూపములుగల పాత్రలనుకూడ వీరు చేయసాగిరి. మరణించిన వారి సమాధులపై వీరు వివిధములగు గృహోపకరణముల నుంచెడివారు. కావున వీరియందు మరణానంతరమునయితే మొక జీవితము కలదను విశ్వాసముండె నని యూహించుట కాధార మేర్పడుచున్నది. ఈ ప్రాచీనయుగమందు నిర్మింపబడిన సమా ధులు బ్రహ్మాండమగు రాళ్ళచేనిర్మింపబడినకట్టడములు. ఇట్టివియే ఈజిప్టులోని పిరమిడులు. ఇట్టి కట్టడములు హిందూదేశమందు గూడ వివిధరూపముల పెక్కుచోట్ల కానవగుచున్నట్లు తెలియు

చున్నది. వీటికి సామాన్య జనులు "రాక్షసుల గుడులు" అను నామ మొసంగి యున్నారు. నూతనరాతియుగపు చిహ్నములు ఈజిప్టు, బాబిలోనియా, ఇటలీ, మున్నగు దేశములలో విరివిగ కానవచ్చుచున్నవి.

## లోహపు యుగము

ఈ యుగమునందు మానవుడు అనాగరక దశనుండి వెలువడి, ఆధునిక నాగరక యుగమునందు కాలిడినట్లు చారిత్రకుల యభిప్రాయము. ఈ నాటికి మానవుడు వివిధ లోహములను, వాటి ఉపయోగములను గుర్తించెను. మొట్టమొదట రాగి, తర్వాత కంచు, ఆపైన ఇనుముతోడను మానవులు వివిధములగు పనిముట్లను చేయ నారంభించిరి. లోహముల ఉపయోగమును కనుగొనుటకు పూర్వము మానవుని పనిముట్లన్నియు రాతితో నిర్మింపబడుచుండినందున అతనికి తన నిత్యవ్యాపారములలో పనిపాటలు మిక్కిలి కష్టముతో జరిగెడివి. ఉదాహరణమునకు: చెట్లను నరకుటకై ఇనుపగొడ్డళ్లు లేని నాడు, రాతిగొడ్డళ్ళతో ఈపనిని సాధింపవలసివచ్చెడిది. అట్లే గృహనిర్మాణమునందు కూడ ఇనుప పనిముట్లులేకుండ పని సాగించుట కష్టసాధ్యము. ఈకారణమువలన లోహయుగము ప్రారంభించువరకును మనుష్యుడు మిక్కిలి సులభమైన పనులు చేయుటలోకూడ చాల ప్రయాసకు లోనుగావలసి వచ్చెడిది. ఆహారసంపాదనాది వ్యాపారములయందే ఆతనికి చాలకాలము వ్యయమైయెడిది. అందుచే జీవితమును రమ్యతరముగను, ఉదాత్తము

గను కావింపబడిన కళానైపుణ్యమును కాని, ఆముష్మిక చింతను కాని మానవుడీనాడు విశేషముగ నభివృద్ధి కావించుకొన జాల కుండెను. కాని లోహముల ఉపయోగము నెరింగినపిమ్మట నితడు నిత్యకృత్యముల నవలీలగ చేయగల్గెడివాడు. కావున జీవితమందలి ఉదాత్తధర్మములు, ఉన్నత జీవిత మార్గములు అన్వేషించి, వాటిని సాధించుటకే మానవునకు తగిన అవకాశములును, చిత్తస్వాస్థ్యమును లభింపసాగెను. ఈయుగమునందు మానవజాతి కళాభిరుచి, సౌందర్యోపాసన, దైవచింతన, తత్వ జిజ్ఞాస, మున్నగు నంశములలో నెంతయో ముందునకు సాగి పోయెను. దీనినే మనము నాగరకత యని పలుకుచున్నాము.

## నా గ ర క తా భి వృ ద్ధి

నాగరకతా పథమున ముందునకు సాగిపోవుచు మానవుడు సాధించిన కొన్ని ఘనకార్యములను మనము మరియొక పర్యాయము తడవెదము గాక. ఇయ్యవి జీవితవిధానమునకు మూలభూతములైన విషయములు. కావున వీనిని పునరుద్ఘాటించుట చాల యావశ్యకము. అయ్యవి నిప్పురగుల్చుట, జంతువులనుమచ్చికచేసికొనుట, వృక్షజాలమునుమచ్చికచేసికొనుట, భావప్రకటనమునకై భాషానిర్మాణము ఈభాషను,భావములను శాశ్వతము గావించుటకై లిపినిర్మాణమున్నగునవి. జీవితమునకీపై విషయముల యావశ్యకతనుగూర్చి వేరుగ తెలుప నక్కరలేదు.

అగ్నియొక్క ఆవశ్యకతను, ప్రాశస్త్యమునుగూర్చి ఎల్లరును అంగీకరింతురు. దేవతలను అగ్నిముఖులుగా వర్ణించి

మనపూర్వులు అగ్నిదేవుని గౌరవించిరి. అగ్నిని పూజించి, సత్కృత్తి పరచిన మీదటనే సమస్త శుభాశుభకర్మలకును మన వారు గడంగుదురు. వివాహ మగ్ని సాక్షికముగ కావింపబడు చున్నది. అగ్నినిపూజించి గౌరవించుట కేవలము హిందూ ర్యులలోనే కాదు పురాతన పారసీక దేశీయులలోను, రోమక జాతీయులందును కూడ మిక్కిలి వ్యాపించియుండెను. పార్సీలు అగ్నిని పూజింతు రన్న విషయము మనమందర మెఱింగినదియే. పూర్వకాలమునందు అగ్ని దేవతను రోమకులు వెస్టాఅనియు గ్రీకు లు హెస్టియాఅనియుపిలిచెడివారు. ఆ దేవతగౌరవార్థమై వారు ప్రత్యేకముగ ఒక దేవాలయమును నిర్మించి అందు అగ్నిని ప్రతి ష్ఠించి ఆయగ్నినిసంరక్షించుటకై అర్గురుకన్యలను ప్రత్యేకముగ నియమించెడివారు. ఆహితాగ్నులైన హిందూకుటుంబికులలో గార్హపత్యవహ్నిని రక్షించుట యనునది చాల ముఖ్యధర్మ ముగ పరిగణింప బడుచున్నది. మానవ జీవితమునకు అగ్ని ఎన్నియో విధముల తోడుపడుచున్నది. కావుననే సమస్త జాతులవారును అగ్ని దేవుని పూజించుట సంభవించినది. అగ్ని వలననే మన మాహారమును వండుచున్నారము. లోహములను కరిగించుచున్నారము; పాత్రలు చేయుచున్నారము. ఈనాడు సర్వత్ర కాన నగుచున్న పరిశ్రమాభివృద్ధి అగ్ని లేకుండ సాధ్యము కాదుకదా! ఆదిమ మానవు డనేక వేల సంవత్సరము లలో అగ్నియొక్క వివిధోపయోగములను గ్రహించి తన జీవి తమును సౌఖ్యవహముగ కావించుకొనుటకై నిప్పును వాడు

కొనసాగెను. నిప్పులో కాల్చిన యెడల మట్టిగట్టిపడునని తెలిసి కొని యాతడు కుండలు మున్నగునవి చేయసాగెను. లోహములు నిప్పులో కరగునని యెరింగి వివిధలోహములతో పాత్రలు మున్నగునవి చేయనారంభించెను. పురాతనపు రాతియుగము నందు సైతము మానవు డగ్నిని రగుల్కొల్పుట యెరిగియుండె నని యీవరకే తెలిసియున్నాము. కాని మొట్టమొదట మనుష్యు లగ్ని నెట్లు పుట్టించిరో మాత్రము తెలియరాకున్నది. ప్రకృతినిర్మితమైనఅగ్ని పర్వతముల లావానుండియో, లేక అరణ్యములలో నుద్భవించిన దావాగ్ని నుండియో మానవుడు మొట్ట మొదట నిప్పును తీసికొనియుండును. కాలక్రమమున రాళ్ల యొరపిడిచేతను, కట్టెల యొరపిడిచేతను, లోహసంఘట్టనము చేతను నిప్పు రగుల్కొలుపవచ్చునని గ్రహించెను. కాని యీ విధముగ అగ్నిని పుట్టించుట కష్టసాధ్యము. కావున నొకపర్యాయము రగుల్కొనిన నిప్పు ఆరిపోవకుండ కాపాడుటకొరకు పూర్వకాలము వారు పాటుపడెడివారు. అగ్నిసంరక్షణమునకై మతక్రియలయందుచాలప్రాముఖ్యతయొసంగబడుట కియ్యదియే కారణమై యుండవచ్చును. నిరంతరమును అగ్ని పేటికలను కంచుకములలో పొందుపరచి నిర్లక్ష్యముగ సంచరించు మనకు ఆదిమమానవుని కష్టనిష్ఠురము లెట్టివో యూహించుట ఇంచుక కష్టసాధ్యము.

మానవ జీవితమును సౌఖ్యవంతముగా చేయుటకు నోరులేని జంతువు లెంతయో ఉపకరించుచున్నవి. గుఱ్ఱములకు

కళ్ళెము తగిలించి మనము స్వారి చేయుచున్నాము. వాటి చేతను ఎద్దులచేతను బండ్లు లాగించుచున్నాము. ఆవులు గేదెలు, మేకలు మనకు కుంభ వృష్టిగ పాలనిచ్చి పిన్నలను పెద్దలనుకూడ సంతృప్తి పరచుచున్నవి. గొర్రెలు తమ ఉన్నిచే మనకు వెచ్చనిబట్టల నొసంగుచున్నవి. తుదకు చనిపోయిన తర్వాతకూడ మనము జంతువులను వ్యర్థములని త్రోసివేయక వానిచర్మము ననేక విధములుగ వాడుచున్నాము. మానవునియందు కానరాని కృతజ్ఞతా భావముతో విశ్వాసముతో ప్రవర్తించుచు కుక్కలు మనలను, మనగృహములను కాపాడుచున్నవి. కాని యీ నిత్యవ్యాపారములు మన దృష్టిని విశేషముగ నాకర్షించుటలేదు. ప్రప్రథమమున మానవుడు జంతువులతో స్నేహము చేసి వానివలన సహాయము పొందుటకై యత్నింప డయ్యెను. ఆతడు వాటినిచంపి ఆహారముగమాత్రము గ్రహించుచుండెడివాడు. కాని కాలక్రమమున నాతడు జంతువుల వివిధోపయోగముల నెరింగి వాటినిగూర్చి మచ్చిక చేసికొని పాలింపజొచ్చెను. దీనివలన మానవ జీవితమునందొక గొప్పమార్పు సంభవించుట మనము చూడవచ్చును. మొదట మానవుడు వేటకాడై జంతువులను హింసించెడివాడు. ఆపైన జంతువులతో స్నేహముచేసి వానిని తనతోపాటు అనేక ప్రదేశములకు గొనిపోయెడివాడు. ఈ విధమున కిరాతమానవుడు జంతుపాలకుడుగ మారుట తటస్థించెను. అతిపూర్వయుగమందు ఆర్యులు అవసరమును పురస్కరించు

కొని తమ తమ పశువులతోకూడ సారవంతములును, సస్య శ్యామలములును అగు ప్రాంతములకు తరలిపోయి ప్రాణరక్షణము చేసికొను చుండెడి వారు.

మానవ నాగరకతకు వ్యవసాయము చాల దోహద మొసంగినది. భూమిని సేద్యముచేసి దానినుండి వివిధములగు పంటలను పండించుట యెరింగిన నాటినుండియు మనుజుడు ఆధునిక యుగమువైపునకు మరియొక అడుగు వైచినట్లు తెలుపవచ్చును. వ్యవసాయ మెరుంగని నాడు మనుష్యుడు కిరాతజీవిత మవలంబించి తనతోటి జీవజంతువులను హింసించి వాని మాంసముతోడనే కుక్షిని నింపుకొనుచుండెను. తాను నివసించుచున్న ప్రాంతములలో జంతువులు క్షీణించినను తన పశువులకు గడ్డి మున్నగునవి లభింపకపోయినను ఈతడు ఆ ప్రాంతమును విడచి వేరొక-చోటికి పోవు చుండెడివాడు. ఇట్టి స్థితియందు మనుష్యునికి స్థిరజీవితము సాధ్యముకాదు. నాగరకతకు స్థిరజీవితము పునాదివంటిది. ఇట్టి స్థిరజీవితము, వ్యవసాయ మభివృద్ధిచెంది మనుష్యునకాహార విషయమున నెట్టి కష్టము లేకుండ సమస్త వస్తువులను ధరిత్రీమాతయే యొసంగ నారంభించిన నాటినుండియే ప్రారంభించునట్లు తెలుపనగును. కావుననే వ్యవసాయాభివృద్ధికిని నాగరకతకును గొప్ప సంబంధ మేర్పడినది. మనుష్యు డేవిధముగ వ్యవసాయసూత్రమును కనుగొనెనో తెల్పుట కష్టసాధ్యము. ప్రకృతియందుపక్షులుమున్నగునవి వివిధములగు ధాన్యాదులను ఒక ప్రదేశమునుండి వేరొక

చోటికిఁగొనిపోవుటలో కొన్ని గింజలు నేలపైబడి కాలక్రమమున మొక్కలుగా మార్పుచెందుటను ఆదిమ మానవు డాశ్చర్య సంభ్రమములతో కనుగొని యుండవచ్చును. కాలక్రమమున నాతడు ప్రకృతినుండి వివిధములగు పంటలను పండించు విధానమును గ్రహించి వ్యవసాయవృత్తిని నవలంబించి యుండవచ్చును. వ్యవసాయము వలన తనకు కలిగిన యపారలాభమును గుర్తెరింగి జనులే మహత్తర రహస్యమును దేవతలు తమకు ప్రసాదించినట్లు భావింపజొచ్చిరి. కావుననే అనేక జాతులలో వ్యవసాయము దైవదత్తమగు వర మని చాటెడి కథలు వ్యాప్తిలో నున్నవి. మొక్కజొన్నలు, వడ్లు, యవలు మున్నగు పంటలను వివిధదేశములలో ఆ యా శీతోష్ణస్థితి గతుల ననుసరించి జనులు పండింప జొచ్చిరి. వ్యవసాయాభివృద్ధి ముఖ్యముగా గంగానది, యూఫ్రిటీసునది, నైలునది మున్నగు వాని మైదానములలో విశేషముగ జరిగెను. కావుననే ప్రపంచము నందలి మొట్టమొదటి నాగరకత యీ ప్రాంతములందే వెలయుట తటస్థించెను.

సృష్టియందలి యితరజీవజంతువులకును మనుష్యునికినిగల ముఖ్యమగు భేదము వాక్ఛక్తి. ఇతర పశుపక్ష్యాదులు తమ మనోభావములను కేవలము సంజ్ఞల వల్లనో, లేక అర్థశూన్యములగు అరపుల వలననో తెలుపుచున్నవి. కాని మనుష్యుడు మాత్రము తన ఉద్దేశములను సంజ్ఞలతోడనేగాక వాగ్రూపముగకూడ వెలిబుచ్చుచున్నాడు. ఈశక్తి నాతడు కొలది

సంవత్సరములలోగాని, కొలదిశతాబ్దాలలోగాని సంపాదించి యుండుట సాధ్యముకాదు.. ఎన్నోవేల సంవత్సరములలో మనుష్యుడు తనచుట్టు ప్రక్కలనున్న జంతువులు, పక్షులు, వస్తుజాలము మున్నగువానికి వివిధ నామము లొసంగి యుండ వలెను. వివిధ పదార్థములకు, జంతువులకు, భావములకు, పనులకు, వేర్వేరు నామములు మనుష్యు లెట్లు నిర్ణయించెనో తెలుపబూనుట యెంతటివారికిని సాధ్యము కానేరదు. గొప్ప విద్వాంసులుసైతమీ విషయములకు నూహలపైననే యాధార పడవలసి వచ్చుచున్నది. భాషానిర్మాణమునుగూర్చిన వివరము లతో మనకుప్రసక్తిలేదు. కాని భాషానిర్మాణమునకు మానవ నాగరకతా చరిత్రమునందు మిక్కిలి యున్నతమైన స్థానము కలదను విషయము నిర్వివాదాంశము. చారిత్రిక కాలమునకు పూర్వమే వివిధ జాతులవారు తమతమ భాషలను పరిపూర్ణ దశకు తెచ్చియుండుట గమనింప దగిన యంశము. కొన్ని శతాబ్దులవరకు భాష కేవలవాగ్రూపముగనే యుండెను. కాని కాలము గడచినకొలదియు బుద్ధిమంతు లగు వారీ వాక్కున కేదైన స్థిర రూపము కల్పింపవలసిన యావశ్యకతను గుర్తింప సాగిరి. తమలో జ్ఞానసంపన్ను లైనవారు తెలుపుచుండెడి అమూల్యవిషయముల నొకచో పొందుపరచి ముందుతరముల వారికి వాటి నందించుట యవసరమని వారు తలంచి యుండ వచ్చును. ఈ యూహలకు ఫలముగ లిపి నిర్మాణము ప్రారంభ మయ్యెను. మొట్టమొదటి దశయందు మనుష్యు లొకొక్క

భావమును సూచించుటకొక్కొక్క బొమ్మను వాడుచుండెడి వారు. కంటికి కన్పించు వస్తుజాలములకై గుర్తుల నేర్పర చుట కష్టముకాదు. ఏలయన చెట్టు, మనుష్యుడు, కుక్క మున్నగు వాటిని సూచించుటకై ఆయా బొమ్మలను గీయుట సులభవిషయమే కాని దృగ్గోచరము కానట్టి భావములను ప్రక టించుట వారికి కష్టమయ్యెను. కావున ఒక్కొక్క భావమును సూచించుటకు ఒక్కొక్క ప్రత్యేకమగు బొమ్మను వారు గుర్తుగ వాడజొచ్చిరి. ఇట్టి చిత్రలిపి బాబిలోనియా, చైనా, ఈజిప్టు మున్నగు దేశములవారు కనుగొని వాడినట్లుమనకు నిదర్శనాలు కలవు. కాని ఇట్టి భాషను నేర్చుట మిక్కిలి కష్టసాధ్యము. ఇందు పెక్కు వేలబొమ్మలు వాడవలసివచ్చును. కావుననీభాషను సూక్ష్మీకరించి సులభముగ నేర్చుకొనుటకును వ్రాయుటకును అనువైనలిపిని కనుగొనుటకై ప్రయత్నములుప్రారంభమయ్యెను. వివిధములగు వస్తువులకును, భావములకును గుర్తులేర్పరుచు టకు మారుగ భాషయందలి వివిధ ధ్వనులకు వేర్వేరు గుర్తులు నిర్మించి వాటి సహాయమున క్రొత్తలిపిని నిర్మించుటకై బుద్ధి మంతులు ప్రయత్నములు చేసి తుట్టతుదకు కృతకృత్యులైరి. ఆ విధముగ ప్రపంచమందలి వివిధ లిపులు బయలుదేరినవి. వేలసంవత్సరములకు పూర్వమే ఆసియా ఖండమునందిట్టి వివిధ లిపులు ప్రచారములో నున్నట్లు చారిత్రికుల అభిప్రాయము. భాషానిర్మాణమును, లిపినిర్మాణమును నాగరకతాభివృద్ధి యందు అతిముఖ్యములగు ఘట్టములు. భాషయు, లిపియు,

లేనియెడల మానవునితర విషయములలో నంతే అభివృద్ధి చెందినను ఆతడు పశుతుల్యుడుగా నుండెడివాడు. దీని పరిణామము అభివృద్ధివలననే మానవునికి శ్రేష్ఠత లభించినది.

సర్వసాధారణముగా నేటివారు నాగరికత పందొమ్మిది ఇరువదవ శతాబ్దములలోనే విశేషముగా పెంపు చెందినట్లు తలంచుచున్నారు. ఈ శతాబ్దములలో మానవజీవితమునకు సౌఖ్యమునొసంగునట్టి యనేక నూతనాంశములు కనుగొనబడిన విషయము సత్యమేకాని వీటిని మనము నాగరికతకు పై మెరుగు లని మాత్రము తెలుపవచ్చును. ఏలయన జీవితమున కావశ్యకములగు అభివృద్ధినంతయు ఆదిమమానవులే కావించిరి. ఆహార సంపాదనము, గృహనిర్మాణము, లోహప్రయోజనము, వ్యవసాయ రహస్యము, పశుసంరక్షణము, భాషాసౌలభ్యము, మున్నగు అనేక ముఖ్యవిషయములను నేటివారు చారిత్రిక యుగమునకు పూర్వము నివసించిన జనులనుండియే యెరిగిరి. వాటిని పునాదిగ గైకొని ఆధునికులు అనేక నూతనాంశములు కనుగొనగల్గిరి. ఆదిమమానవుని కడనుండి మనకు లభించిన ఈ సహాయసంపత్తికి మనము వారికెంతయో కృతజ్ఞులమై యుండ వలసియున్నది.

## ప్రపంచమందలి జాతులు

ప్రపంచ నాటకరంగముపై అనేకజాతులు కానవగుచున్నవి. అందుకొన్ని జాతులు పురాతనయుగమందుమాత్రమే తమ పాత్రలను నిర్వహించి ప్రస్తుతము నామమాత్రావశిష్ట

ముగ నున్నవి. అట్టి జాతులు కాల్డియా, బాబిలోనియా, అస్సీరియా, ఫొనీషియా, మున్నగు దేశములకు చెందినవి. పూర్వ రేఖా శిలాసాదులనుబట్టి ప్రాచీన అర్వాచీనజాతులను శాస్త్రజ్ఞులు మూడు భాగములుగ విభాగించుచున్నారు. (1) నల్లజాతులు లేక నీగ్రోలు, (2) పచ్చజాతులు లేక మంగోలియాజాతులు, (3) తెల్లజాతులు లేక కాకేషియా జాతులు. మొట్టమొదటి శాఖకుచెందినవారు నీగ్రోజాతివారొక్కరే. వీరు ముఖ్యముగా ఆఫ్రికాఖండమునందు సహారా ఎడారికి దక్షిణప్రాంతమున నివసించియున్నారు. కాని తెల్ల జాతులవారు వీరిని తమకు వశపరచుకొని ఈజాతిలో పలువురను మాయోపాయములచేతను, బలాత్కారముగను ఇతర దేశములకు గొనిపోయి వారిని బానిసలుగ చేసికొని లాభమును పొందుచున్నారు. ఈ కారణమున నీగ్రోజాతివారు పలువురు అమెరికా ఖండమునందుకూడ కానవత్తురు. మంగోలియా జాతికి చెందినవారు చైనా జపానువారలు. వీరు పీతదేహులు. ఈ జాతులవారు ఆసియా ఖండముయొక్క ఉత్తరభాగమునందును తూర్పుభాగమునందును కానవచ్చుచున్నారు. ఈ జాతులు మిక్కిలి పురాతనకాలమందును, ఆధునికయుగమందునుకూడ గొప్ప నాగరకతను పెంపొందించి యున్నవి. ప్రపంచమందలి తదితర జాతుల నన్నిటిని తెల్లజాతులు లేక కాకేషియను జాతులలో జేర్పవచ్చును. వీరిలో గౌరవర్ణదేహులైన భారతీయులు మున్నగువారుకూడ చేరియున్నారు.

ఈజిప్టుదేశమువారి నీ తెగయందు పేర్కొనవచ్చును. వీరు క్రీస్తునకు నాలుగువేల సంవత్సరములకు పూర్వము నైలునదీతీరము నందు నివసించిరి. వీరిచే నిర్మింపబడిన యున్నతమైన కట్టడములు వీరినిర్మాణనైపుణ్యమును వేనోళ్ళ చాటుచు నేటికిని నిలిచియున్నవి. పై కాకేషియను తెగలో చెప్పదగినవారు సెమిటిక్ జాతులవారు మరొక్కరు. యూదులు, బాబిలోనియా జాతివారు, అస్సీరియాజాతివారు, ఫొనీషియనులు, ఈ తెగకు చెందినవారు. ఈ జాతులవారెల్లరును మొదట అరేబియా దేశములోనివసించుచు, ఆపైన పరదేశములకు వలసపోయినట్లు పెక్కురు విద్వాంసు లభిప్రాయపడుచున్నారు. హైందవ—ఐరోపీయ (Indo European) జాతులవారు పై కాకేషియను తెగలో మరొక భాగముగా నున్నారు. గ్రీకులు, రోమకజాతి వారు, ఈనాటి ఐరోపాజాతులు (కొందరుతప్ప), పారసీకులు, భారతీయులు మున్నగువారెల్లరును ఈ హైందవ—ఐరోపీయ కుటుంబములోనివారు. వీరు ప్రప్రథమమున మధ్యఆసియా యందలి మైదానములలో నివసించుచు కాలక్రమమున వివిధ ప్రాంతములకు వలసపోయినట్లు పండితులు తలంచుచున్నారు. వీరిలో కొందరు పారసీకులు భారతదేశమువైపును, మరి కొందరు ఐరోపాఖండమునకును పోయి, అచ్చటనే శాశ్వతనివాస మేర్పరచుకొని తమతమ వివిధ నాగరకతలను పెంపొందించు కొనిరి.

అతిపురాతన కాలములందు ఈజిప్టు, చైనా, పారసీకము, భారతదేశము, మున్నగు దేశములలో కూడ గొప్ప నాగరకతలు ప్రబలియుండుట యెల్లవారు నెరింగిన యంశము. వారి పూర్వనాగరకత ఎంతయో మార్పునకులోనై నేటిప్రజలకును, ఆ పూర్వకాలపు ప్రజలకును బ్రహ్మాండమైన భేదములు కానవచ్చుచున్నవి. కాని యీజాతులు నేటికిని సజీవము లయి యున్నవి. వారి జాతీయజీవనము మార్పులకు లోనయ్యును నిరంతరాయముగ సాగుచున్నది. సామాన్యప్రజ లీజాతులను మరచిపోలేదు. కావున ఈజిప్టు, చైనా మున్నగు జాతులను విస్మృత జాతులని వర్ణించుట సమంజసము కానేరదు. కాని కాల్డియా, బాబిలోనియా, అస్సీరియా మున్నగుజాతులు చరిత్ర పరిశోధన కావించువారికి మాత్రమే తెలియనగుచున్నవి. సామాన్యులు వీనిని పూర్తిగ మరచిపోయినారు. ఆధునిక ప్రపంచములో వాని నామరూపములు కానరావు. కావున వీరిదేశములను విస్మృతసామ్రాజ్యములని వర్ణించుట సత్యదూరము కానేరదు.

## గ్రంథ విషయములు

ఈ గ్రంథములో కాల్డియా, బాబిలోనియా, అస్సీరియా దేశముల చరిత్రలు వర్ణితములయినవి. ఈ ప్రాచీన దేశములు వేర్వేరు నామములతో చరిత్రలయందు పేర్కొనబడినను పరస్పరసంబంధము కలిగి ఒకే చరిత్రగా భాసిల్లుచున్నవి. ఇవి ఒకానొక కాలమున గొప్పనాగరకతకు ఆట

పట్టులై ధనధాన్య సమృద్ధములయి విలసిల్లి యుండెను. ఇయ్యది ఏఖండమునందు, ఏ ప్రాంతములోనో కూడ నేనాటి భూగోళ శాస్త్రములవలన తెలియుటలేదు. పరిశోధకులీ రాజ్యములు నేడు మెసపటోమియా లేక ఇరాఖు అని పిలువబడు దేశములో నెలకొనియుండెననని నిర్ణయించి యున్నారు. ఈ ఇరాఖు రాష్ట్రము హిందూదేశమునకు పశ్చిమోత్తరమున నున్నది. దీనికి తూర్పున పర్షియా ఆఫ్ఘనిస్థానములును, పశ్చిమమున అరేబియా దేశమును, దక్షిణమున సముద్రమును, ఉత్తరమున పర్వత పంక్తులును కలవు. ఈ ఇరాఖురాష్ట్రము టైగ్రిస్ యూఫ్రటీసు అను నదులచే జలసమృద్ధ మగుచున్నది. బాబిలోనియా రాజ్యమునకు ముఖ్యపట్టణమయిన బాబిలోను పట్టణము యూఫ్రటీసు నదీతీరమున నుండెడిది. అస్సీరియా రాజ్యమునకు కేంద్రమైన నైనివా నగరముయొక్క చిహ్నములు టైగ్రిస్ నదీతీరమునగలవు.

## ప్రస్తుత స్థితి

మొదటిప్రపంచ సంగ్రామము (1914) తరువాత మెసొపొటేమియారాష్ట్రము అరబ్బు ప్రజల యధీనములోనికి వచ్చినది. దానిపై బ్రిటిషు వారి సంరక్షకత్వము స్థాపింప బడినది. ఈ రాష్ట్రము మున్ముందు చాలప్రాముఖ్యత వహింపగలదు. ఇరాఖుఅని పేర్కొనబడు రాష్ట్రములో మెసొపొటేమియాయు కొంత ఎడారియు కలిసి యున్నవి. ఇచ్చట వర్షములు సంవత్సరమునకు 10 అంగుళములు మాత్రము కురియును. ఈ

వర్షముకూడ చలికాలమునందు కురియును. కావున నిచ్చటి శీతోష్ణస్థితి మధ్యధరా సముద్రపు శీతోష్ణస్థితి యని తెలుప వచ్చును. ఆర్మీనియా పర్వతములలో నుద్భవించిన మంచు ప్రవాహముల వలన నీరాష్ట్రపు రెండు నదులు టైగ్రిస్ యూఫ్రటీసు అనునవి జలపరిపూర్ణము లగు చున్నవి. ఈ నదులు బాబిలోనియా ప్రాంతమునకు వచ్చు సరికి మిక్కిలి విజృంభించి కట్టలపై పొరలిపోయి పరిసరప్రాంతముల నన్నిటిని ముంచివేయుచుండును. కావున చుట్టుప్రక్కల ప్రదేశములలో నీరు నిలకడగనుండి ఆ భాగములు నివాసమున కనర్హముగ పరిణమించు చున్నవి. నీటి పారుదలకు అవకాశమున్న ప్రదేశములలో కొంతవరకు సాగుబడికూడ జరుగు చున్నది. అచ్చట మొక్కజొన్నలు, ప్రత్తి, గోధుమలు, పొగాకు పండుచున్నవి. నదులయొక్క తుదిభాగములలో తీరములందుచెరకు, ఖర్జూరపు తోటలుకూడ పెరుగుచున్నవి. ఇరాఖురాష్ట్రముయొక్క ఉత్తర భాగమున నూనెగనులు వెలు వడినవి. ఇచ్చటినుండి మధ్యధరా సముద్రపు రేవు పట్టణము లకు అనగా హైఫా, ట్రిపోలీ అను ప్రదేశములకు ఇనుప గొట్టములద్వారా పెట్రోలును పంపుచున్నారు. ఈ మెసొ పొటేమియా రాష్ట్రమునందు ప్రస్తుతము మూడుపట్టణములు మిక్కిలి ప్రాముఖ్యత వహించి యున్నవి. మోసలు పట్టణము టైగ్రిస్ నదీతీరమున కలదు. దీనికి సమీపముననే పూర్వ కాలపు నైనివా నగరముయొక్క చిహ్నములు గలవు.

ఈ మోసలుపట్టణము టైగ్రిస్ నదిపైననడచెడి నౌకలకు ముఖ్య స్థానము. బగ్దాదు పట్టణముకూడ నేటి ముఖ్యప్రదేశములలో నొకటి. ఈ పట్టణము టైగ్రిస్ యూఫ్రిటీస్ నదుల నడుమ నున్నది. దీనికి సమీపముననే పూర్వకాలపు బాబిలోను నగరముయొక్క శిథిలములు కానవచ్చును. బస్రాపట్టణము రేవుస్థలము. టైగ్రిస్ యూఫ్రటీస్ నదులచే నేర్పడిన అంతర్వేదియందు ఈ పట్టణము కలదు. ఇచ్చటికి పెద్దపెద్ద ఓడలు రాకపోకలు జరుపుచుండును.

### ఇచ్చటి నదుల బావి స్వరూపము

పూర్వకాలపు బాబిలోనియా రాజ్యము టైగ్రిస్ యూఫ్రిటీస్ నదుల మార్గాణము నందలి తుదిభాగమని చారిత్రికులు నిర్ణయించియున్నారు. ఈరాజ్యమున కుత్తర భాగమున అస్సీరియా రాజ్యము వెలసెను. ఈ నదీద్వయమువలన నేర్పడిన డెల్టాయే బాబిలోనియా దేశ మని చెప్పవచ్చును. అతి పురాతన కాలములో ఈ రాజ్యము సస్యసమృద్ధమై పాడి పంటలకును, ధనధాన్యములకును సాటిదేశములలో పేరుప్రఖ్యాతులు గాంచియుండెను. దీనికి కారణభూతములైనవీనదీ మతల్లులే. టైగ్రిస్ యూఫ్రిటీస్ నదులలోని జలమును తమ పొలములలోనికి పారుదలచేసికొని ఆనాటి బాబిలోనియా ప్రజలు వివిధములగు పంటలను పండించుకొనెడివారు. కాని నదీజలములవలన తగినంత సహాయమును పొందుటకు గాను ఈ ప్రజలు ప్రతిసంవత్సరమును మిక్కిలి శ్రమపడవలసి వచ్చెడిది.

ఈ నదీజలములతోపాటు మెత్తని (ఒండు) మట్టి విశేషముగా కొట్టుకొని వచ్చుటవలన నదులును వాటికి సంబంధించిన కాలువలును మెరకయైపోవుటయు, పూడిపోవుటయుకూడ తటస్థించెడిది. వరదలకాలములో ఈనదీరాజములు భీకరరూపములనుదాల్చి తీరములపై పొంగి పొరలి చుట్టుప్రక్కల నుండెడి క్షేత్రములకును, జనపదములకునుకూడ నష్టము కలిగించెడివి. కావున ఆకాలపు బాబిలోనియా ప్రజలు ఈ నదులనుండి వెలువడు కాలువలు పూడిపోకుండ ప్రతిసంవత్సరమును త్రవ్వుచుండుటయు, వర్ష కాలములో నదీజలములు తమ గ్రామములపై దాడివెడలి విజృంభింపకుండ ఎత్తయినగట్లను కట్టుటయు సాగించుచుండిరి. ఇట్టి శ్రమకోర్చిననాడు వారికి నదీజలముల వలన నెంతయో లాభము కలుగుటయు, ఎట్టి నష్టమును సంభవింప కుండుటయు సిద్ధించుచుండెడిది. కాని కొంతకాలము గడచినవెనుక కారణాంతరములవలన బాబిలోనియా ప్రజలీ యావశ్యక కార్యములయెడ అశ్రద్ధ వహింపసాగిరి. దానిచే దేశమునకు తీరనినష్టము సంభవించెను. తగిన పర్యవేక్షణ లేనందున ఈ దేశమునందలి కాలువలు మున్నగునవి పూడిపోయెను. కాలువలు చెడిపోయిననాడు తగిన జలాధారములు లేక పైరు పంటలు నశించెను. దానితో బాబిలోనియా రాజ్యముయొక్క ఆధిక్యతయు, ధనసంపదయు, సౌభాగ్యమునుకూడ క్షీణించెను.

## చరిత్రకారుని కష్టములు

టైగ్రిస్ యూఫ్రటీస్ నదుల వరదలవలన నష్టము పొందినవారొక్క బాబిలోనియా ప్రజలేకాదు. ఆ దేశపు చరిత్ర నెరుంగగోరి పరిశోధన సలుప బూనెడి చారిత్రికులకు కూడ పైనదుల విజృంభణమునవలన తీరనికొరత సంభవించినది. బాబిలోనియా దేశము ఈనదుల చేనేర్పడిన డెల్టాయని మన మెరింగియున్నాము. ప్రతిసంవత్సరమును ఈ నదీప్రవాహ ములు దేశమును ముంచివేసి, విలువగల అనేక వస్తుజాలమును తమతోకూడ సముద్రమునకు గొనిపోయెడివి. ఈ విధముగ నదీజలముల వాతబడిన యమూల్య వస్తుసముదాయములలో పూర్వనాగరకతా చిహ్నములుకూడ చేరియున్నవి. పూర్వపు రాతియుగము, నూతనరాతియుగముల యందు బాబిలో నియా దేశముయొక్క స్థితిగతులు, అచ్చటి ప్రజల నాగరకత, పిత్య జీవితము మున్నగువానినిగూర్చిన యెట్టి చిహ్నములును ఈ నాడుకానవచ్చుటలేదు. ఇవన్నియు ఎప్పటికప్పుడు నదీ ప్రవాహములలో కొట్టుకొని పోవుచుండుటవలన నేను చరిత్ర కారుని కా నాటినిగూర్చిన చరిత్రనెరుంగుట కెట్టియాధారము బును లేవు. బాబిలోనియా దేశములో మానవుని శైశవ దశయు, బాల్యదశయు, నెట్టిస్వరూపమున నుండెడివో తెల్పు టకు మార్గములు కానరావు. ఈ దేశపుప్రజలు చారిత్రిక రంగమున ప్రవేశించుసరికి వీరి నాగరకత ప్రాథమికావస్థను దాటి ఉన్నతదశయందే కాన నగును.

టైగ్రిస్ యూఫ్రటీస్ నదులు చరిత్రకారునికి వలయు పూర్వనాగరకతా చిహ్నములను తమ పొట్టబెట్టుకొనుటయే కాక తమ యింద్రజాలముచే చారిత్రికుల నిర్ణయములను సంశయాస్పదములుగ కాన్పింపజేయుచున్నవి. పురాతనకాలములో నదీతీరమునందు నిర్మింపబడినట్లుగ వర్ణింపబడిన పట్టణాములు నేడు నదీప్రవాహములకు చాలదూరముగ కానవచ్చుచున్నవి. పూర్వకాలములో రేవుపట్టణము లని వ్యవహరింపబడిన ప్రదేశములు నేడు సముద్రతీరమున లేవు. ఎచ్చటనో దేశమధ్యమున కాన్పించుచున్నవి. ఒకానొక కాలమున " నిప్పూర్ " " ఎరిక్ " " లార్సా " అను పట్టణములు యూఫ్రటీస్ నదీతీరమున నుండెడివి. ఇప్పు డవి నదీప్రవాహములకు చాలదూరమున తూర్పున కానవచ్చును. "ఇరీధూ" అను ప్రదేశ మాకాలమున దేశమునకు దక్షిణమున సముద్రసమీపమున నుండెడిది. ఇచ్చటినుండి యొక సరస్సుమీదుగా సముద్రమునుచేరుటకు పూర్వకాలములో అవకాశముండెడిది. అదియునుగాక ఆ పూర్వయుగము నాటికంటె బాబిలోనియా దేశము నేడు విస్మృతముగ కానవచ్చుచున్నది. ఈనాడు టైగ్రిస్ యూఫ్రటీసు నదులు రెండును " కారున్ " అను ప్రదేశమున కలసిపోయి సముద్రమువైపు ప్రవహించుచున్నవి. మరి కొంత దిగువకు "కారున్" అను నదివచ్చి వానియందు సంగమమగుచున్నది. కాని పూర్వయుగమునందీ నదులు ప్రత్యేకముగ ప్రవహించి సముద్రములో కలియు

చుండినట్లు వర్ణింపబడినది. ఈ యంశము లన్నిటికిని కారణము టైగ్రిస్ యూఫ్రటీస్ నదుల విచిత్రవర్తనయే కాని వేరు కాదు. టైగ్రిస్‌నది పూర్వయుగమునందును నేడును కూడ సుమారొకేమార్గమున ప్రవహించుచున్నది. కాని యూఫ్రటీస్ నదిమాత్రము సముద్రప్రదేశమును ప్రవేశించినప్పటినుండియు క్రమక్రమముగ పశ్చిమాభిముఖముగ నెట్టుకొనివచ్చుటవలన పూర్వకాల మీ నదీతీరమున నుండెడి పట్టణము లీనాడు చాల తూర్పునకు కానవచ్చును. అదియునుగాక పూర్వము పర్షియా గుడమువద్ద సముద్రము నేటికంటె సుమారు నూట యిరువదిమైళ్ళు దేశములోనికి చొరుచుకొని పోయియుండెడిది. కాని అనేకశతాబ్దములలో టైగ్రిస్ యూఫ్రటీస్ నదులు క్రమక్రమముగ తమ వండుమట్టిచే క్రొత్త భూభాగములను నిర్మాణముచేయుచు సముద్రుని వెనుకవెనుకకు నెట్టినవి. కావుననే పూర్వకాలమునాటి రేవుపట్టణములు నేడు రేవుపట్టణములు కాకుండుటయు, ఒకానొకప్పుడు ప్రత్యేకముగ ప్రవహించుచు సముద్రములో కలసెడి టైగ్రిస్, యూఫ్రటీస్ కారున్ నదులు నేడు మూడునుకలిసి సముద్రాభిముఖములై ప్రవహించుటయు కానవచ్చుచున్నది. వీనికన్నిటికి పైన పేర్కొనబడిన నదీరాజముల యింద్రజాలమే కారణము. నేడు సైతము ఇచ్చట ముప్పది సంవత్సరములలో ఒక మైలు చొప్పున సముద్రము దక్షిణమునకు తగ్గుచున్నదని భూగోళ శాస్త్రజ్ఞులు తెల్పుచున్నారు.

కాల్డియాయను నామముతో ప్రాచీనకాలమున వ్యవహరింపబడిన భూభాగము ఈనాటి మెసపొటేమియా రాష్ట్రమునందలి దక్షిణభాగము. కొంతకాలము గడచిన వెనుక దీనినే బాబిలోనియా దేశమని పిలిచెడివారు. బాబిలోన్ అను సుప్రసిద్ధ నగర మిచ్చట వెలయుటచే నీప్రాంతమునకీ నామము సిద్ధించెను. కాని యీ దిగువ వర్ణింపబడు విషయములన్నియు అతి పురాతనకాలమున అనగా బాబిలోన్ నగర స్థాపనమునకు పూర్వమే సంభవించినవి. ఆపురాతన దేశమును చరిత్రకారులు కాల్డియా యని పేర్కొని యున్నారు.

## ప్రాచీననివాసులు

ఈ కాల్డియా దేశమునందలి ప్రాచీనవాసు లెవ్వరు? వారేజాతికి చెందినవారు? వారీ దేశమునందే అనాదినుండియు నివసించుచుండిరా లేక మరెచ్చటినుండియైన యిచ్చటికి వలస వచ్చిరా? మున్నగు ప్రశ్నలకు సదుత్తరములను సాధించుట మనప్రథమ కర్తవ్యము. కాని యీప్రశ్నల కాధునిక చారిత్రిక దృష్టిలో నిస్సంశయములును, సత్యగర్భితములును, అని చెప్పదగిన సమాధానము లొసంగుట కష్టసాధ్యము. ఏలయన ఈ సమస్యలను పరిష్కరించుటకు సాధనభూతములగు చరిత్రాంశము లేవియును మనకు లభ్యము కాలేదు. ఊహాలపై యాధారపడి నేటి చారిత్రకులు వీనికి సమాధానమొసం

గుచున్నారు. ఈ యూహలు కేవలము గాలిమేడలు కావు. క్రైస్తవమత గ్రంథమైన బైబిలునందు వర్ణింపబడిన వంశాను క్రమణిక నాధారము చేసికొని ఈ యూహలు గావింపబడినవి.

బైబిలుగ్రంథమునందొక ప్రళయము వర్ణింపబడినది. ఆ ప్రళయము మానవ చరిత్రయం దొక ముఖ్యమైన ఘట్టము. ఈ ప్రళయ సమయమున పుష్కలావర్త మేఘములు విడివడి ప్రపంచమునంతను జలమయము గావించివైచెను. ఆ మహా విపత్తునందు నోహా అను పురాణ పురుషుడు, తనకు అత్యంత సన్నిహితులగు కొందరితో మాత్రము ప్రాణములు దక్కించు కొనగల్గెను. ప్రళయమందు సృష్టియంతయు నశించెను. ఆపైన పుణ్యపురుషుడైన నోహా సంతతివారు మాత్రమే ప్రపంచ మంతయు వ్యాపించి వృద్ధిచెందిరి. ఈ నాటి శ్వేతజాతులును, సెమిటిక్ జాతులును, కూడ ఈ నోహా వంశమునందుద్భవిం చినవారే. వీరిలో కొందరు కాలక్రమమున ప్రాగ్దేశములలో సంచరించుచు, షీనార్ అను ప్రదేశమునకు వచ్చి అచ్చట నిలచిపోయిరని బైబిలు గ్రంథమునందలి జెనిసస్ (ఉత్పత్తి క్రమము) అను అధ్యాయమునందు తెలుప బడినది. షీనార్ అనగా బాబిలోనియా రాష్ట్రము. నోహా అను నాతనికి ముగ్గురు కుమారులు. షెమ్, హామ్, జాఫెత్ అని వీరి నామ ములు. వీరిలో ప్రథముడైన షెమ్ అనునాతని వంశమునం దుద్భవించిన వారెల్లరును షెమిటిక్, లేక సెమిటిక్ జాతుల వారు. ఈ సెమిటిక్ జాతివారిలో కొందరు పైనచెప్పబడిన

విధమున బాబిలోనియా దేశమునకు వచ్చిరట. ఈ వలస వచ్చిన వృత్తాంతము బైబిలు గ్రంథమునందు వర్ణింపబడిన మహాప్రళయమునకు పిదపనే సంభవించినది. కాని వారచ్చటికి వచ్చుటకుపూర్వమే అచట మరొక జాతివారు నివసించుచుండిరట. ఆ జాతివారు చిరకాలమునుండి అచ్చట నివసించుచుండినట్లు కూడ తెలియుచున్నది. అలెగ్జాండరు వీరుడు బాబిలోనియా దేశమును జయించిన కాలములో, అచ్చట బెరోసస్ అను పేరుగల విద్వాంసు డొకడుండెడివాడు. ఇతడు గ్రీకు భాషయందు తన దేశపుచరిత్ర వ్రాసెను. కాని ఆ గ్రంథ మునొక్క ప్రతులు లభ్యమగుట లేదు. బెరోసస్ గ్రంథము మిక్కిలి ప్రామాణికమైనదిగ తోచుచున్నది. ఏలయన తరువాత కాలమునందు బాబిలోనియా చరిత్ర వ్రాసినవారు పలువురీతని పుస్తకమునందలి యంశములను తరచు పేర్కొనెడి వారు. 'అనాదియందు కాల్డియా దేశమున విదేశీయులగు కొందరు నివసించు చుండెడివారు' అని బెరోసస్ వ్రాసి యున్నాడు. నోహా వంశస్థులు బాబిలోనియా దేశమున కేతెంచినప్పుడు వారీదేశమునందు కనుగొనిన ఆదిమనివాసు లును, బెరోసస్ విదేశీయులని వర్ణించినవారును ఒక్కరే. వీరినే కాల్డియా ప్రజలని పిలుచుచున్నారు.

చారిత్రకులీ కాల్డియా ప్రజలను తురేనియన్ తెగకు చెందిన వారని నిర్ణయించియున్నారు. ఈనాటితురుష్కులీ తెగకు సంబం ధించినవారు. ఈ తెగకు చెందినకొన్ని అనాగరక సంఘములు

సైబీరియాయందును, తూర్పు రష్యాయందును కానవచ్చు చున్నారు. వీరిని బష్కీరులు, కిర్ఘీజులు, ఆస్ట్రియాకులు,అని కొన్ని తెగలుగ విభజింపవచ్చును. ఈతురేనియన్ తెగవారు శ్వేతజాతులలో చేరరు. వీరు పచ్చజాతులవారు. చైనా, మంగోలియా దేశస్థులీ వర్గమునకు చెందనవారే. ఈ పచ్చజా తులయందొక లోపము సర్వత్ర కానవచ్చుచున్నదనిపాశ్చాత్య విద్వాంసుల వాదము. వీరు తమ బుద్ధికుశలతచే అనేక నూతన విషయములను కనుగొని మానవ వికాసమునకు పునా దివేసినారు. కాని క్రమక్రమముగ నభివృద్ధిచెంది నాగరకతాశిఖ రమునధిష్ఠింపగల యోగ్యత వీరియందులేదు. నాగరకతా పథ మునందు కొంతదూరమువరకును మాత్రము సాగిపోయి అచ్చ టనే వీరు నిలువబడి పోదురు. తమ వాదమును బలపరచు టకై వీరు చీనాజాతివారి నుదాహరణముగ తీసుకొను చున్నారు. చీనాజాతివారతి పూర్వకాలముననే గొప్ప సామ్రాజ్యమును స్థాపించి, గొప్ప వాఙ్మయము నభివృద్ధి కావించి కాగితములను తయారుచేయుట, తుపాకిమందును సిద్ధపరచుట మున్నగు ఘనకార్యముల నెన్నిటినో అనేక శతా బ్దములకు పూర్వమే సాధించిరి. కాని వీనినత్యున్నత స్థితికి కొని రాజాలరైరి. లిపి నిర్మాణమును కావించిన ప్రాచీన జాతులలో చీనావారొక్కరు. కాని వారిలిపి కొంతవరకు మాత్రమే అభివృద్ధిచెంది ఆ పైన ఎదుగుపొదుగులులేక నిలు కడ చెందెను. శ్వేతజాతులలో మాత్రమిట్టిలోపము కానరాదని

విద్వాంసుల భావము. పచ్చజాతులవారు శ్వేతజాతులతో సంపర్కము కలిగించుకొనిన సందర్భములలో మాత్రము వారి నాగరకత లోపభూయిష్ఠముగాక దినదినాభివృద్ధి చెందుచు నెప్పటికిని ముందంజయే వేయుచున్నదట. బహుశః పచ్చ జాతులవారియందలి యీ లోపమేదైన శాపమువలన సంభ వించినదేమో!

బైబిలుగ్రంథము ప్రమాణమని నమ్మినవారికి ట్యురా నియన్ లేక పచ్చజాతులవారియందు కానవచ్చుచున్న యీ నైసర్గిక లోపమునకుగల కారణము కరతలామలకమువలె స్పష్టముగా నున్నది. పురాణ దంపతులైన ఆదమ్, ఈవ్ గార్లకు మొదట యిరువురు కుమారులు కల్గిరి. అందు జ్యేష్ఠుడు కైన్ అనువాడు ఏబెల్ అనువానిని చంపెను. అందు లకు కోపగించి భగవంతుడు కైన్‌ను నీవు నిలువ నీడలేకుండ దేశములపాలై చెట్టుమీదపక్షివలె తిరుగుచుందువుగాకయని శపించెను. అంతట కైన్‌స్వదేశమును విడచి పూర్వాభిముఖమున వెడలిపోయి యొక దేశమునందు నివసింపజొచ్చెను. ఈతనికి చాలమంది పుత్రులుండిరి. అందైదవవాడైన లామేకునకు ముగ్గురుకుమారులు. జాబాల్, జుబాల్ అను మొదటియిద్ద రును, వ్యవసాయదారులుగను, గొర్రెల కాపరులుగను తమ జీవితమును గడపిరి. మూడవవాడైన ట్యూబాల్కైన్ అను వాడు లోహముల యుపయోగమును కనిపెట్టి ఇనుము ఇత్తడి మున్నగు వానితో వివిధములగు ఆయుధములను సిద్ధ

పరచు చుండెడివాడు. ఈ విధముగ శాపగ్రస్తుడైన కైన్ అను నాతడును, అతని సంతతివారును భ్రష్టులై దేశముల పాలైరి. వీరు భగవదనుగ్రహ దూరులు. అందువలననే బైబిలు గ్రంథమునందు వీరి ప్రశంసలేదు. ఆదమ్‌యొక్క మూడవకుమారుడైన సెత్ అనువాడు పుణ్యాత్ముడు. ఈతని వంశమునందే నోహా అను మహాత్ముడు జన్మించెను. ఈ వంశస్థులెల్లరును భగవదనుగ్రహమునకు పాత్రులు. ఆ కారణముచే మహా ప్రళయము సంభవించినప్పుడు సైతము భగవంతుడు వీరిని రక్షించెను. బైబిలునందు వీరి ప్రశంస యెంతయో గలదు. బైబిలు గ్రంథమునందు కైన్‌యొక్క వంశీయుల ప్రసక్తి లేనంతమాత్రమున వారు నశించిపోయిరని తెలుపజాలము. పాపులైన కారణమున వారి చరిత్రకు పవిత్రగ్రంథమైన బైబిలులో తావు దొరకలేదు. వీరే పచ్చజాతివారనియు, ట్యూరానియన్ తెగవారనియు పిలువబడుచున్నారు. ఈ జాతివారే కాల్డియా రాష్ట్రపు ఆదిమనివాసులు. పుణ్యాత్ముడైన సెత్ వంశస్థులు సెమిటిక్ ప్రజలు, తెల్లజాతులవారు మున్నగువారు. ప్రపంచమందన్ని దేశములలోను ఈ రెండు తెగలవారికిని వైరము సంభవించి, అన్ని సందర్భములలోను కూడ పచ్చజాతులవారే యోడిపోయిరి. పచ్చజాతులయందుగల నైసర్గిక లోపములకు కూడ వారి మూలపురుషుని దుష్కార్యఫలితమైన భగవచ్ఛాపమే కారణమని క్రైస్తవవిద్వాంసులవాదము.

'అఘర్ బనిపాలు అను అస్సీరియారాజు గ్రంథాల యమునందు వెలువడిన ఇటుకలును (ఆ కాలములో ఇటుకలపై వ్రాయుచుండెడివారు) పరీక్షింపగా రెండు విధములైన భాషలు కానవచ్చినవి. ఒకటి పురాతనకాలపు కాల్డియా భాష. రెండవది తరువాత కాలమున అస్సీరియా దేశీయులు వాడుచుండెడిభాష. ప్రాచీన కాల్డియాభాష ట్యూరానియన్ తెగకు చెందిన జనుల భాషయని నిశ్చయముగ సిద్ధాంతీకరింప వచ్చును. ఈ భాషలయందు విభక్తి ప్రత్యయములు లేవు. ఆకారణమున నీభాషయందలి పదము లొండొంటితో సమ న్వయముకాక, వాక్యములు ఉద్దేశ్య శూన్యములైన మాటల ప్రోవులవలె కానవచ్చును. అతి పురాతన కాలమునాటిభాషల కిదియొక లక్షణము. ఈ కాల్డియాదేశమునందలి దక్షిణ ప్రాంతమునకు సుమేరు దేశమనియు, ఉత్తర ప్రాంతమునకు అక్కాడ్ దేశమనియు భిన్ననామములుండిన. కారణమున నీ ప్రజలకు సుమేరు అక్కాడ్ ప్రజలనియు కూడ పేరుకలదు. వీరి భాషను సుమేరు అక్కాడులభాష లేక అక్కాడుభాష యని మనము సూచింపవచ్చును. కాని ఈ ప్రజలు ప్రథమదశ యందు కాల్డియా దేశమునకు దక్షిణప్రాంతమున నివసించి, క్రమక్రమముగా నుత్తరదిక్కునకు సాగిపోయినందువలన దాక్షి ణాత్య భాషకును, ఔత్తరాహభాషకును కొంచెము భేదము కల్గుట సంభవించెను,

'అక్కాడ్' అను పదమునకు ఈ ప్రాచీన భాషయందు పర్వతమని యర్థము. దీని ననుసరించి ఈ అక్కాడ్ ప్రజలు పర్వతమయమైన దేశమునుండి వచ్చినవారని యూహించుట తప్పుకాదు. కాని పారసీక గుడమునకు సమీపముననున్న కాల్డియా మైదానములలో కొండలెక్కడివి? కావున నీప్రజలు పర్వతమయమైన మరియొక దేశమునుండి యిచ్చటికి వచ్చి యుండవలెను. ట్యూరానియన్ జాతుల కన్నిటికిని ఉత్పత్తిస్థా నము సైబీరియా పర్వత పంక్తులలో నొకభాగమగు అల్టాయి కొండలని నిర్ణయింప బడినది. ఈనాటివరకును కూడ ఇచ్చటి ప్రజలు స్థిరనివాసములేక గుంపులు గుంపులుగా అచ్చటచ్చట తిరుగుచుందురు. ఈ ట్యూరానియన్ జాతులందరకును కూడ కొన్ని విశ్వాసములు కలవు. వారి నమ్మకముల ప్రకారము స్వర్గమను నది అల్టాయి కొండలలోని యొక ప్రశాంతమైన లోయ. ఇచ్చట చక్కని సెలయేరులెన్నియో ప్రవహించుచుం డును. ఈ ప్రదేశములో ట్యూరానియన్ జాతికి చెందిన ఆదిమ ప్రజలు నివసించుచుండిరి. చాలకాలము వరకును వారిచ్చట సుఖజీవనమును గడిపిరి. కాని జనసంఖ్య పెరిగిన కారణమువలన వారిలో కొందరీలోయలను విడచి బహిఃప్రపంచమును ప్రవేశిం తమని ప్రయత్నింపగా వారికది సాధ్యము కాలేదు. ఈలోయ లచుట్టును ఎత్తైన పర్వతములు కలవు. వానిని దాటుట ఈ ప్రజలకు సాధ్యపడలేదు. వీరిలో బుద్ధిమంతులైన కొందరు తమ చుట్టునుగల కొండలు ఇనుముతో కలిసిన మట్టితో యేర్పడిన

వని గ్రహించి, బ్రహ్మాండమగు కొలుములను నెలకొల్పి కొంతలనుకరిగించి తాము వెడలిపోవుటకు త్రోవలను కల్పించుకొనిరి. ఈవిధముగా వీరికి వివిధ లోహములను వాడి వానిచే పనిముట్లుచేయుట తెలిసివచ్చెను. బైబిలునందు పేర్కొనబడిన ట్యూబాల్కైన్ అనువాడు వివిధ లోహములతో పనిముట్లను ఆయుధములను సిద్ధపరచుటలో సమర్థులని తెలుపబడినది. ఈవర్ణనమునకును, ట్యూరానియన్ తెగ వారిపురాణములకును గల సామ్యము గమనింప దగియున్నది.

## మత విశ్వాసములు

కాల్డియా నివాసులు ప్రపంచమునందలి అతి ప్రాచీన జాతులలో నొక్కరని పై విషయములవలన తేలుచున్నది. కావున వీరి నాగరకతనుగూర్చిన యంశములుముఖ్యముగ తెలిసికొనదగినవి. మానవునియందు భగవద్భక్తి యొక సహజగుణము. ఇతర జంతువులనుండి మానవుని వేరుపరచు లక్షణములలోనిది ముఖ్యమైనది. సృష్టియందు మానవాతీతమగు నొక విశిష్టశక్తి కలదనియు, మానవుడు దానికి లోబడవలయునను, కాని, ఆశక్తి మానవుని చెప్పు చేతలలో నుండునది కాదనియు, యెరుంగుటమతమునకు ప్రథమదశయని తెలుపవచ్చును. సృష్టియందలి కొన్ని శక్తులవలన మనుష్యునికి సహాయమును, కొన్నిటివలన నష్టమును కలుగుచున్నట్లు గ్రహించి, తనకు సహాయభూతములగు శక్తులయెడల భక్తి గౌరవములు కలిగి వానిని పూజించుటయు, వానిని ఉత్తమశక్తులని వర్ణించుటయు, తనకు

నష్టమాపాదించు వానియెడల భయముతో వర్తించి ఆదుష్టశక్తులను ప్రార్థనాదికములచేతను బలిదానములచేతను సంతృప్తిపరచుటయు, మత పరిణామమునందలి రెండవదశయని వర్ణింపనగును. కాల్డియా దేశమునందలి ప్రాచీననివాసులమతమీతరగతికిచెందినదని నిర్ధారణగ తెలియుచున్నది. అఘుర్ బనిపాలురాజు గ్రంథాలయమునందు లభ్యమైన ఇటుకలలో రెండునూర్ల ఇటుకలపై యొక మతగ్రంథము వ్రాయబడినది. దానిని మూడుభాగములుగ విభజింపవచ్చును. ఒకభాగములో దుష్టశక్తులను గూర్చియు రెండవభాగమునందు వివిధ జాడ్యములను గూర్చియు ప్రశంస గలదు. మూడవభాగమునందు ప్రార్థనాదికములు కానవచ్చినవి. ఈ మూడవభాగమున సూచింపబడిన మతవిశ్వాసములు మొదటివానికంటె ఉన్నతశ్రేణికి చెందియున్నట్లు తెలియుచున్నది.

ప్రాచీన కాల్డియా నివాసుల విశ్వాసము ప్రకారము ప్రపంచమునంతను పాలించు దేవుడు జి ఆనా అనునాతడు. ఈతడాకాశమున నివసించును. భూమినంతను చుట్టియున్న సముద్రమునందు మరియొక దేవుడు కలడు. ఈతడు భూమినికూడపాలించును. ఈతని నామము ఇయా. ఈదేవుడొకప్పుడు మత్స్యరూపమున నీటియందు సంచరించును. మరికొన్ని సందర్భములలో నీతడద్భుతమైన యోడయందు ప్రపంచమును చుట్టి వచ్చుచు లోకసంరక్షణము కావించుచుండును. ఆకాశమునందేడు గ్రహములుకలవు. ఇవి మనుష్యులకు శుభమును గల్గించును. వీనితోపాటు మరికొన్ని దుష్ట గ్రహములుకూడ కలవు. ఇవి మను

పశుజాతికి హానికరమైనము ప్రాప్తింపజేయును. ఈ దుష్టగ్రహములు భయంకరములై వ్యాధులను పీడించుచుండును. ఇయ్యవి ఒకపర్యాయము లోకమును నాశనముచేసి చంద్రుని పద భ్రష్టుని చేయవలెనని యత్నించె కాపాడెను. భూమండలమునకు లోపల, ఆకాశలోకమునందు ఏడు దుష్టగ్రహములు కలవు. అవి యొకటివానికి చెడుకూడ దుష్టములు. ఇవి భూకంపములు, ఉప్పెనలు, జంఝామారుతములు మున్నగువానిని కల్పించును. ఈ యేడు గ్రహములును మిక్కిలి క్రూరము లనియు, వీనిని ప్రార్థనాదికములచే కూడ సంతోషపరుప జాల మనియు, కాల్డియా పురాణములలో వ్రాయబడినది. మానవులకు సంభ వించెడి కష్టపరంపరల కన్నిటికిని కారణ మీ దుష్టగ్రహములే. ఈ గ్రహకూటము కొండలు, మురికి ప్రదేశములు, మున్నగు స్థానముల నాశ్రయించును. ఈ ప్రాచీన కాల్డియా నివాసులు మృత్యువును గురించికూడ మిక్కిలి భయము చెందుచుండిరి.

మృత్యులోక మంధకార బంధురముగ నుండును. దీనిపాలన యొకస్త్రీ దైవముయొక్క అధీనములో నుండును. ఆమెను పాతాళమునకు రాణి యని వ్యవహరించు చుండిరి. ఈరాణికి నమ్తార్ అనెడుగ్రహము ప్రధానమంత్రి ఈ గ్రహము సమస్త జాడ్యములకును మూలము. మనుష్యులకు సంభవించు ఆపదలు దుష్టగ్రహముల వలననేకాక కొన్ని సందర్భములలో మాంత్రి కులు, తాంత్రికులు మున్నగువారివలనకూడ సంభవింప వచ్చును. అంతేకాక కొందరు మనుష్యుల చూపులయందే

దుష్టత్వము కలదు. అది అమనుష్యులకే తెలియకపోవచ్చును. కాని ఇట్టివారిదృష్టి యెవరిపైన ప్రసరించునో వారు కష్టముల పాలగుట తథ్యము. రోగములు మున్నగునవి భౌతిక నియమముల నతిక్రమించుటవలన సంభవించుననుభావము వారియందు లేకుండెను. వీని కన్నింటికిని మూలము ప్రకృతియందుగల దుష్ట శక్తులే. ఈశక్తులయందు మంచియనునది మచ్చునకైననుండదు. ప్రార్థనాదికములు వాని చెవులలో చొరజాలవు. కావున వీనిని బలాత్కారముగ నోడించి తరిమివేయవలెను. ఇట్టిభావములుగల ప్రాచీన కాల్డియా నివాసుల మతమే తరగతికి చెందినదో వేరుగ తెలుపనక్కరలేదు. వీరిమతమునందు సాధువులును విద్వాంసులు నగు పురోహితులకంటె దాంభికులగు మాంత్రికులకే యెక్కువ ప్రాముఖ్యత లభించును. ఈ మాంత్రికులు దుష్ట గ్రహములను తమశక్తిచే ఉచ్చాటనము కావించి,వానిని పాతాళమునకును, కొండలమీాదికిని, మురుగు ప్రదేశములకును, ఎడారులలోనికిని తరిమివైచినట్లు ప్రచారము చేయుచుండెడివారు. అస్సీరియాయందలి గ్రంథజాలమును పరీక్షించి, ప్రాచీన కాల్డియా పరిస్థితుల నవగతము చేసికొనిన జార్జిస్మిత్, సర్ హెన్రీ రాలిన్సన్ మున్నగు విద్వాంసులీ యభిప్రాయమును వ్యక్తపరచిరి.

మనుష్యులకు సంభవించు వివిధకష్టపరంపరలను దూరము కావించుటకై మంత్ర తంత్రములేకాక భగవత్సహాయము కూడ అర్థింపబడుచుండెడిది. ఇట్టిసహాయము కావించువాడు

ఇయా దేవుడు. ఈతడు మత్స్యాకారమున నీటియందు నివసించు చుండును. లోకసంరక్షణమే యీతని లక్ష్యము. ఈ దేవుని నామ మనిన దుష్టగ్రహములకు సింహస్వప్నము. కావున కష్టములలో చిక్కుకొనిన వారెల్లరును ఇయా దేవుని శరణు వేడెదరు. కాని యీ దేవుడు మహోత్కృష్టుడైన ప్రభువు. ఈతనిని సమీపించుటకు సామాన్య మానవులకు యోగ్యతలేదు. కావున ఇయా కుమారుడును, మిక్కిలి దయార్ద్ర హృదయుడును, అగు మెరిడుగు అనునాతడు తనతండ్రికిని దుఃఖిత మానవ జాతికిని మధ్యవర్తిగ నుండును. ఈతడు మనుష్యులు పడెడి బాధలుచూచి సహింపలేక తండ్రికడకుపోయి వారు చెందుచున్న దుఃఖములను వర్ణించి, దుఃఖ నివారణమునకు సాధనమును తెలుపు మని ప్రార్థించును. ఇయా సర్వజ్ఞుడు. ఈయనకు తెలియని విషయములేదు. కావున తత్క్షణమే యీతడు మానవుని కష్టములు నశించు సాధనమును తనకుమారుని కుపదేశించును. ఈ కుమారుడు పురోహితులు మున్నగు వారి కీదుఃఖ నివారణోపాయములను తెలియజేయును. కాల్డియా గ్రంథములలోని ప్రార్థనాదికముల సారాంశమిదియే.

దుష్టగ్రహములను తరిమివేయుటకును, శుభగ్రహముల నావాహనము చేయుటకును ప్రాచీన కాల్డియా నివాసులు తాయెతులను తరచుగ వాడుచుండిరి. వీనిపై మతసంబంధములైన ప్రార్థనాదికములను వ్రాయుచుండెడివారు. ఈ తాయెతులు బట్టపీలికలు, రాళ్ళు, మంటివిగ్రహముల రూపమున నుండెడివి.

దృష్టి పరిహారార్థమై హైందవ దేవాలయములపై కొన్ని అస భ్యపు బొమ్మలను చిత్రించినట్లే, ప్రాచీన కాల్డియా నివాసులు తాము నిర్మించెడి మందిరములలో వివిధ భాగములందు దుష్ట గ్రహములను తరిమివేయజాలు బొమ్మలను అభిమంత్రించిప్రతిష్ఠా పనము చేసెడివారు. గొప్పగొప్ప భవనముల గోడలపై రాక్ష సులు యుద్ధముచేయుచున్నట్లు చిత్రములు గలవు. ఈప్రాచీన సంప్రదాయము ననుసరించియే అస్సీరియాప్రభువులు తమ రాజ మందిరముల వాకిళ్ళయందు రెక్కలుగల మనుష్య వృషభము లను ప్రతిష్ఠించెడివారు. వీనివలన దుష్టశక్తులు భయపడి ఆయా మందిరములను చేరరావని వీరినమ్మకము. గుండ్రని యాకారము గలిగిన ముద్రిక లనేకములు ప్రాచీన కాల్డియా శిథిలములలో లభించినవి. దీనిపై వివిధము లగు విగ్రహములు చిత్రింపబడి యుండును. ఈముద్రికలనుకూడ పూర్వకాలమునందు తాయె తులుగ వాడుచుండి రని యూహింపవచ్చును. దుష్టగ్రహముల యాకారము సహజముగ వికారముగ నుండు ననియు, ఆకారణ మున వాని ప్రతిమలను సిద్ధపరచి గ్రహపీడవలన బాధపడువారి సమీపమున నుంచినయెడల ఆదుష్టశక్తులు తమ వికారస్వరూప మునుచూచి భయపడి పారిపోవునని యీ ప్రాచీనులు తలంచు చుండిరి. దుష్టశక్తులలో నైరుతిమూలనుండి వీచెడి వాయు వున కధిదైవమొక్కటి. కాల్డియా దేశముపై నైరుతిదిక్కునుండి ఎడారిగాలులువీచి పైరుపంటలను నాశనము చేయుచుండెడివి. ఆకారణముచే నైరుతి వాయువునకు దుష్టత్వ మాపాదింప

బడుట సహజమేకద? ఈదుష్టశక్తియొక్క కంచు విగ్రహ మొక్కటిలభ్యమైనది. దీని దేహము కుక్క దేహము. పాదములు గామబందువుల పాదములవంటివి. బాహువులు మనుష్యునివే కాని చేతులు సింహపాదములవలె నుండును. శిరస్సు అస్థిపంజ రము శిరస్సు. దానిలో మేకకొమ్ములుండును. వెనకభాగమున తేలుకొండి. ఇట్టి వికారస్వరూపములనుజూచి మనుష్యులమాట యటుంచి, భూతములుకూడ పారిపోవునని తెలిసినను అంతా శ్చర్యములేదు. దుష్టగ్రహముల నుచ్చాటనముచేయుటకై వాని ప్రతిమలను సిద్ధపరుపవలె నను రహస్యమును లోకపాలకుడైన ఇయా తన కుమారుని కుపదేశించెను.

## దైవతములు

లోకసంరక్షణ మను మహాకార్యమును 'ఇయా' దేవు డొంటరిగ చేయుటలేదు. అతనికి సహాయముగ మరికొన్ని ఉత్తమ శక్తులుకూడ నిరంతరము పాటుపడుచుండును. అట్టి వానిలో వర్షమును కురిపించు 'ఇన్ని' దేవు డొకడు. సూర్య చంద్రాదులును, అగ్నియునుకూడ ఇట్టి ఉత్తమ శక్తులలో మిక్కిలి ప్రాముఖ్యత వహించుచున్నారు. సూర్యభగవానుని యెడల ప్రాచీన కాల్డియానివాసుల కత్యంత భక్తి తాత్పర్యము లుండెడివి. ఈ దేవుడు పైరు పంటలను వృద్ధిపొందించును. అంతేకాక తన దివ్యప్రకాశముచే భూత ప్రేతాదులకు నిలువ నీడ లేకుండ తరిమివేయును. ఇట్టి దుష్టగ్రహములు చీకటి యందేకాని వెలుతురులో నిలువజాల వని వారు తలంచు

చుండిరి. ఈ దేవుడు రాత్రియందు భూత ప్రేతాదులకు నివాస భూమియైన పాతాళమునకు పోయి వారి స్వస్థలము నందే వానితో యుద్ధము సాగించును. ఈ కారణములచే మార్తాండుని వేయివిధముల .స్తుతించుచు ప్రాచీన కాల్డియా ప్రజలు గొప్ప స్తోత్రములను రచించిరి. వీనియం దుత్తమ శ్రేణికి చెందెడి కవిత్వము ద్యోతక మగుచున్నది. సూర్యుని అంశ అగ్నియందు కలదు. ప్రకాశ మతని సహజగుణము. ఈతడు లోహములను శుద్ధిచేయును. వానిని మేళవించుటకు కూడ అగ్ని దేవుని సహాయ మావశ్యకము. కాల్డియాప్రజలు ఇనుమునకు మారుగ కంచును విశేషముగ వాడుచుండి రని మనము జ్ఞప్తియం దుంచుకొనవలయును. తగరమును రాగిని కలిపి కరగించి కంచును సిద్ధపరచుచుండిరి. అగ్ని పవిత్రమైనది. అది యన్ని పదార్థములను పరిశుద్ధము చేయును. రోగములను తరిమివేయును. ఆరోగ్యవృద్ధికై అగ్ని సహాయపడు నను ఈ సూక్ష్మాంశమును ప్రాచీన కాల్డియా దేశమునుండి గ్రీకులు తెలిసికొని యుండవచ్చును. క్రీస్తునకు 400 సంవత్సరములు పూర్వము ఏథెన్సు నగరమున గొప్ప అంటుజాడ్యములు ప్రబలిన సందర్భమున విఖ్యాత యవన భిషగ్వరుడైన హిప్పోక్రాటెసు అను నాతడు పట్టణమునందు వివిధభాగములలో గొప్ప యగ్నులను స్థాపించి, ఆవిధముగ జాడ్యము నరికట్టెనట. పైన తెలుపబడిన యనేక కారణములచే అగ్నినికూడ

కాల్డియాప్రజలు పూజించెడివారు. వారి పురాణములలో అగ్నికి " జిబిల్ " అని పేరు.

ఆదిమదశయందు భూతపిశాచాదులయందు నమ్మికతో మాత్రము ప్రారంభమైన ప్రాచీన కాల్డియా మత మెవిధముగ ఔన్నత్యమును పొందెనో ముఖ్యముగా గమనింప దగియున్నది. ప్రకృతియంతయును దుష్టశక్తులతో నిండియున్నదను భావముతో కాల్డియా మతము ప్రారంభించెను. ఆ కాలమునందు వారి మతగురువులు మాంత్రికులు, భూతవైద్యులు మున్నగు వారు మాత్రమే. మరికొంత కాలమునకు సూర్యచంద్రాదులు అగ్ని మున్నగు ప్రకృతిశక్తులు వారిదృష్టి నాకర్షించెను. ఈ శక్తులవలన మనుష్యునికి విశేషసహాయమును, సుఖమును లభించుట వారు గమనించిరి. అప్పుడప్పుడు సూర్యునివలనను, అగ్ని వాయువులవలనను తమకు ప్రమాదములు హాని మున్నగునవి సంభవించినను, మొత్తముమీద నీశక్తులు మానవునికి క్షేమదాయకము లని వారు గుర్తించిరి. ఈ యుత్తమ శక్తుల యెడ భక్తిభావము, గౌరవమును వృద్ధిపొందెను, భక్తిగౌరవములతో కృతజ్ఞతకూడచూపట్టనాగెను. ప్రకృతి శక్తులయందలి సౌజన్యత, ఉపయుక్తత మున్నగువానిని కనుగొనుటయే భగవద్భక్తిమున్నగువానికి ప్రథమసోపానము. ఇట్టి భక్తిభావముతో వ్రాయబడిన యనేక ప్రార్థనాగీతములు కాల్డియా మత గ్రంథములలో కానవచ్చును. సహజముగ సౌజన్యముగల సూర్యుడు అగ్ని మున్నగుశక్తులు కొన్ని సందర్భములలో

ప్రళయాకారమును ధరించి ప్రపంచమును భస్మముచేసిమనుష్యు నికి తీరని నష్టము కలిగించుట యెట్లు సంభవించుచున్నది ? ఈ జిజ్ఞాస కొంతకాలము జరిగెను. మనుష్యుడీయుత్తమశక్తుల కాగ్రహముకలిగించు విధముగ ప్రవర్తించి యుండుటవలననే ఈ ఉత్తమ శక్తులు భయంకర స్వరూపమునుదాల్చి మనుజుని నష్టపరచుచున్నవి. కావున మనుష్యుడీ శక్తుల కాగ్రహము కలి గించునట్లుగ ప్రవర్తింపరాదు. అనగా పరపీడనము చేయరాదు. పాపకార్యముల నాచరింపరాదు. అట్లుపొరపాటున కావించినను పశ్చాత్తాపముచెంది ముమ్మందు అట్టి దుష్టకార్యములను చేయ రాదని నిశ్చయము చేసికొనవలెను. ఇట్టి జిజ్ఞాసపరిణామముగా మనుష్యునియందు భగవద్భక్తియు, పాపభీతియు, అభివృద్ధి చెందిన వని చెప్పవచ్చును. ప్రాచీనకాల్డియా మతముకూడ నీ రీతిని ఉత్తదశను పొందియుండును.

కాల్డియా దేశస్థుల మతగ్రంథమునందు మూడవభాగ ములో వివిధ ప్రార్థనాగీతములు కలవు ! ఇందు కొన్ని బైబిలు గ్రంథములోని "penitential psalms" అనగా పశ్చాత్తాప తప్తుని గీతములను పోలియున్నట్లు తెలియుచున్నది. వీటియందు పాపియగు మానవుడు అజ్ఞానముచేతను అహంకారముచేతను తాను కావించిన పాపములను క్షమించి తన్ను రక్షింపు మని భగవంతుని ప్రార్థించుచున్నాడు. పరమా త్ముని స్త్రీ పురుష రూపములలో వీరు భజించెడివారు. పురో హితుడు పరమేశ్వరునికిని మనుష్యునికిని మధ్యవర్తిగనుండి,

మానవులు కాపాడిన వ్రాతలను పరిశోధకులు దేవునికి నివే
దనముచేయుటకై సాధనములు నిర్మించెను.

## సుమేరు జాతివారు

పైన వర్ణింపబడిన కథలలో శాస్త్రజ్ఞుల సమ్మతమునం దున్నత భావములు కల్పనములుగా కాకయు క్రమ పరిణామమే కాదనియు, ఈ దేశమున కితర ప్రాంతములనుండి యున్నతనాగరకతగల మరియొకజాతి వచ్చుటయే యిందులకు ముఖ్యకారణమనియు చారిత్రికులు నిశ్చయించుచున్నారు. ఈ నూతనజాతివారు బైబిలు గ్రంథమునందు వర్ణింపబడిన నోవహు వంశమువారు. వీరు శ్వేతవర్ణులు. ఈజాతివారు కాల్డియా దేశమునకు వలసవచ్చిన విషయమును బెరోసస్ అను చరిత్రకారుడు విచిత్రకథలతో వర్ణించియున్నాడు. "అనాదియందు బాబిలోనియా దేశమునందు విదేశీయులగు నొక జాతివారు నివశించుచుండిరి. వారెట్టినాగరకతయు లేక కేవలముపశువులవలె కాలముగడుపుచుండిరి. నూతన యుగారంభమునందలి ప్రథమ సంవత్సరమున నిచ్చటికి పర్షియా గుడమునుండి యొక అద్భుతమైన జంతువు వచ్చెను. దానినామధేయము ఓనెస్. ఆ జంతువునకు మనుష్యులవలె జ్ఞానముకలదు. ఆ జంతువు మత్స్యాకారము కలిగియున్నను లోపలిభాగమున దానికి మనుష్యుని వలె శిరస్సును, కాళ్ళును కలవు. అది మానవులవలె మాటలాడగలదు. ఈ జంతువు దినమంతయు మనుష్యసంఘములో గడపి వారికి భాషలు, శాస్త్రములు, కళలు మున్నగునవి

బోధించుచుండెడిది. పట్టణములను స్థాపించుట, దేవాలయము లను నిర్మించుట, భూమినికొలచుట, న్యాయశాసనములు కావించుట, భూమినిదున్ని విత్తులను చల్లుట, పంటలను జాగ్రత్తపరచుట మున్నగు అనేకాంశముల నీ మత్స్యమానవుడు నూతన ప్రజలకు నేర్పెను. ఈ యపూర్వపురుషుడు మాయమైన తరువాత మనుష్యులే నూతన విషయమును కనుగొనలేదు. ఈ మత్స్యము రాత్రికాగానే సముద్రమునందు దుమికి రాత్రి యంతయు నచ్చటనే నివసించుచుండెడిది. దీనికి భూమిపైనను జలమునందును కూడ నివసించు అలవాటుకలదు."

ఇట్టి అమానుషవిషయముల నాధునిక చరిత్రకారుడు విశ్వసింపజాలడు. ఇయ్యది ఆలంకారిక భాష. ఇందలి సత్యమేమన—బాబిలోనియా దేశమునకు సముద్ర మార్గమున నొక నూతన జాతివారు వచ్చిరి. వారు మిక్కిలి నాగరకులు. కాని యీ నూతనప్రజ లెవ్వరను నంశమున చారిత్రికుల కేకాభిప్రాయములేదు. ఈనూతన ప్రజలు నోహాకుమారుడైన షెమ్ అనువాని వంశస్థులనియు, అందుచే వారు సెమిటిక్ జాతివారనియు కొందరివాదము. మరికొందరు చారిత్రికులీ వాదము నంగీకరింపక కుషైట్ జాతికి చెందిన కొందరు ప్రజలు ప్రథమమున కాల్డియా దేశమునకు వలస వచ్చినట్లును, చాలకాలము గడచినవెనుక సెమైటు జాతివారందు ప్రవేశించినట్లును తెలుపుచున్నారు. కుష్ అను పురాణపురుషుని వంశమువారు కుషైటులు. కుష్ అనునాతడు హామ్ కుమారుడు. హామ్ నోహా

యొక్క ద్వితీయపుత్రుడు. కుష్మైటులు శ్వేతజాతికి చెందిన వారే కాని ఇంచుక గౌరవర్ణముగ నుండిరి. ప్రాచీనకాలమందు వీరు మధ్య ఆసియాయందలి ఓక్షసులోయందు నివసించుచుండి రని తలంపవచ్చును. కాలక్రమమున వీరు స్వదేశమును వీడి వివిధ దేశములకు వలసపోయిరి. కొందరు హిందూదేశమునకు పోయి దక్షిణ భారతదేశమువరకును చొచ్చుకొని పోయిరి. ఇచ్చట వీరు స్థిరనివాసము ఏర్పరచుకొని, స్థానికులగు నల్ల వారితో వివాహములుకూడ కావించుకొనసాగిరి. ఈ కారణ ముచే వీరి యాకారము చాలవరకు మారి నల్లని దేహము లును, మోటు పెదవులును వీరికి సిద్ధించెను. మరికొంతకాలము గడచినతరువాత వీరు సముద్రమార్గమున ప్రయాణముచేయుచు పారసీక గుడమునకువచ్చి కాల్డియాదేశమును ప్రవేశించి యిచ్చటనే నివసింపసాగిరి. నల్లజాతుల సంపర్కమువలన వీరికి సంభవించిన కృష్ణవర్ణమును, తదితర లక్షణములును ఇప్పుడు క్రమముగ మారి శ్వేతజాతులవారి యంగసౌష్ఠవము వీరికి లభించెను. కుష్మైటు ప్రజలలో కొందరు ఆఫ్రికా ఖండమునకు పోయిరి. ఇచ్చట స్థిరనివాసము కల్పించుకొనిన మీదట వీరికి ఇథియోపియా జాతివారని పేరు కల్గెను. కుష్మైటులలో మరి కొందరు పాలస్తీనాకు సిరియా మొదలగు దేశములకు వలస పోయిరి. మనకు ప్రస్తుతము కాల్డియాదేశమునకు వలసవచ్చిన కుష్మైటులతోడనే ప్రసక్తి గలదు. బెరోసస్ అను చరిత్ర కారుడు 'జీనెస్' అనెడి దివ్యమత్స్యము లోక సంగ్రహము

కొరకై అప్పుడప్పుడు కన్పించెడిదని తెలిపియున్నాడు. బహు
శః దీని యర్థము కుష్షైటు జాతివారు తెరలుతెరలుగ కొన్ని
తరముల విశ్రామముతో తన దేశములోనికి వలసవచ్చి రని
తెల్పుటయే కాబోలు. అనేక చారిత్రికాంశముల పరిశీలనము
వలన నీకుష్షైటుల వలస సుమారు 7000 సంవత్సరములకు
పూర్వము జరిగియుండవచ్చు నని తేలుచున్నది. ఈ నూతన
ప్రజలలో బహు సంఖ్యాకులు సుమేరు, అక్కాడు దేశము
నందలి యుత్తరప్రాంతమునకు సాగిపోయిరి. దక్షిణప్రాంతమున
ఆదిమనివాసు లగు ట్యురానియా తెగవారే నివసింపజొచ్చిరి.
ఈ కుష్షైటు తెగవారి నాగరకత యున్నతశ్రేణిది. వీరికి
జ్యోతిష శాస్త్రమునందును, గణిత శాస్త్రమునందును మిక్కిలి
అభిమానము. సెమిటిక్ భాషలని నేటి శబ్దతత్వ శాస్త్రజ్ఞులు
నిర్వచించెడి అర్మీనియా, యూదు, అరబ్బీభాషలను వృద్ధి
పొందించుటకు వీరే కారణభూతులు. వీరి సంపర్కమువలననే
కాల్డియా మతమునందలి మూఢవిశ్వాసములు వెనుకపట్టి వారి
మతముయొక్క సత్యస్వరూపము గోచరింపసాగెను. సెమిటికు
తెగవారు కుష్షైటుల యనంతరము కాల్డియాలోనికి వచ్చిరి.
వీరు విశేషము నాగరకులు కానందున కుష్షైటు నాగరకతకును,
సంప్రదాయములకును సులభముగ లోబడిపోయిరి. ఈ కాల
మునందు ఉర్ అను పట్టణము మిక్కిలి ప్రఖ్యాతి వహించి
యుండెను. ఈనాటి దేశపటములో ఈ నగరముయొక్క శిథి
లములు సముద్రతీరమునుండి 150 మైళ్ళదూరమున గాన్పిం

చును. కాని యీ కథాకాలమునాటికి "ఉర్" పట్టణము సముద్రప్రాంతముననే యుండి గొప్ప రేవుపట్టణముగ ప్రసిద్ధి చెందెను. ఇచ్చటికి వివిధ ప్రాంతములనుండి విదేశీయులు రాకపోకలు సలుపుచుండిరి.

కాల్డియా దేశములోనికి వలసవచ్చిన నూతనజాతివారి కాలములలో నీ దేశస్థితి యెట్లుండెడిదో నిర్ధారణగ తెల్పుటకు తగిన చారిత్రక సామగ్రి మనకు లభ్యముకాలేదు. కాని ఈ దేశములో కానవచ్చిన గ్రంథములు, కట్టడములు మున్నగు వాటిని పరిశీలించుటవలన చరిత్ర రచనకు కొంతవరకు ఆధారము లేర్పడుచున్నవి. సుమారు 6000 సంవత్సరములకు పూర్వమీ కాల్డియా దేశమునందు చిన్నచిన్న స్వతంత్ర రాజ్యములున్నట్లు తెలియుచున్నది. ఒక్కొక్క రాజ్యమునందొక్కొక్క పెద్ద పట్టణము ప్రాముఖ్యత వహించి ఆ రాజ్యమునకు కేంద్రముగ నుండెడిది. ఈ పట్టణములో నొక దేవాలయము తప్పక యుండెడిది. ఆ దేవునివలననే రాజ్యమునకు గౌరవమును ప్రతిష్టయు కలుగుచుండెడివి. దేవుని పురోహితునకు "పటేసి" యని పేరు. ఈతను దైవమునకు పురోహితుడేకాక రాజ్యమునకు పాలకుడుగకూడ నుండెను. కాలక్రమమున రాజులప్రాముఖ్యత అధికము కాసాగెను. మొదటి దశయందు రాజులు మతగురువుల సలహాప్రకారమే యన్ని పనులను చేయుచుండి యుండవచ్చును. కాని కాలము గడచిన కొలదియు వారు మతాధికారులను లెక్కసేయక స్వతంత్రముగ

వ్యవహరించ జొచ్చిరి. కస్సైటు తెగవారు కాల్డియా దేశము నందు తమ యున్నత నాగరకత, సామర్థ్యము మున్నగువానిచే రాజ్యాధికారమును జయించినమాట వాస్తవమే కాని స్థానిక ప్రజలు పూర్తిగ నశించిరని కాని, వారి సాంప్రదాయములు మాయమయ్యెనని కాని తెలుపుటకు వీలులేదు. నూతన జాతి వారు చాలకాలము వరకును స్థానికులగు అక్కాడు ప్రజల భాషనునేర్చుకొని రాజకీయములయందుకూడ ఆభాషనే వాడు చుండిరి. కాలము గతించిన తరువాత ఈ ప్రాచీనభాషకు మారుగ ప్రజ లందరునుకూడ అస్సీరియాభాష యని ఈనాడు పిలువబడుచున్న మరియొకభాషను వాడుట ప్రారంభించిరి.

### ఇచ్చటి రాజులు

కాల్డియా చరిత్రయందు ప్రసిద్ధిచెందిన మొదటిరాజు షరూకిన్ లేక సారగాన్ అను నాతడు. ఈతడు అక్కాడు దేశమునకు రాజునని తెలుపుకొనియున్నాడు. ఈ నామముగల మరియొకరాజు అస్సీరియా ప్రాంతములో మరికొన్ని శతాబ్దములు గడచినవెనుక క్రీ. పూ. 2000 ప్రాంతమున రాజ్యము చేసినట్లు మనము తెలిసికొందుము. ఈ సారగాన్ రాజు మిక్కిలి ప్రాచీనుడు. బైబిలు గ్రంథమునందలి 'Old Testament' లో ఈతని ప్రశంస కానవచ్చు చున్నది. ఈతని రాజధాని సిప్పారు పట్టణము. ఈ నగరము యూఫ్రటీసునదికి సమీపమున నొక పెద్ద కాలువయొడ్డున నుండెడిది. ఈతని తల్లిదండ్రులెవ్వరో తెలియుటలేదు. తనతల్లి యొకరాజకుమార్తెయనియు,

తన జననము రహస్యముగ నుంపబడెననియు, తనతల్లి తన్నొక తట్టయందుంచి నదీప్రవాహములో విడచిపెట్టగా అక్కి యను బీదవాడు నీళ్ళు మోసికొని జీవించువాడు తన్ను గనుగొని పెంచి పెద్దవానిని చేసెననియు, ఈ రాజు తన చరిత్రను వర్ణించు కొని యున్నాడు. ఇట్టికథలు సుప్రసిద్ధపురుషు లనేకులగూర్చి వ్యాప్తియందున్నవి. సరూకిన్ రాజు విఖ్యాతుడను విషయము మాత్రము నిర్వివాదాంశము. ఈతడు సిరియా, ఏలామ్, రాజ్యములను జయించి,మధ్యధరా సముద్రమువరకును దండెత్తి పోయెను. ఈ దండయాత్రలయందీతడపారధనమును కొల్ల గొట్టెను. సరూకిన్ రాజు కాలమునందు కాల్డియా దేశములో ప్రాచీన ట్యూరాసియన్ ప్రజలును, తరువాత వేతెంచినకొత్తలు సెమైటు ప్రజలును, ఒండొరులతో కలసిమెలసి యుండజొచ్చిరి. ముఖ్యముగ మతవిషయములలో నీసమ్మేళనము సంపూర్ణముగ నుండెను. ఈ యుగమునాటికి ప్రాచీనకాలపు ట్యూరాసియా భాష వాడుకలో నుండిపోవు చుండినందున సరూకిన్ రాజు ప్రాచీన భాషయందలి మతగ్రంథముల నన్నిటిని జాగ్రత్తగా ఇటుకలపై వ్రాయించి సంరక్షించెను. ఈప్రాచీన భాష పలువురకర్థము కాకుండినందున గ్రంథములను వ్రాయునప్పుడు మూలమున కర్థమును కూడ పండితుల నడుమనో లేక ఇటుకల వెనుక భాగముననో వ్రాయించు నేర్పాటును కూడ ఈతడు చేసెను. అట్లే ప్రాచీన కాల్డియాభాషయందలి పదముల నిఘంటువులను ఆభాషకై వ్యాకరణములను కూడ సారగాన్ ప్రభువు వ్రాయిం

చెను. ఈ తడిట్టి ఘనకార్యములు చేయించనిపక్షమున ఈ నాటి పండితుల కాప్రాచీనగ్రంథములు బ్రహ్మలిపివలెనుండెడివే. గ్రంథములను వ్రాయించుటయేకాక ఈరాజు వానిని సంరక్షింపుటకై చాల పాటుపడెను. ఎరిక్ అను పట్టణమునందొక ధార్మికకళాశాల యుండెడిది. ఆ కళాశాలయందలి గ్రంథభాండారమునందీ లిఖితగ్రంథముల నన్నిటిని ఈరాజు పొందుపరపించెను. మతాధికారుల కీరాజునెడ మిక్కిలి అభిమానముండెడిది. ఆ కారణమున సారగాన్‌రాజు పూనుకొనిన ఘనకార్యమునకు వీరు సంతోషముతో సహాయపడిరి. ఎరిక్ పట్టణమున కాకాలమునందు గ్రంథనిలయమగు నగరమని ప్రఖ్యాతి కల్గెను. అనేక శతాబ్దములు గడచినవెనుక అస్సీరియా ప్రభువైన అషుర్ బనిపాలుడు ప్రాచీనగ్రంథములను సేకరించుటకై అనేక ప్రాంతములకు తన వ్రాయసకాండ్రను బంపినప్పుడీ ఎరిక్ నగరమునందే అధిక సంఖ్యాకములగు గ్రంథములు లభించెను. సారగాన్‌రాజు గ్రంథములలో జ్యోతిషము, మంత్రతంత్రములు, శకునము వానిఫలములు మున్నగు నంశములకు సంబంధించిన గ్రంథములే కాక వ్యవసాయమునుగూర్చిన యొక పుస్తకము కూడ వెలువడినది. జానపదగీతములని నేడు మనము పేర్కొను కొన్ని పల్లెపదముల పుస్తకములుకూడ నిందు లభించినవి.

ప్రాచీన కాల్డియా దేశచరిత్రను వ్రాయునప్పు డాదేశపు రాజుల కాలనిర్ణయము చేయజాలకపోవుట ఒక గొప్పలోపమని యంగీకరింపవలయును. కాని అనివార్యమగు కారణము-

లచే శిలోపము [illegible] యథాతథము
గనే యున్నవి. కాల్డియా [illegible], అస్సీరియా, రాజులు
సాధారణముగ తాము చేయు[illegible]లో [illegible]
మగు నేదైన [illegible], [illegible] కార్యములు
తమ రాజ్య కాలమునందే [illegible] జరిగినవి
వ్రాయుచుండెడివారు. కాని అస్సిరియనుల [illegible] రాజు
కాలనిర్ణయమునకై [illegible] ఆధారము [illegible]. బాబిలోనియా రాజ్యమునందు క్రీ. పూ. 550 నందు రాజ్యము చేసిన నెబోనిడస్ అనురాజు ఒక ముద్రికను వేయించెను. అందు తాను సిప్పార్ నగరమునందలి సూర్య దేవాలయమును పునర్నిర్మాణము కావించినట్లు తెలిపియున్నాడు. ఈ సూర్యమందిరము సారగాన్ కుమారుడైన నారమ్‌సిన్ అనునాతడు 3200 సంవత్సరములకు పూర్వము నిర్మించె నని తెలుపబడినది. ఈవిధముగ నారమ్‌సిన్ కాలము క్రీ. పూ. 3750 కావలెనని ఆతనితండ్రి ఆతని కేబదిసంవత్సరముల పూర్వము వాడని యూహించినయెడల సరాగన్ రాజుకాలము క్రీ. పూ. 3800 అని తెలుచున్నది. ఇంతటి ప్రాచీనపు కాలనిర్ణయమును మొట్టమొదట చారిత్రకులు అంగీకరించలేదు. కాని యీవిషయమును స్థిరపరచెడి యితరసాక్ష్యము లభించినందున దీని నంగీకరింపక తప్పినది కాదు.

కుషైటులు, సెమైటులు మున్నగువారు కాల్డియా దేశమును ప్రవేశించిన తరువాత కూడ దేశమునందలి దక్షిణప్రాంత

మున ప్రాచీన నివాసులగు ట్యురానియన్ తెగవారి ప్రాబల్య మెక్కువగ నుండెనని తెలిపియున్నాము. ఈ ప్రాచీనజాతికి చెందిన యిరువురు రాజుల నామములును, వారిఘనకార్య ములును మనకు కొంతవరకు తెలియవచ్చినవి. అందు మొదటి రాజు ఉర్ ఇయా అనువాడు. అతనికుమారుడు దుంగి రెండవ వాడు. ఈ ఉర్ ఇయా రాజుకాలము క్రీ. పూ. 2500 సంవత్స రములకు వెనుకటిదని నిర్ణయింపబడినది. ఈతడు దక్షిణ కాల్డియాయందలి ఉర్ పట్టణమునకురాజు. కాని ఆప్రాంతము నందలి యితర పట్టణములుకూడ నీతని ఆధిపత్యము నంగీక రించె నని తెల్పుట కాధారములు కలవు. ఈతడును కుమారు డైన దుంగి యనువాడును అనేక దేవాలయములను నిర్మించి-ప్రఖ్యాతిని వహించిరి. ఈ దేవాలయములు శిల్పకళయందు విశేషప్రాశస్త్యము కలవికావు. కాని మిక్కిలివిశాలములైనవి.

ఈకాలమునందు దక్షిణ కాల్డియాయందు ప్రసిద్ధి గాంచిన యనేకపట్టణము లుండెడివి. ఈపట్టణము లన్నిటి యందును ఒక్కొక్క ప్రసిద్ధదేవాలయమును, దానికి సంబం ధించి యొక ధార్మిక కళాశాలయునుండుట ఆచారముగ నుండె డిది. ఇట్టి పట్టణములలో ఎరిధూ అను నది సముద్రతీరము నెలకొనియుండెను. ఇందు ఇయాదేవుని గౌరవార్థమై యొక దేవాలయ మతిప్రాచీనకాలమునందే నిర్మింపబడెను. అట్లే 'లార్సమ్' అను నగరమున సూర్యునికై యొక దేవాలయము నిర్మింపబడెను. ఉర్ పట్టణమున చంద్రునికై యొక దేవళ

ముండెను. జగత్ప్రసిద్ధిగాంచిన బాబిలోను నగరమింక ప్రాముఖ్యతలోనికి రాలేదు. ఆనాటికిది చిన్న పట్టణము. దీని నామము టింటిర్కి.

ఏలాంరాజుల దండయాత్రలు—ఆక్రమణ

క్రీ. పూ. 2300 సంవత్సరము ప్రాంతమున కాల్డియా దేశములోనికి ఏలామ్ దేశపురాజులు దండయాత్రలు సాగించిరి. ఈ ఎలామ్ దేశమునందుకూడ ప్రాచీన యుగమునందు ట్యురానియన్ తెగకుచెందిన జనులు నివసించు చుండెడివారు. కాని కొంతకాలమున కీదేశముపై సెమిటిక్ జాతులవారు దండయాత్రలుసాగించి తుదకచ్చట శాశ్వతనివాసము నేర్పరచు కొనిరి. ఈ నూతన జాతివారు పాలకులుగమాత్రము వ్యవహరింపసాగిరి. ఎలామ్ దేశమునకు సూసాపట్టణము కేంద్రస్థానము. కాల్డియా దేశముపై దండెత్తివచ్చిన ఎలామ్ రాజు ఖుదూర్ నాఖ్ ఖండి అనువాడు. ఈతడు దేశమునంతను కొల్లగొట్టి యచ్చటి దేవాలయములను నాశనముచేసి యందలి విగ్రహము లను కొన్నింటిని తన దేశమునకు తీసుకొనిపోయెను. ఎలామ్ దేశీయులు కాల్డియారాష్ట్రమును జయించుటతో సంతోషింపక అచ్చట స్థిరముగా నుండిపోయిరి. ఖుదూర్ నాఖ్ ఖండి వంశస్థులలో నొకడైన ఖుదూర్ లాగమార్ అనువాడు గొప్ప వీరుడు. ఈతడు దేశములను జయించెను. వీరిప్రభుత్వము జనరంజకముగ నుండినట్లు తోపదు. ఇంతవరకును కాల్డియా దేశమునందు, నివసించిన అబ్రహిమ్ అను పురాణపురుషుడును

అతని వంశస్థులును ఈ దేశమును విడచి కానాన్ రాష్ట్రమునకు వెడలిపోయిరి. ప్రజలయందసంతుష్టియు, నిరుత్సాహమును, విదేశీయులయెడ కోపమును ప్రబలెను. ప్రాచీన కాల్డియామత గ్రంథములలో కానవచ్చిన "penitential psalms" లేక పశ్చాత్తాపతప్తుని గీతములనబడునవి యీ కాలమునందే వ్రాయబడియుండవచ్చునని చారిత్రికులు తలంచుచున్నారు. విదేశీయుల పాలనములో కష్టములపాలైన కాల్డియానివాసులు తమ దుఃఖము నీవిధముగ వెడలపోసికొని యుండుట సహజమేకదా !

ఎలామ్ దేశీయులు కాల్డియాపై రాజ్యముచేయుచుండినంతకాలమును అచ్చటి రాజవంశములలో నొక వంశమువారు విదేశీయులబారినుండి తమరాజ్యమును విడిపింపవలయునను భావమును పెంపొందించుకొనుచునే యుండిరి. ఈరాజులు బాబిలోను పట్టణపు ప్రభువులు. వీరె చిరకాలమునుండి స్వతంత్రులుగనుండిరి. ఎలామ్‌రాజగు ఖుదూర్‌లాగమార్ అనువానికి అతని దిగ్విజయయాత్రయందు సహాయభూతులైన వారిలో ఈ బాబిలోను రాజులొక్కరు. ఈతనినామము అమీరఫాల్. ఈ అమరపాలుని కుమారుడు బాబిలోనియా చరిత్రయందు మిక్కిలి ప్రఖ్యాతివహించిన హామ్మురాజీయనువాడు. ఈ హామ్మురాజీరాజు విదేశీయులకు ఎలామ్‌దేశీయులను క్రమక్రమముగ కాల్డియా రాష్ట్రమునుండి తరిమివైచి దేశమును పారతంత్ర్యమునుండి రక్షించెను. ఈతడు 55 సంవత్సరములవరకును

రాజ్యమేలెను. ఈరాజు కావించిన ఘనకార్యములను, ఈతని యనంతరము కాల్డియాదేశపు స్థితిగతులను బాబిలోనియా చరిత్రయందు విపులముగ తెలుపబడును.

### ప్రజల విజ్ఞానము

బెరోసస్ అను బాబిలోనియా చరిత్రకారుడు ప్రాచీన కాల్డియానివాసులు కేవల మనాగరకులనియు, వారి యనంతర మీ దేశమునకు వలసవచ్చిన కుష్మైటు, సెమైటు తెగలవారివల ననే ఈ దేశమున నాగరకతావ్యాప్తి సంభవించినదనియు తెలిపియున్నాడు. కాని యీ విషయమును మనము సంపూర్ణముగ నంగీకరింపజాలము. ఏలయన వీరు లిపినిర్మాణమును కావించియుండిరి. వివిధ పట్టణనిర్మాణమును నెరింగియుండిరి. కాలువలు త్రవ్విరి. లోహముల యుపయోగము వీరికి తెలిసి యుండెను. ఇట్టివారిని కేవల మవ్యక్తులనిపిలచుట సాహసము. కాని రాజ్యపరిపాలనము, సంఘవ్యవస్థ, ఖగోళ, గణితశాస్త్రములు, మున్నగునంశములను నూతనాగంతకులు ప్రాచీన సుమేరు, అక్కాడు ప్రజలకు నేర్పిరని యంగీకరింపవలయును. ప్రాచీనులైన కాల్డియాప్రజలు దినమును పండ్రెండుభాగముల లోనికిని, ఒక్కొక్క భాగమును అరువదిభాగములలోనికిని, వానిని మరల అరువది భాగములలోనికిని భాగించియుండిరి. ఈ యేర్పాటు గంటలు, నిమిషములు, సెకండ్లను తలపింప జేయుచున్నది. వీరు సంవత్సరమును పండ్రెండు నెలలుగను, నెలను ముప్పది దినములుగను భాగించిరి. వీరిది చాంద్రమానము.

సౌరసంవత్సరమునకును తమ చాంద్రమాసమునకును గల భేద మును తొలగించుటకై వీరు ఆరు సంవత్సరములకొక యధిక మాసమును సంవత్సరమున నేర్పాటు చేయుచుండిరి. ఈనూతి నాంశమును వీరు కుష్మైటువలన నెరింగి యుండవచ్చును. పచ్చజాతులవా రెవ్వరును దశాంశములను వాడరు. వారి మాసములు పండ్రెండుచే సులభముగా విభజించుట కనుకూల ముగా నుండును. చీనావారు కాలనిర్ణయమునకై శతాబ్దు లను లెక్కింపరు. వారు అరువదిసంవత్సరముల కాలము నొక ఘట్టముగ నేర్పాటుచేసికొని దాని ననుసరించి కాలమును నిర్ణ యింతురు. నూతన జాతికిచెందిన కుష్మైటుప్రజలు ఖగోళ శాస్త్రిమునందెక్కువ ప్రీతిని చూపెడివారు. వారు ముఖ్య ముగ ఏడు గ్రహములనెరింగి వానిని పరిశీలించెడివారు. సూర్యుడు, చంద్రుడు, Saturn (శని) Jupiter (బృహ స్పతి) Mars [అంగారకుడు] Venus (శుక్రుడు] Mercury [బుధుడు] అనునవియే యీ సప్తగ్రహములు. నిరంతరము నక్షత్రమండలమునే పరీక్షించుచుండు వీరికి ఆ నక్షత్రములు సజీవములుగను, అత్యంత సుందరములుగను, ఉత్తమ దైవిక శక్తులకు నిలయములుగను కాన్పించుటలో ఆశ్చర్యములేదు. ప్రాచీన కాల్డియా నివాసులుకూడ నక్షత్రపరిశీలనము నెరుం గనివారుకారు. వారు నక్షత్రమును దేవత్వసూచకముగ వాడెడివారు. కాలక్రమమున అస్సీరియాభాషయందీ నక్షత్ర మునకై గుర్తుగావాడబడిన సంజ్ఞను 'ఇలు' యని చదువ

జొచ్చిరి. 'ఇలు' శబ్దము క్రమముగా దేవునినామముగా మారి అరబ్బీభాషయందు 'అల్లా' గను, యూదుభాషయందు 'ఏలోహిమ్' గను పరిణమించెను.

నిరంతర నక్షత్ర పరిశీలనమువలన కాల్డియా నాగరకత యందు రెండు పరిణామములు సంభవించెను. ఆకాశమండలి గ్రహాకూటములు సజీవములు కావున వాని సంచారము, సంయోగము వలన మనుష్యజీవితముపై వాని ప్రభావము పడునను విశ్వాస మీప్రజలయందేర్పడెను. ఇదియే జ్యోతిష శాస్త్రమునకు పునాది. గ్రహసంచారమును పరీక్షించి దాని వలన మనుష్యజీవితమునందలి మార్పులను, శుభాశుభములను కనుగొనజాలు జ్యోతిష్కులకు గౌరవము హెచ్చెను. ఈ శాస్త్రమును బాగుగా పఠించెడివారు మతగురువు లొక్కరే యుండుటవలన వారియందు భక్తిశ్రద్ధలు హెచ్చెను. ఈమత గురువులకు వారు కోరకుండగనే ప్రజలు ధనధాన్యాదులను సమర్పింపజొచ్చిరి. నక్షత్రమండలమును పరిశీలించుటకై వారికి నక్షత్రశాలలు కావలసివచ్చెను. ఇట్టి నక్షత్ర శాలలు దేవాలయములలో నొక భాగముగ నేర్పడుచుండెడివి. ఈ కాలమునందు ఉర్, ఎరిక్, లార్సమ్, ఎరిడూ మొదలగు కాల్డియాపట్టణములలో దేవాలయములును, వానితోపాటు మతగురువుల యుపయోగముకొరకై యొక గ్రంథాలయ మునుకూడ నిర్మాణము కావింపబడెను. నక్షత్రమండలములు ఉన్నతములగు దైవికశక్తులకు నిలయములను విశ్వాసముప్రజ

లలో ప్రబలిన నాటినుండియు వారిమత మున్నతస్థితికి రాజాచ్చెను. ప్రాచీన కాల్డియా మతమున ప్రపంచమునందంతటను క్షుద్రములగు భూతాదులు నిండియున్నవను నమ్మకము వ్యాపించియుండెను. కావున అట్టి దుష్టశక్తులతో నిరంతరము పోరాడుచుండవలయునను భావము తక్క వేరొండు తలంపు ప్రజలలో లేకుండెను. కాని నక్షత్రపరిశీలన సందర్భమున కల్గిన నూత్న భావములు క్షుద్రశక్తులకుమారుగ శుభప్రదములగు శక్తులలో విశ్వాసమును పెంపొందింపసాగెను. ఈ విశ్వాసము దైవమునెడల భయము, జుగుప్స మున్నగువానిని, పారద్రోలి గౌరవము కృతజ్ఞత మున్నగు నూతన భావములను ప్రేరేపించెను. వానితోపాటు పాపభీతియు, దుష్కార్యముల యెడ నిరసనభావమును, చేసిన తప్పులకై పశ్చాత్తాపమునందుటయు జనులలో వృద్ధిచెందెను. ఈ భావౌన్నత్యమే యీనాటి కాల్డియా మతగ్రంథములలో కూడ ద్యోతకమగుచున్నది.

### మ త ము లో మా ర్పు లు

కుషైటు సెమైటు జాతుల రాకవలన ప్రాచీన ట్యూరానియా జాతీయుల మతభావము లౌన్నత్యము వహించిన యంశము సత్యమేకాని అంతమాత్రమున వారిమత సంప్రదాయములు పూర్తిగ మరువబడినవని తెలుప వీలులేదు. నూతన మతగురువులు ప్రాచీన మతగ్రంథములను త్రోసివేయక వానిని శ్రద్ధగ పఠింపసాగిరి. శకునములు, శకునఫలితములు మున్నగు వానిని నూతన ప్రజలుకూడ అంగీకరించి అనుసరింపసాగిరి.

అక్కే ప్రాచీన నివాసులచే పూజింపబడుచుండెడి 'ఇయా' మెరిడుగ్, మొదలగు దైవతముల నీనూతనులుకూడ అంగీకరించి పూజింపసాగిరి. సుమేరు, అక్కాడు మతమునందలి భూతప్రేతాదులుకూడ నవీనులచే యథాప్రకారముగ స్వీకరింపబడి తమ మతమునందు చేర్పబడెను. దైవికశక్తులనియు, దుష్టశక్తులనియు రెండు విధములుగ దైవతములు విభాగము కావింపబడి, అసంఖ్యాకములగు పురాతన శక్తులకపటికిని మతమునందు తావొసంగబడెను. ఈవిధముగ ప్రాచీన అర్వాచీన సాంప్రదాయములు రెండును మేళవించి యొక నూతన మతమును ఆవిర్భవింపజేసెను. దీనినే కాల్డియా మతమనియు, బాబిలోనియా మతమనియు, మనము పేర్కొనుచున్నాము.

బాబిలోనియా మతమని వర్ణింపఁబడిన యీ మత సాంప్రదాయములో బహుదేవతోపాసనము (poly theism) మిక్కిలి బలవత్తరముగ కానవచ్చుచున్నది. ప్రాచీన కాల్డియా నివాసులును, వారితరువాత యిచ్చటకివచ్చి స్థిరనివాస మేర్పరచుకొనిన కుషైటు సెమైటు ప్రజలునుకూడ ప్రకృతియందలి అసంఖ్యాకశక్తులను పూజించుచుండుట మనము తెలిసికొనియున్నాము. కాని ఈ యజ్ఞానతిమిరమునుండి దేవుడొక్కడే యనెడి జ్ఞానము క్రమక్రమముగా వారిలో నుదయించకపోలేదు. నక్షత్ర పరిశీలనముచే వారికి గ్రహ సంచారమునందలి నియమబద్ధత గోచరించెను. క్రమక్రమముగా వారికీ గ్రహకూటమంతయు స్వతంత్రమైనది కాదనియు, వీనిని నడుపుచుండెడి

మహాశక్తి యొకటి కలదనియు, ఆశక్తియే ప్రపంచము నంతను పాలించుచున్నదనియు, అయ్యది అద్వితీయమనియు భావముదేర్పడెను. ఈభావము ఏకేశ్వరోపాసనము (Monotheism) నకు దారిచూపెను. కాని యీశ్వరుడొక్కడే యనెడి విశ్వాసమీప్రజలలో యింకను స్థిరముగా నాటుకొనలేదు. జిజ్ఞాసువులును, విద్వాంసులునగువారుమాత్ర మీయంశమును నిశ్చయముగ నమ్మిరి. సామాన్యులకే యేకేశ్వర విశ్వాసము తెలిసియు తెలియనట్లుగ నుండెను. నూతన బాబిలోనియా మతమునందు పూర్వకాలపు దేవతల నామములు చాల వరకంగీకరింపబడెను. అందు ముగ్గురకు లోకపాలకత్వమాపాదింపబడెను. అనూ, ఇయా, బెల్ అనువారి త్రిమూర్తులు. అనూ దేవతలకెల్లపెద్ద. ఆకాశమున కధిపతి. ఇయా సముద్రమునకురాజు. ఈతడు దయాస్వరూపుడు, సర్వజ్ఞుడు. ప్రపంచమును సృష్టించి అందు క్రమపద్ధతుల నేర్పాటుచేసి దానిని పాలించుట బెల్ దేవుని ధర్మము. బెల్ అను పదమునకు సెమిటిక భాషలో 'ప్రభువు' అని అర్థము. పైన తెలుపబడిన త్రిమూర్తులకంటె యించుక తక్కువశ్రేణిలో మరియొక త్రిమూర్తులుండిరి. వీరు సూర్యచంద్రులు, వాయువుఅనువారు. ఈ మూడవదేవు డంతరిక్షమునకుకూడ అధిపతి. వాయువు అంతరిక్షములకు అధిపతియైన యీ దేవుని ప్రజలు కృతజ్ఞతతోడను, భయభక్తులతోడను గౌరవించుచుండెడివారు. ఈతడు వర్షము కురిపించి నదులను, కాలువలనునిండించి, ఆవిధముగ వివిధ సస్య

ములను ఫలింపజేయును. కాని యీతడాగ్రహించిన మొదల ప్రపంచమునకు విపరీతముగు నష్టమునుకూడ కలుగజేయగలడు. ఈతని యిచ్ఛామాత్రమున తుఫానులు చెలరేగి పైరు, పంట లను నాశనముచేయును. దానివలన కరువులు, దారిద్ర్యము, జాడ్యములు మున్నగునవి చెలరేగును. ఈశక్తులు కలిగి యుండుటచే నీదేవుడు జ్వాజ్వల్యమానమగు ఖడ్గమును చేత ధరించునట్లుగా చిత్రములలో చూపబడినది.

ఈ మతమునందలి మరియొక భావము ముఖ్యముగా గమనింపదగియున్నది. ప్రకృతియందు స్త్రీ పురుష భేదము సర్వత్ర కాన్పించుచున్నది. ఈ రెండు విభాగములయందును భేదముమాత్రమే కాక విరోధముకూడ కాన్పించుచున్నది. పురుషునియందు చురుకుతనము, బలము, కాఠిన్యము యెక్కువ ప్రాముఖ్యముగ కాన్పించును. అతనియందు దయ, ఉదార త్వము లేకపోలేదు. కాని ఆ గుణములలోకూడ యించుక కర్కశత్వము చూపట్టుచున్నది. స్త్రీయందుకూడ చురుకు తనముకలదు. గాని అది నిరాడంబరము. స్త్రీప్రకృతిలో మార్ద వము, సరళత్వము యెక్కువకనిపించుచున్నవి. ఆమె భావో ద్రేకముకూడ సౌమ్యముగనుండును. స్త్రీపురుష ప్రకృతులయం దింతటి భిన్నత్వము కానబడుచున్నను అన్యోన్య సాహచర్య సంయోగములచేతనే వారికి రెంటికిని పరిపూర్ణత సిద్ధించు చున్నది. నిత్యజీవితమునందీ స్త్రీపురుషసంబంధము తల్లిదండ్రుల యందును, భార్యాభర్తలలోను యెంత ఉన్నతముగను,ఆనంద

దాయకముగను అపర్యాప్తపూరితముగను కానసగుచున్నదో ఈ కాల్డియాప్రజలు గుర్తించిరి. స్త్రీపురుష భేదము మానవుల లోనేకాక పశుపక్ష్యాదులలో సైతము కానవచ్చుట వారు గమనించిరి. కావున నీస్త్రీపురుష భేదములను వారు తమ మతము లోనికికూడ గొనిపోయిరి. ప్రపంచమునకంతకును అధిపతియు ఆకాశమునందు నివసించునట్టియు, దైవమును సృష్టికి తండ్రి యని వర్ణించిన పక్షమున మనలనందరను మోయుచు నిరంతర మును రక్షించుచున్న భూదేవత సృష్టికి తల్లియని యేల తలంప రాదు ? ఆ కారణమున భూమికి మాతృత్వమును, ఆకాశాధి పతికి పితృత్వమును కల్పింపబడెను. అదేవిధముగ తేజస్వరూపు డును, కొన్ని సందర్భములలో లోకభయంకరుడునగు సూర్యు నికి పురుషత్వమును, ఆహ్లాదకరమును, శాంతిదాయకమునగు చంద్రమండలమునకు స్త్రీత్వమును కల్పింపబడెను. ప్రతి దేవుని కిని భార్యయొకతె సృష్టింపబడెను. స్త్రీదైవము లసంఖ్యాక ములుగనున్నను, వీరందరును, స్త్రీస్వరూపిణియగు బెలిట్ దేవ తకు రూపాంతరములు. ఆమెనుండి ఆవిర్భవించినవారు. బెలిట్ అనునామె బెల్ దేవునిభార్య. ఈ మెసృష్టి, మాతృత్వము, దయ మున్నగువాని కధిదేవత. ఇట్టి దేవులును, దేవతలును, కాల్డియా మతమునందనేకులుగలరు. వీరియందు పండ్రెండుగురు దైవతములుమాత్రము మిక్కిలి ప్రసిద్ధిగాంచిరి. వారు అనూ, నియా, బెల్, సిన్, షమాష్, రమాన్, నిఘార్, మార్దుకు, నెర్గాల్, ఇబో, బెలిట్, ఇష్టార్ అనువారలు. ఈదైవతముల కాల్డియా

ప్రదేశములలో దేవాలయములు నిర్మింపబడుచున్నట్లు ఈవరకే తెలుపబడి యున్నది. ఎరిక్ పట్టణమునందు అనూ అనట్ గార్లకు అనగా ఆకాశ భూదైవముల గౌరవార్థము గొప్ప దేవాలయము నిర్మింపబడెను. ఎరికు పట్టణము భూదేవతప్రీతిదైన స్థలమగుటచేతనే కాబోలు, బాబిలోనియా అస్సీరియా జాతుల వారు మృతదేహముల నీప్రాంతములకు కొనివచ్చి సమాధి చేయుచుండిరి. ఈ పట్టణమునందలి మట్టి పవిత్రమయినదని వారి విశ్వాసము. సూర్యచంద్రులకు ప్రత్యేక పట్టణములలో ప్రత్యేక దేవాలయములుండినను. దానితో సంతుష్టి చెందక ప్రాచీన కాల్డియానివాసులు సిప్పార్ పట్టణమున సూర్య దేవాలయమును, దానికి సమీపముననే యూఫ్రటీసు తీరము నందలి అగాదే పట్టణమునందు చంద్రునికై యొక మందిర మును నిర్మించిరి. బాబిలోను నగరమునందు మెరిడుగ్ దేవునికి రూపాంతరమైన మార్డూక్ దైవము గౌరవార్థమై యొకమంది రము స్థాపింపబడెను. ఈదేవునికి బెల్ మార్డూక్ అనికూడ పేరుకలదు. బెల్ మార్డూక్ అనగా ప్రభువగు మార్డూక్ అని యర్థము. బాబిలోను నగరము ప్రసిద్ధిచెందిన కాలములో నీమార్డూక్ ప్రభువు మందిరము భోగభాగ్యములయందు జగత్ప్రసిద్ధి గాంచెను. హమ్మురాజీరాజు మార్డూక్ దేవునికై బార్సిప్పా నగరములో మరియొక ప్రసిద్ధ దేవాలయమును కట్టించెను.

బాబిలోనియా మతేమునందు శకునములలో నమ్మక శాస్త్రముగ నుండెను. వీనినిగూర్చి కొన్ని గ్రంథములను ఆ కాలపు పండితులు సిద్ధపరచిరి. ఈమూఢనమ్మకమును కాల్డియా దేశస్వాతంత్ర్యము నశించినవెనుకకూడ పూర్తిగ విడువబడ లేదు. కాల్డియా ప్రజలలో కొందరు తాము మంత్ర తంత్రిములు నెరుంగుదుమనియు, శకునములను, స్వప్నములను పరీక్షించి మనుష్యులఅదృష్టమును తెలుపగలమనియు చాటుచు దేశదేశములలో తిరుగుచుండెడివారు. వీరి మూలముగ ప్రాచ్య పాశ్చాత్య దేశములందు మంత్రి తంత్రాదులయందును ఇతరక్షుద్రశాస్త్రములయందును విశ్వాసము ప్రబలి,ఆవిశ్వాసములు నేటివరకుకూడ అన్ని దేశములలోను, అజ్ఞానులగు ప్రజలయందు కానవచ్చుచున్నవి. కాని కాల్డియా దేశీయు లనేక అమూల్యవిషయములను ప్రపంచ విజ్ఞానమున కొసంగిరనువిషయమును మనము మరువరాదు. ఖగోళశాస్త్రమునకు వారు పునాదులువేసిరి. గ్రహసంచారమును పరీక్షించుటయందు ప్రాముఖ్యత వహించినవారిలో వీరే ప్రథములు. సూర్యరశ్మిచే నడుపబడు నొక గడియారమును వీరు కనుగొనిరి. సూర్యచంద్రాదుల పేళ్ళను వారికి తెలిసిన ఇతర పంచగ్రహముల పేర్లను వేర్వేరు దినములను నిర్ణయించి వీరేడుదినముల వారము ఏర్పాటుచేసిరి. ఆవారమునే నేటివరకును ప్రపంచమునందంతటను వాడుచున్నారు. అంతేకాక యూదు క్రైస్తవ సాంప్రదాయములలో గల 'సాసత్' లేక పుణ్య

వాసరమను ఆచారమునుకూడ ఈ ప్రాచీనప్రజలే యారంభించిరి. ప్రతి నెలయందును 7, 14, 19, 21, 28 తిథులు వారికి పుణ్యదినములు. ఈ దినములలో వంట చేయకూడదు, దుస్తులను మార్చరాదు. బలి యొసంగరాదు. ఈ దినములలో బహిరంగముగ నెట్టి యుపన్యాసమును చేయరాదు. రథముపై కూర్చుండరాదు. రాచకార్యములను నిర్వర్తింపరాదు. తుట్టతుదకు దేహ మస్వస్థగా నున్నను మందుకూడ పుచ్చుకొనరాదు. ఇట్టినియమములనే నెలకు నాలుగు పర్యాయములు శనివారమునాడు యూదులును, ఆదివారమునాడు క్రైస్తవులును అవలంబింపవలయును. ఈ యాచారము బాబిలోనియా అస్సీరియా దేశములలోను, ఫోనీషియాయందునుకూడ వ్యాపించెను.

## సృష్టిక్రమవివరణము

కాల్డియా దేశపు ప్రజలు ప్రపంచమునందలి అతిప్రాచీన జాతులలో నొకరని మనము తెలిసికొని యున్నాము. సృష్టిక్రమమునుగూర్చి ఈ పురాతన ప్రజకెట్టి యభిప్రాయము లుండెనో యించుక పరిశీలింతము. చిన్నచిన్న బాలురనుండి మహా ధీమంతులయిన తత్వవేత్తలవరకు యెల్లవారునుకూడ ఈ ప్రపంచమెట్లు పుట్టినది అను అంశమునుగూర్చి ఆశ్చర్యపడకమానరు. ప్రపంచమునందన్ని దేశములలోని బుద్ధిమంతులును కూడ యీ మహత్తర సమస్యనుగూర్చి యాలోచించి తమతమజ్ఞానసంపద కనుగుణ్యముగ దీనిని పరిష్కరించిరి. అదేవిధముగ ప్రాచీన కాల్డియా విద్వాంసులు కూడ సృష్టి

క్రీ:పూ:మునుగూర్చి అనేక యూహలు కావించిరి. ఈయూహలు వారి మతగ్రంథములందు పొందుపరుపబడినవి. బెరోసస్ అను ప్రాచీన చరిత్రకారుడు ఈ గ్రంథముల ప్రశంస కావించి యున్నాడు. ఈ పవిత్రగ్రంథము పౌరుషేయము కాదట. జ్ఞాన సముద్రుడును, మత్స్యాకారమున సముద్రములో తిరుగుచు ప్రపంచమునెల్ల సంరక్షించువాడును, అగు ఇయాదేవుడే యీ పవిత్రగ్రంథములను వ్రాసి మానవకోటి కొసంగినట్లు బెరోసస్ తెలుపుచున్నాడు. శ్రీమహావిష్ణువు ప్రథమావతారమైన మత్స్యము సముద్రములో ప్రవేశించి అందు దాగి యున్న సోమకాసురుని వధించి ఆతడు దొంగిలించిన వేదములను మరల బ్రహ్మకొసంగినట్లు హిందూ పురాణములలో తెలుపబడిన గాథకును యీ కథకును గల సామ్యము ముఖ్యముగా గమనింపదగి యున్నది. ఈ అపూర్వ గ్రంథమునందు ఇయాదేవుడు ప్రపంచ మెట్లు సృష్టింపబడెనో నాగరకత యెట్లు అభివృద్ధిచెందెనో వర్ణించి, ఆ పుస్తకమును లోకమునందు వ్యాప్తిచెందించెనట. “ఆదిమ యుగమందు ప్రపంచమంతయు చీకటితో నిండియుండెను. అంతయును జలమయము” అని బెరోసస్ తన చరిత్రయందు వ్రాసెను. ఆపైన ఆతడనేక పురాణగాథల పేర్కొనెను. కాని బెరోసస్‌చే వ్రాయబడిన మూలగ్రంథ మిప్పుడెచ్చటను లభ్యమగుటలేదు. ఆతని పుస్తకమునుండి అనేకాంశములను గైకొని తరువాత కాలమువారు తమ పుస్తకములలో పేర్కొని యున్నారు. బెరోసనుచే

వ్రాయబడిన విషయములు విశ్వసనీయములని తెల్పుటలో యెట్టిసంశయమునులేదు. కాని యీతడు ప్రాచీన కాల్డియా దేశపు పవిత్ర గ్రంథములలో తన కావశ్యకమైనవానిని, పాఠకులగు గ్రీకు పండితుల కొప్పెంపల యగువానిని మాత్రమే సేకరించెను. పైన తెలుపబడిన పవిత్రగ్రంథములు లభ్యము కానినాడు ప్రాచీన కాల్డియా దేశీయుల మతవిశ్వాసము లిట్టివని నిర్ణయముగా తెల్పుట దుస్సాధ్యము. అదియునుగాక యీ గ్రంథములనుండి భావికాలపు యూదు ప్రజ లేయేవిశేషములను గయికొనిరో తెలిసికొనుట మరియును అసంభవమగును. కావున పండితలోకమంతయు ఈయపూర్వగ్రంథములు లభింపమికి మిక్కిలి చింతించుచుండిరి. కాని జార్జిస్మిత్ అను చారిత్రిక పరిశోధకు డదృష్టవశమున నీగ్రంథరాజమునందలి కొన్ని యంశములు బ్రిటీషుమ్యూజియమునందు పొందుపరుపబడిన యిటుకలపై వ్రాయబడియుండుట కనుగొనెను. కాని అవి మిక్కిలి అసంపూర్ణముగ నుండుటచే ఆతడు మెసొపొటేమియా దేశమున కనేకపర్యాయములు పోయి ఈ గ్రంథమునకు కొన్ని యితర ప్రతులను సంపాదింపగలిగెను. ఈ ప్రతులలో నొక్కటియునుకూడ సంపూర్ణముగ లభింపలేదు. కాని తమకు లభించిన యంశములను క్రోడీకరించి చారిత్రకు లీక్రింది విషయములను తెలుపుచున్నారు. ఇట్లు తెలుపబడిన విషయములన్నియు ప్రాచీన గ్రంథములలోనివి కావు. సందర్భము

ననుసరించి కొన్ని యూహలుకూడ కావింపబడి యీ గాథ కూర్చబడినది.

అనాదియందు ప్రపంచమంతయును అంధకారబంధుర ముగనుండెను. అప్పటికి భూమ్యాకాశములు కూడ సృష్టింప బడలేదు. ప్రపంచమంతయు జలమయముగ నుండెను. భూమ్యాకాశములను పాలించు దేవతలుకూడ అప్పుడు లేకుండిరి. ఈజలములయందు జీవశక్తి యున్నను విశ్వమంతయు చీకటిచే నిండియుండుటవలన నెట్టి జీవములును ఉత్పత్తి కాలేదు. మరి కొంతకాలమునకు భూమ్యాకాశముల పాలకులు జన్మించిరి. ఆపైన దేవతలలో శ్రేష్ఠులయిన త్రిమూర్తులు అనూ, ఇయా, బెల్ అనువారు పుట్టిరి. అటుతరువాత ఆకాశమునందలి నక్షత్ర ములు, గ్రహములు మున్నగునవి వెలువడెను. అనూదేవుడు ఆకాశమునకు రాజయ్యెను. ఆతడే దేవతలకు వారివారిస్థాన ముల నేర్పాటుచేసెను. ఈ దేవుడు నక్షత్రముల వానిస్థాన ములందు నియమించి, నెలలను, సంవత్సరములను నిర్ణయించెను. గ్రహకూటములు సంచరింపవలసిన మార్గములనుకూడయాతడే చూపెను. ఇయా, బెల్ దేవులకు నివాసములనుకూడ యాతడే సృష్టించెను. అనూ దేవుడు సూర్య చంద్రాదులకు వారివారి ధర్మములు బోధించి, నిర్ణీతమగు కాలములలో వారు [illegible] యాస్తమయములు కావింపవలెనని యేర్పరిచెను. ఈ సృష్టి యంతయు పూర్తి యయిన తరువాత, ఇతర సామాన్య దేవతల జన్మించిరి. వీరితర్వాత మానవులును, పశువులును, అరణ్యము

నందలి క్రూరమృగములును, ప్రాకునట్టి జంతువులును, క్రమ
ముగా ఉద్భవించెను.

మనుష్యుల సృష్టినిగూర్చి ప్రత్యేకముగ తెల్పు కొన్ని ఇటుకలుకూడ లభించినవి కాని అందలి విషయములు చాల వరకు చెడిపోయినవి. ఈదేశపు చారిత్రిక శిథిలములలో కొన్ని యపూర్వములయిన ముద్రికలు లభించినవి. ఈ ముద్రికలపై దంపతులొక చెట్టునకు రెండువైపుల ఆసనముల నధిష్ఠించి యున్నట్లును, అందు స్త్రీ వేరొక భాగమున నొక సర్పము తోకపై నిలువబడి యీమెతో యేదియో రహస్యముగ తెలుపుచున్నట్లు చిత్రింపబడినది. క్రైస్తవ పురాణముల యందలి ఆదిమ దంపతులగు ఆడమ్ ఈవ్‌గార్ల నీచిత్రము తలపించుచున్నది. భగవంతునికి ద్రోహముచేసి, ఆకారణమున నాయనచే శిక్షింపబడిన రాక్షసుడు సాటన్ అనువాడు భగవంతునికి ప్రతీకారము చేయవలెనను తలంపుతో ఆయనచే సృష్టింపబడిన ఆదిమదంపతులకు హాని తలంచెను. ఈతడు సర్ప రూపమున ఈవ్‌ను సమీపించి ఆమెమనస్సును పెడత్రోవలపట్టించెను. దానివలన ఈ ఆదిమదంపతుల మనస్సులో కల్మషము ప్రవేశించి, తత్కారణమున వారు భగవదాజ్ఞ నుల్లంఘించుటయు, స్వర్గసామ్రాజ్యమునుండి చ్యుతులగుటయును ప్రసిద్ధము. బహుశః ఇట్టిగాథయే కాల్డియాదేశమునందు ప్రచారములో నుండియుండవచ్చును. పైన తెలుపబడిన చిత్రమీకథనే సూచించుచున్నది. కాల్డియాదేశపు చిత్రములలో ననేకఘట్ట

ములందు దేవతలును మానవులునుకూడ ఒక వృక్షమువద్ద భక్తిభావముతో నిలువబడి యున్నట్లు చూడవచ్చును. ఈ వృక్షమును క్రైస్తవ సాంప్రదాయము ప్రకారము." Tree of Life" అనగా జీవితవృక్షమని పేర్కొనవచ్చును. ఈ సృష్టి క్రమమునందలి మరియొక అంశము విచిత్రముగ కాన్పించు చున్నది. ప్రపంచ మంతయు అంధకారబంధురముగనున్న కాలములో జలములందు జీవశక్తియుండెను. కాని ఆ జీవశక్తి నియమబద్ధము కాకుండుటచే దానినుండి అనేక వికార స్వరూపము లుద్భవించెను. జంతువుల తలలుగల మనుష్యులు, మేకల శిరస్సుగల గుఱ్ఱములు, నాలుగు దేహములుగల కుక్కలు మున్నగు అనేక వికారాకారములు బయలుదేరెను. కాని బెల్ దేవుడు భూమ్యాకాశములను, వేరుపరచి అంధకారమును, తరిమివేయునరికి, యపూర్వసృష్టియంతయు మాయమయ్యెను క్రమబద్ధమగు లోకమునందు వీనికి తావులేదు. అనాదియందిట్టి విచిత్రసృష్టి యుండెనని తెలుపు నిమిత్తమే శిల్పులు బాబిలోనునగరమందలి బెల్ మార్డూక్ దేవుని యాలయముపై యిట్టి విచిత్రజంతువుల చిత్రించిరని చరిత్రకారుడగు బెరోసస్ వ్రాసి యున్నాడు.

## స్వర్గనిర్ణయము

నాగరక ప్రపంచమునందలి అన్నిజాతులును కూడ తమకుగల భూగోళశాస్త్రజ్ఞానము ననుసరించి ఎచ్చటనో ఒక చోట స్వర్గమను ప్రదేశమును నిర్ణయించుచుండిరి. ఆదిదేవతా

నివాసమనియు, అచ్చట సర్వకాలములయందును, సౌఖ్యప్రద మగు శీతోష్ణస్థితియుండుననియు, మరణానంతరము పుణ్యులగు వారచ్చటకేగుదురనియు, ప్రజలలో విశ్వాసముండెడిది. అట్లే ప్రాచీన కాల్డియా ప్రజలుకూడ నాకలోకమును నిర్ణయించిరి. వారి యుద్దేశ్యముప్రకార మీస్వర్గలోక మొక పర్వతాగ్రమున నెలకొనియున్నది. ఆపర్వతము ఉత్తరదిక్కునందుకాని లేక ఈశాన్యదిశయందుకాని కలదు. ఈ పర్వతము ప్రపంచములో కెల్లనుత్తమమైనది. మరణించిన ధర్మాత్ములెల్లరును ఇందుప్రవేశింతురు. ఇచ్చటి ఆకాశము వెండితెరవలె తెల్లగనుండును. భూమి సేద్యముచేయకనే అన్నిసస్యముల నొసంగును. ఈ పర్వతము మహోన్నతమై ఆకాశమును తాకుచుండును. గ్రహకూటమంతయు దీనిచుట్టును తిరుగుచుండును. అతిపవిత్రమైన యీపర్వతము కాల్డియాగ్రంథములలో పలుమారు ప్రశంసింపబడినది. ప్రజలెల్లరునుదీనిని మిక్కిలి భక్తిభావముతో గౌరవించుచు తామునిర్మించెడి కట్టడములలో నీ పర్వతాకారమును సాధ్యమైనంతవరకు చూపవలెనని యత్నించుచుండిరి. అందును ముఖ్యముగ దేవాలయములను, రాజప్రాసాదములను, నిర్మించునప్పుడిట్టి యాకారములు సృష్టింపబడుచుండెను. ఎత్తయిన వేదికలపై కాల్డియా దేవాలయములను నిర్మించుట కిదియొక కారణ మని తోచుచున్నది. కోయంజిక్ అను ప్రదేశమునగల చారిత్రిక శిథిలములలో నీ స్వర్గలోకపు ప్రతిరూపమొకటి లభించినది. అందు ఎత్తయిన ఒకదిబ్బపై ప్రాసాదమొకటి నిర్మింప

బడియున్నది. దానిచుట్టును ఒకతోటగలదు. ఈ తోటలోనికి దిగువనుండి నీరు సరఫరా చేయబడుచున్నది. కాల్డియా దేశమునందలి దేవాలయము లన్నియు దిగువభాగమున విశాలముగనుండి పైకిపోయిన కొలదియు కోసలుతేరి ఇంచుమించు పర్వతము లనే పోలియుండుట కా దేశస్థులకు పర్వతసామ్యమునందుగల యభిమానమే మూలముకావచ్చును. ఈ దేశపు దేవళములకు "జిగ్గురాట్" అనుపేరు. ఈ పదమునకు పర్వత శిఖరమని యర్థము. అషుర్ పట్టణమునందలి అతిప్రాచీన దేవాలయములలో నొకదానిపేరు. "ప్రపంచమందలి అత్యున్నత పర్వతస్థానము."

కాల్డియాప్రజలు నిర్మించెడి దేవాలయములు మూడు అయిదు, లేక ఏడంతస్తులతో నిర్మింపబడుచుండెను. ఇవి వారి యుద్దేశ్యములో పవిత్రసంఖ్యలు. మూడు త్రిమూర్తులగు అనూ, ఇయా, బెల్ గార్లను సూచించును. గ్రహములు వారిసిద్ధాంత ప్రకార మైదు. సూర్యచంద్రాదులనుకూడ చేర్చినచో, నేడు గ్రహము లేడు. బార్సిప్పానగరమునందలి సుప్రసిద్ధమగు ఏడంతస్తుల దేవాలయమునుగూర్చిన ప్రశంస ఈపరకే కావింపబడి నది. ఇది ప్రాచీనకాలమున నిర్మింపబడి శిథిలమై పోగానే బుఖడ్నెజారు అను బాబిలోనియా రాజు దీనిని క్రీ. పూ. 600 ప్రాంతమున పునర్నిర్మాణము కావింపించెను. ఈఅంతరువులలో ప్రతిదానికిని ఒక్కొక్క విధమగు రంగు కూర్చబడెను. సప్తగ్రహములకును ఈ అంతరువులు ప్రాతినిధ్యము వహించు చుండెడివి. కావున ఆయాగ్రహముల ననుసరించి అంతరువుల

రంగులు మారుచుండెను. సూర్యునిది బంగారు వర్ణము. చంద్రునిది ధవళవర్ణము; శనైశ్చరునిది కృష్ణవర్ణము. బృహస్పతిది నారింజపండురంగు. అంగారకుడు రక్తవర్ణముకలవాడు. శుక్రుడు లేతపసుపు రంగుగ నుండును. బుధుడు నీలవర్ణుడు. పునాది యంతరువు శనైశ్చరునిది. కావున నీ అంతరువునకు తారువూసి నల్లగ కావించిరి. రెండవ యంతరువు బృహస్పతిది. ఈతనిరంగు నారింజపండురంగు కావున ఆరంగువచ్చునట్లు కాల్చిన యిటుకలతో నీ యంతరువు పైభాగము కూర్చబడెను. మూడవ యంతరువు అంగారకునిది. ఈతనిది లోహితవర్ణము. కావున నీయంతరువు సగముకాలిన యెఱ్ఱని ఇటుకలతో నలంకరింపబడెను. నాలుగవయంతస్తు సూర్యునిది. ఈతనిది సువర్ణచ్ఛాయ కావున నీఅంతరువు పైభాగమంతయు, పలుచనైన బంగారు రేకులతో కప్పబడెను. అయిదవ అంతస్తు శుక్రునిది. ఈగ్రహము లేతపసుపు రంగుగనుండునని యూహింప బడుటచే ఆరంగు గల యిటుకలతో నీ యంతరువు నిర్మింపబడెను. ఆరవ అంతస్తు బుధునిది. ఈతడు నీలవర్ణుడు. ఈ యంతరువును కట్టిన మీఁదట ఇందలి ఇటుకల నతితీవ్రముగ వేడిమిచే తప్తముకావించిరి. దానివలన వాటిరంగు నీలవర్ణముగమారెను. తుది యంతరువు చంద్రునిది. ఈతడు తెల్లగనుండును. కావున నాలుగవ యంతరువును బంగారు రేకులతో కప్పినట్లే దీనిని వెండి రేకులతో కప్పిరి.

ఈ యప్రాప్య దేవాలయము అతిప్రాచీనమైన కారణము చేతనే గాక మరియొక విధముగ కూడ విఖ్యాతి చెంది యున్నది. అనేక శతాబ్దములనుండి పామర జనులును, పండితులునుకూడ నీ దేవాలయము క్రైస్తవ మత గ్రంథమందు పేర్కొనబడిన 'Tower of Babel' అని తలంచు చున్నారు. బైబిలు గ్రంథమునందలి యీ కథ చిత్రముగ నున్నది. ఒకానొక కాలమున మానవులెల్లరును గర్వము తోడను, అహంకారము తోడను, తారతమ్య మెఱుంగక తాము దేవతలకన్న మిన్నయని తలంచి ఆకాశమును తాకే కట్టడము నొకదానిని నిర్మించుటకై ప్రయత్నములు మొదలిడిరి. ఆ కట్టడము నానాటికి పెరిగిపోవుచు ఆకాశమును సమీపింపబోవునరికి దేవతలు, మానవుల యహంకారమునకు కోపగించి భయంకరమైన తుపానులను కల్పించిరి. అందులకు తోడుగా ఈ భవన నిర్మాణము నందు పాల్గొన్నవారు వివిధ భాషలను మాట్లాడునట్లు కావించిరి. దీనివలన మానవులలో నైకమత్యము లేకుండుటయు వారు ముందెన్నడును దేవతల కిట్టి యపచారము కావించుటకు సాహసింప రనియు దీని యుద్దేశ్యము. ఇట్టి కథను సూచించు కొన్ని ఇటుకలు ప్రాచీన కాల్డియా భాండాగారములలో కాన్పించినవి. మత దృష్టిచే దీనియందెంత యదార్థమున్నను చరిత్రకారుని దృష్టియం దీకథకొకటే యర్థము నిష్పన్న మగుచున్నది. అతి ప్రాచీన కాలములో యూఫ్రటీసు మైదానములు ప్రాగ్దేశపు జాతులకు జన్మ

భూమివంటివి. కొంత కాలమువరకు బాబిలోనియా పల్లపు భూములలో నివసించిన జనులు తరువాత వారు విడిపోయి వివిధదేశ ములకు వలసపోయి రనియు, వివిధ భాషలను వాడుట ప్రారం భించి రనియు అర్థము చెప్పవచ్చును.

### దుష్టశక్తులు

భూలోకమునందు వివిధ జీవరాసు లుత్పత్తి కాక పూర్వమిచ్చట వికారాకారములు గల అనేక సంకర మృగ ములు మున్నగునవి పుట్టెనని తెలిసియున్నాము. ఈ విచిత్ర సృష్టికి ముమ్మూటిమియట్ అను నొక రాక్షసుడు కారకుడట. బెల్ దేవుడు ఆకాశమును భూమిని వేరుపరచునప్పటికి ప్రపం చము నావరించిన యంధకారమంతయు పటాపంచలయ్యెను. నియమ బద్ధమగు సృష్టి ప్రారంభించెను. ప్రకృతి విరుద్ధములగు వికారాప జంతువులన్నియు మాయ మయ్యెను. కాని ఇంతటితో ముమ్మూటిమియట్ రాక్షసుడు నశింపలేదు. ఆతడు సజీవుడై యుండుటయే గాక వీలైనంతవరకు భగవత్సృష్టికి నష్టము కలి గింపవలెనని సర్వదా యత్నించు చుండెను. ఈ రాక్షసుడొకప్పు డొక క్రూర మృగమువలెను, మరొకప్పుడు విషసర్పము వలెను కాన్పించు చుండెనట. ప్రాచీనకాలపు కాల్డియా పురా ణములు పెక్కులు మనకు లభ్యములుకాలేదు. అవి లభించిన పక్షమున ఆదిమ దంపతులలో స్త్రీ వ్యక్తి దుష్టబుద్ధి కల్గించి వారి పతనమునకు కారణభూతమైన దీసర్పమే యని తెలియ వచ్చుననుటకు సందేహములేదు. ఈ ముమ్మూటియమిట్

వలన ప్రపంచమున కెన్నిటికైన హాని సంభవింపక పోదని తెలిసికొని దేవత లీరాక్షసుని జయింపవలెనని నిశ్చయించుకొనిరి. ఈ మహత్తర కార్యమును నిర్వహించుటకై బెల్ మార్డూకు దేవుడు నియమింపబడెను. ఈతనికి అనూ దేవుడు దివ్య కవచమును, దివ్యాయుధములను ప్రసాదించెను. బెల్ మార్డూకు రాక్షసునితో ఘోరయుద్ధము చేసి తుదకాతని నోడించి సంకెళ్ళతో బంధించెను. ముమ్మాత్ర రాక్షసుని యనుచరులు భయభ్రాంతులై పారిపోయిరి. బెల్ మార్డూక్ దేవుడు రాక్షసులతో యుద్ధము చేయుచున్నట్లు చూపెడి యనేకచిత్రములు కాల్డియా దేశము నందలి శిథిలములలో లభ్యమైనవి. మరొక పర్యాయము ప్రపంచమందెల్లప్పుడును సంచరించుచుండు సప్త దుష్టశక్తులు చంద్రునిపై దాడివెడలి యాతనిని కప్పివేసెనట. అప్పుడాతనికి సహాయకులగు సూర్యుడును, ఇష్టారు దేవతయు పారిపోయిరి. అప్పుడు తన తండ్రి యాజ్ఞానుసారముగ మార్డూకు దేవుడు బయలువెడలి దుష్టగ్రహములను పారద్రోలి చంద్రుని రక్షించెను. చంద్రగ్రహణమునే యీ విధముగ నా ప్రాచీనులు వర్ణించిరని యూహించుట పొరపాటుకాదు.

## పురాణగాథలు

ప్రపంచము నదంలి నాగరక జాతుల కన్నిటికిని కూడ పురాణములు ఇతిహాసములు మున్నగునవి కలవు. ఈ గ్రంథము లాయాజాతుల యౌన్నత్యమునకు కారకులును,మహావీరులును,

సంస్కర్తలును, అగు వారిని గూర్చియు, శేష మహా మహిమాన్వితులగు రాజులను గూర్చియు వివరించును. ఇట్టి మహనీయులును కేవల మానవ మాత్రులుగా కాక దైవాంశ సంభూతులని తలంచుట ప్రాచీనించు అన్ని దేశములయందును కూడ ఆచారముగ కానవచ్చుచున్నది. పురాతన కాల్డియా దేశమునందు కూడ ఇట్టి పురాణము లుండియుండుట సహజము. ఈపురాణములలో నొకటి మనకు లభ్యమైనది. ఇది పండ్రెండు అధ్యాయముల గ్రంథము. ఇందు మూడువేలపంక్తులు కలవు. ఎరెకు అను ప్రాచీన కాల్డియాపట్టణమునేలిన యొక రాజు వృత్తాంతము ఇందు వర్ణింప బడియున్నది. ఈగ్రంథము నందలి యొకఘట్టమును చరిత్రకారుడైన బెరోసస్ పేర్కొనియున్నాడు. జార్జిస్మిత్ అను చారిత్రకపరిశోధకుడు బ్రిటీషు చిత్రవస్తు ప్రదర్శన శాలయందు కుప్పలుగా పడియున్న అషుర్ బనిపాలు రాజు భాండాగారము నందలి ఇటుకల నన్నిటిని అఖండమైన యోపికతో పరీక్షించి పైన పేర్కొనబడిన కాల్డియా పురాణము నుద్ధరించెను.

అనాదియందు ఇయా దేవుడు మత్స్య రూపమున నవతరించి మానవ జాతికి జ్ఞాన భిక్ష పెట్టిన 2,59,000 సంవత్సరములకు తరువాత కాల్డియా దేశములో నొక రాజు వంశమువారు పాలింప మొదలిడిరి. అందు పదుగురు రాజు లుండిరి. వారు మొత్తముమీద 4,32,000 సంవత్సరముల కాలము రాజ్యపాలనము చేసిరి. వీరిలో హాసిసాద్రుడను రాజు

తుట్టతుది వాడు. ఈతనిని జెసోసస్ Xisathros అని పేరొకని యున్నారు. ఈ రాజొకనాటి రాత్రి నిద్రించుచుండగా భగవంతు డాతనికి కలలో దర్శన మొసంగి "అతిశీఘ్రకాలములో జల ప్రళయము ప్రారంభము కాబోవుచున్నది. కావున నీవు నీదారాపుత్రాదుల తోడను, స్నేహితులతోడను, ప్రపంచము నందలి పశుపక్ష్యాదుల తోడను, ఒక యోడయందు తల దాచుకొనుము. నీతోకూడ వలసినంత భోజనసామగ్రి నుంచుకొనుము. మీ జాతి పవిత్రగ్రంథముల నన్నింటిని సిప్పార్ నగరమునందలి సూర్య దేవాలయమునకు గొనిపోయి అచ్చట పాతిపేయుము," అని యాజ్ఞాపించెను. హాసిసాద్రు డట్లే కావించెను. మూడవనాడు ప్రళయ వర్షము శాంతించెను. అప్పుడాతడు పక్షులను పంపి భూభాగము తేలినసంగతి కనుగొనెను. ఈతని యోడ ఒక పర్వతాగ్రముపై పోయి చేరుకొనెను. అప్పుడు హాసిసాద్రు డోడను వగులగొట్టుకొని బయటికివచ్చి భగవత్ప్రీతిగ బలిదాన మొసంగెను. మరికొంత సేపటి కీతనియనుచరులు ఓడనుండిబయటికివచ్చునరికీతడదృశ్యుడయ్యెను. అప్పు డశరీర వాణి యిట్లు పల్కెను. "పుణ్యాత్ముడైన యీరాజు దేవత్వమును పొంది దేవలోకమునకు వెడలిపోయినాడు. మీరందరును బాబిలోనియా దేశమునకు మరలి పోయి, పవిత్ర గ్రంథములను పునరుద్ధరించి వానిని మానవులలో వ్యాప్తిచెందింపుడు" వారాయాజ్ఞానుసారము బాబి

లోనియా దేశమునకు మరలివచ్చి యచ్చట పల్లెలను పట్టణము లను మరల స్థాపించిరి.

పైన పేర్కొనబడిన కాల్డియా దేశపురాణము నందు కొన్ని భాగములు శిలమైపోయినవి. కాని మిగిలిన భాగముల సహాయమునను, ఊహాశక్తి చేతను ఈ క్రింది విషయములు సేక రింపబడినవి. ఈ కథాకాలము నాటికి సుమేరు దేశమునకు ఎరిక్ పట్టణము రాజధానిగ నుండెను. ప్రాచీన కాలమునందు దీనిని డుమూజీ అను దైవాంశసంభూతుడు పాలించెను. అతని భార్య ఇష్టార్ అను దేవత. ఈమె అనూదేవుని కుమార్తె. డుమూజీ అకాల మరణము పాలయిన తరువాత ఈమె రాజ్య భారము పూనెను. కాని శత్రురాజులను జయప్రదముగ నెది రించుట కీమె సమర్థురాలు కానందున వీరి రాజ్యము ఎలామ్ ప్రభువుల వశమైపోయెను. ఈ నూతన రాజుల ప్రభుత్వము జనకంటకముగ నుండెను. ప్రజ లెల్లరును ఈ విదేశ ప్రభుత్వ మెన్నడు నశించునా యని యెదురు చూచుచుండిరి. ఆ కాల ములో హాసిసాద్రుని వంశమునందు జనించిన వీరుడొకడుండెను. ఈతని నామధేయము ఇజ్డుబార్. ఈతడు మహా బలశాలి. మొదట ఆతడొక ఆటవిక నాయకుడుగ నుండెడివాడు. ఒకనా డీతనికి విచిత్రమగు స్వప్నము కలిగెను. ఆకాశమునుండి నక్షత్ర ములు జారి తన వెన్నుపై బడినట్లును, ఒక భయంకరమైన మృగ మేదో తనవద్ద నిలచి యున్నట్లును, ఆతడు కలగాంచెను. ఈ కలయొక్క అర్థము నాతని కెవ్వరును తెలుపజాలక పోయిరి.

అట్టి తెలివిగలవారికి కష్టతరమైన ధనమునొసంగెదనని ప్రకటించి నను ఫలము లేకపోయెను. ఆ కాలములో ఇయాబాని అను నొక ఋషి యుండెడివాడు. ఈ ఋషి మనుష్యదేహమును, వృషభ పాదములును, తలపై కొమ్ములును కల విచిత్రపురుషుడు. అతడు గొప్పజ్ఞాని. ఎట్టి క్లిష్టసమస్యలనైనను అవలీలగ వివరింపగలడు. కాని యితడు సర్వదా అరణ్యమునందే జంతువులతో సహా నివసించుచు మానవ సంఘమునిన అసహ్యించుకొనెడివాడు. ఈ మహాజ్ఞాని సంకష్టముపై ఇజ్డుబార్ తన వద్దకు రావించుకొని తాను చూచిన స్వప్న వృత్తాంతము నాతనికి తెలిపి, దాని ఫలితము నాతనివలన నెరింగెను. కాని కాల్డియా పురాణమందలి యీ ఘట్టము నశించినది. కావున జ్ఞానియైన ఇయాబాని తెల్పిన అపూర్వ విషయములు మనకు తెలియరాకున్నవి. ఇజ్డుబారు శక్తి, సామర్థ్యములను పరీక్షించుటకై ఇయాబాని యొక సింహము నరణ్యమునుండి తీసికొని వచ్చెను. ఇజ్డుబారు వీరుడీ సింహముతో పోరాడి దానిని సంహరించెను. ఇయాబాని అతని ధైర్య సాహసములకు సంతసించి యాతనికి మిత్రుడయ్యెను. మరికొంత కాలమునకీ మిత్రులిరువురును, క్రూరుడైన ఎలామ్‌రాజు "ఖుంబాబా" అను వానిపైకి దాడివెడలి ఆతని రాజప్రాసాదము నందు ప్రవేశించి ఆతనిని సంహరించిరి. దీనివలన కాల్డియారాజ్యము విదేశీయులపాలనమునుండి తప్పించుకొని స్వతంత్రమయ్యెను. ఆపైన ఇజ్డుబార్ వీరుడు ఎరికు పట్టణమున సింహాసనము నధిష్ఠించెను.

అనూ దేవుని కుమార్తెయగు ఇష్టారు దేవత ఇజ్డుబారు వీరుని ప్రేమించి అతని ప్రణయము నర్థించెను. కాని యీ వీరపురుషుం డామెను తిరస్కార భావముతో చూచి, ఆమె అంతకు పూర్వము తమ్మూజ్ అను దేవాంశసంభూతుని భార్యగా నున్నందులకై ఆక్షేపించెను. అందుచే ఇష్టారు దేవత కాగ్రహము కలిగి తండ్రి యొద్దకు పోయి తనకు సంభవించిన పరాభవము నాతనికి సవిస్తరముగ తెల్పెను. ఆమె కోరికపై అనూదేవు డొక బ్రహ్మాండమగు వృషభమును సృష్టించి ఇజ్డుబారుపైకి పంపెను. కాని ఇజ్డుబారు కొంచమైనను జంకక తన మిత్రుడైన ఇయాబాని సహాయముతో ఆ ఎద్దును చంపివైచెను. దానితో ఇష్టారు దేవత ఆశలన్నియు అడుగంటెను. ఆమె తన చెలికత్తెలతోసహా ఎరెకు పట్టణము కోట గోడలపై కెక్కి అశుభప్రదముగ చనిపోయిన ఎద్దుకొరకై శోకములు పెట్టెను. కాని ఇజ్డుబారును అతని స్నేహితుడును లక్ష్యపెట్ట లేదు. వారీ వృషభముయొక్క గుండెకాయను తీసి సూర్యునికి ఆ గుండెకాయను బలిదానమొసంగి, యూఫ్రెటీసు నదిలో కాలు సేతులు కడుగుకొని తమ నగరమునకు మరలి వచ్చిరి. ఇష్టారు దేవత తన్నవమానించిన ఇజ్డుబారుపై కసితీర్చుకొన వలెనని పట్టుపట్టి మొట్టమొదట అతని ప్రాణమిత్రుడైన ఇయాబాని నాకస్మిక మృత్యువుపాలు కావించెను. దానితో ఇజ్డుబారు మిక్కిలి కృంగిపోయెను. కాని అతని కష్టము లంతటితో అంతమొంద లేదు. ఇష్టారు దేవి శాపమువలన అతని దేహము

వ్యాధిగ్రస్తు మయెను. ఆతని బలము క్షీణించెను. జీవితము దుస్సహముగ కాన్పించెను. ఆతనికి భయంకరమైన కలలు రా జొచ్చెను. ఈబాధలనుండి తప్పించుకొన వలెనను ఉద్దేశ్యముతో ఆతడు తన పూర్వీకుడైన హాసిసాద్రుని చూచి ఆతని సలహాను పొందవలెనని నిశ్చయించు కొనెను. ఈహాసిసాద్రు డెవ్వరికి చేరశక్యముగాని పుణ్యలోకములో నివసించునని తెలిసియును కూడ ఇజ్డుబారు రాజు ఆతని వద్దకు పోవలెనని నిశ్చయించి బయలుదేరెను. మొదట ఈత డొక విచిత్రమైన దేశమును ప్రవేశించెను. అచ్చట నడుమువరకును మనుష్య దేహములును అధోభాగమంతయును వృశ్చికాకారమును గల విచిత్ర జీవు లాతనికి కాన్పించిరి. ఆవిచిత్ర జంతువులు ఇజ్డుబారును చూచి ఆతడు దైవశాపమునకు గురియయ్యెనని గుర్తెరింగి ఆతనితో సంభాషించుటకే సంశయించెను. కాని ఇజ్డుబారు తన దుస్థితిని వానికి తెలిపిన మీదట వాని మనస్సుకరగి అయ్యవి ఆత నికి స్వర్గమునకు పోవు మార్గమును తెలిపెను. ఇజ్డుబారువీరుడు నిర్మానుష్యమైన అనేక ప్రాంతములను గడచితుదకొక సముద్ర తీరమును సమీపించెను. ఆ అపారపారావారము నతిక్రమించిన యెడల పుణ్యాత్ములుండెడి స్వర్గలోకమునకు పోవచ్చును. ఆ సముద్రమును దాటుటకు "ఉరుబెల్" అను నావికుని సహా యము పొంది మూడు పక్షము లహోరాత్రములు సముద్ర ముపై ప్రయాణము చేసి, తుదకు ఇజ్డుబారు మృత్యుసాగరము (Waters of Death)ను దాటెను. ఆపుణ్యలోకమునం దాతనికి

నికి తన పూర్వీకుడైన హాసిసాద్రుని దర్శన భాగ్యము లభించెను. హాసిసాద్రుడు తన వంశీకుడైన ఇజ్డుబారును కనికరించి, ఆతనికి రోగనివృత్తి కావింపుమనియు, దేహ పాటవమును, సౌందర్యమును, తిరిగి యిమ్మనియు "ఉరుబెల్" నకు ఆదేశమొసంగెను. ఈసందర్భమునందే ఇజ్డుబారు ధన్యుడైన తన పూర్వీకుడు హాసిసాద్రుడు పుణ్యలోకములో శాశ్వతనివాసిగా నుండుటను గూర్చిన వృత్తాంతమును తెలుపుమని కోరెను. కాల్డియా పురాణములలో వర్ణింపబడిన జలప్రళయపు గాథను మిక్కిలి వాత్సల్యముతో హాసిసాద్రుడు ఇజ్డుబారునకు తెలియచేసెను. అటుపైన "ఉరుబెల్" సహాయమున ఇజ్డుబారు ఆరోగ్యమును, శరీర దార్ఢ్యమును, యౌవనమును, సుందర రూపమును, మరల పొందెను. తన దేశమునకు మరలివచ్చిన తరువాత ఇజ్డుబారు మిత్రుడైన ఇయాబాని మరణమునకై మిక్కిలి దైన్యముతో విలపించుచుండుట చూచి కనికరించి ఇయాదేవుడు తన కుమారుడైన మెరిడుగ్‌ను పంపి, ఇయాబాని ఆత్మను అంధకార బంధురమైన మృత్యులోకమునుండి రక్షించి, నిత్యానంద దాయకమగు స్వర్గమునకు తెప్పించెను. దీనివలన ఇజ్డుబారునకు మనశ్శాంతి లభించెను.

### గాథలయంతరార్థము

పైనపేర్కొనబడిన కాల్డియా పురాణము ప్రపంచమునందలి అతిప్రాచీన గ్రంథములలో నొకటియని నిస్సంశయముగ తెలుపవచ్చును. ఈగాథయందలి యథార్థతత్త్వమును సంపూ

ర్ణముగా తెలిసికొనుటకు మనకాధారములులేవు. కాని కొందరు పండితులు ఈ గాథ కేవల మహామహాత్ముడైన యొకవీరుని చరిత్రము కాదనియు, అంతకంటె శ్రేష్ఠుడును శాశ్వతుడునైన యొక దేవుని జీవనక్రమము నాలంకారిక భాషలో పౌరాణికుడు వర్ణించియున్నాడనియు తెలుపుచున్నారు. ఈ కథ లోకబాంధవుడైన సూర్యదేవుని వృద్ధిక్షయములను వర్ణించు నట్టిదని కొందరు శాస్త్రజ్ఞుల విశ్వాసము. సమశీతోష్ణ మండలము (Temperate zone) లందు కాలమానమును నాలుగు ఋతువులుగా విభజించియున్నారు వసంతకాలము, గ్రీష్మము హేమంతము, శిశిరము, అని వీనినామధేయములు. ఈ ప్రదేశములలో వర్షపాత మన్ని ఋతువులయందును సంభవించుచుండును. కావున వీనికి ప్రత్యేకముగ వర్షఋతువు లేదు. సూర్యుడు వసంతకాలమునందు ప్రకాశవంతుడై యుండి, గ్రీష్మమునందు దుర్నిరీక్ష్య ప్రతాపుడై వెలుగును. ఆపైన శిశిర హేమంతములందాతని తేజము క్రమక్రమముగా క్షీణించును. చలికాలమునందు జరారోగ పీడితునివలె సూర్యుడు మిక్కిలి అల్ప ప్రతాపుడై అసహాయస్థితియం దుండును, కాని ఆసూర్యుడే మరల వసంతకాలము ప్రారంభమునకే తన తొల్లింటి సౌందర్యమును, వార్ధక్యమును జయించి మరల యథాప్రకారముగా తన ప్రతాపమును చూపుట ప్రారంభించును. ఈ విధముగ ప్రతి సంవత్సరము సూర్యుడు వృద్ధిక్షయములకు లోనగును. ఈ విషయము మనమునందుంచుకొని పౌరాణికు లీగాథను

సృష్టించి యుండవచ్చు నని కొందరి వాదము కలదు. ఇజ్దుబారు వీరుడు పరిశ్రమములచే గొప్ప కార్యములు [illegible] విఖ్యాతి జెంది యుండి, కొంతకాలము గడచినకాని [illegible] క్రూరుడైన "ఖుంబాబా" అను రాజును సంహరించి, [illegible] మహా త్తర తేజముతో ప్రకాశించెను కాని [illegible] అతని దేహము వ్యాధిగ్రస్తముకాగా [illegible]. జరాపీడి తుడైన ఇజ్దుబారునకును, [illegible] విలుప్త తేజుడైన సూర్యభగవానునకును సామ్యముకానవచ్చు చున్నది. కాని ఇజ్దుబారు వీరుడు [illegible] దేవతల యను గ్రహముచే మరల యౌవనమును, ఆరోగ్యమును, సౌందర్యమును పొందినట్లుగనే సూర్యుడు నైతము శిశిరహేమంతములు గడచినతరువాత మరల తన తేజస్సును పొందును. ఇజ్దుబారు వీరుని జీవితమునకును, సంవత్సరక్రమమునకును మరియొక సామ్యముకూడ కానబడుచున్నది. ఈ ఇజ్దుబారు పురాణమునందు పండ్రెండు అధ్యాయములు. అట్లేసంవత్సరమునందు పండ్రెండు నెలలు. అధ్యాయముల నామములు ఆయాకాలములలో ప్రకృతియందు సంభవించు మార్పులను స్పష్టముగసూచించుచున్నవి. ఉదాహరణమునకు ఇజ్దుబారు పురాణమునందలి తొమ్మిదవ అధ్యాయమునకు 'మేఘావృతము' (Cloudy ) అని నామము. ఈ అధ్యాయమునందు ఇజ్దుబారువీరుడు మృత్యుసాగరముపై ప్రయాణము చేయును. ఆతనిభావి జీవితమెట్లు పరిణమించునో సంశయాస్పదముగ నుండెను. సంవత్సరమునందలి తొమ్మిదవ

నెలవైన నవంబరు – డిసెంబరు మాసముల యందు ప్రకృతియందు మాంద్యమేర్పడి సూర్యతేజము మేఘముల చాటునవలె మంచు తెరలలో అణగిపోవును. కావున ఇజ్డుబారు జీవితమునకును సూర్యగతికిని సామ్యము కలదనుటలో సంశయములేదు. కాని కొందరు చరిత్రకారు లీగాధను కేవల మాలంకారికమని తలంచుట పొరపాటనియు, ఇజ్డుబారు అనువీరుడు నిజముగ జీవించియుండవచ్చుననియు వాదించుచున్నారు.

మరికొన్ని గాథలు

సూర్యదేవునిగూర్చిన యనేక అలంకారిక గాథలు కాల్డియా దేశములో వ్యాప్తియుండెను. అట్టిగాథలలో నొకదానియందు సూర్యుడొక యద్భుతసౌందర్యముగల యువకుడుగ వర్ణింపబడి యున్నాడు. ఈతని నొకదేవతాస్త్రీ వివాహమాడెను. కాని యీ యువకు డకాల మరణమునకు లోనయ్యెను. ప్రియుని వియోగమును సహింపజాలక యీ దేవి ఎంతటి రాతిగుండెలనైన కరిగించునట్లు మిక్కిలి దీనముగ విలపించెను. ఆమె శోకమునుగుర్తించెనో యన్నట్లు, ఆమె ప్రియుడు మృత్యులోకమునుండి మరలి వచ్చి ఆమె కానందమును గూర్చెను. ఈ గాథయందు సూచింపబడిన దేవి ప్రకృతియనియు సూర్యుడామెకు ప్రియుడనియు, కర్కాటక సంక్రమణము తరువాత సూర్యుని తేజమునందు కానవచ్చు క్షీణత ఆతని మృత్యువనియు, ఆకారణముననే హేమంత ఋతువునందు ప్రకృతికాంత భర్తృవియోగము చెందిన స్త్రీవలె (సమశీతోష్ణ

మండలములందు చలికాలములో చెట్లయాకులన్నియు రాలి పోవును. ప్రకృతి శోభావిహీనముగా నుండును. నశ్చిపరగి యుండునవియు, వసంతకాలము ప్రకృతికాంత తన ప్రియుని మరల కలసి కొనుట వలననే ఆ సమయమందు ప్రపంచ మంతయు నవనవోన్మేషముతో కన్నుల పండువగ నుండునవియు మనము గ్రహింపవచ్చును. కాల్డియా దేశపు పురాణములలో సూర్యునికి దుమ్మూజీయను నామము కలదు. ఇష్టారు ఆతని భార్య. సూర్యుని కాల్డియా పౌరాణికులు గొల్లగ వర్ణించిరి. గొల్లలు తమ గొఱ్ఱెలతో నిరంతర ప్రయాణములు చేయునట్లు సూర్యుడు తెల్లని మేఘములను గొఱ్ఱెలను తోలుచు ఆకాశ మార్గమున నిరంతరమును ప్రయాణము చేయుచుండును. ప్రాచీన కాల్డియా నివాసు లీనాటి కిరకను శాశ్వత నివాసము లేర్పరచు కొనకుండ గుంపులు గుంపులుగా తమ పశువులతో సహా తిరుగుచుండి యుండవచ్చును. కావుననే వీరి కిట్టి యుప మానము స్ఫురించి యుండవచ్చును.

దుమ్మూజీ దేవుని మరణమునకు సంబంధించిన గాధను వర్ణించు పురాణములు మనకు సంపూర్ణముగ లభింప లేదు. పవిత్రమైన ఎరిధూ ప్రాంతమునందలి అరణ్యములో నీతడు మరణించినట్లు మాత్ర మొక యిటుకపై వ్రాయబడిన యంశ ముల వలన తెలియ వచ్చినది. కర్కాటక సంక్రమణ సందర్భ ములో నీ కాల్డియా దేశపు ప్రజలు వారము దినములవరకు నొక యుత్సవముచేసెడివారు. మొదటి రోజులలో నీ ఆరా

ధకు తెల్లనగు వస్త్రములు చింపుకొని, జుట్టు విరబోసికొని శోకదేవతలవలె విలపించుచుండెడివారు. మరణించిన తమూజ్ దేవుని కంత్యక్రియలు జరిపెడి పద్ధతి యీ విధముగ ప్రకటింపబడెను. కాని ఆరవనాడు మరణించిన సూర్యభగవానుడు పునర్జన్మమునుపొంది తన ప్రియురాలితో మరల కలిసికొనును. ఈ పునస్సమాగమమునకు చిహ్నముగ ప్రజలెల్లరును, ఎగురుచు, గంతులు వైచుచు, మిక్కిలి యానందముతో మరియొక యుత్సవమును కావింతురు. ఇట్టి యుత్సవములు బాబిలోనియా దేశమునందు చిరకాలము వరకును జరుపబడుచున్నట్లు నిదర్శనములు కలవు. క్రీ. పూ. 600 ప్రాంతమున కొందరు యూదులు ఖైదీలుగ బాబిలోను నగరమునకు కొంపోబడిరి. వారు తమూజ్ యుత్సవ సందర్భమున స్త్రీలు విలపించుచుండుట చూచిరని బైబిలు గ్రంథమునందు తెలుపబడినది.

జార్జి స్మిత్ అను చారిత్రక పరిశోధకుడు అనేక అపూర్వగ్రంథములను సేకరించెను. అట్టి వానిలో నొకదానిపై ఇష్టారు మృత్యులోకము లోనికి పోయిన వృత్తాంతమును తెలుపు గాథ వ్రాయబడినది. ఇదియొక చక్కని కావ్యము. ఇది స్వతంత్ర కావ్యమా లేక ఇజ్డుబారు పురాణమునందలి యొక ఘట్టము మాత్రమేనా యని పండితులు నేటికిని జిజ్ఞాస కావించుచున్నారు. ఈ కావ్యము ఇష్టారుదేవి మృత్యులోకమును ప్రవేశించుటతో ప్రారంభించుచున్నది. ఈ లోకమునందు

రక్షింపుమని మొరపెట్టుకొనిరి. అప్పుడత డొక సందేశహారుని అల్లాట్ వద్దకు పంపి ఇష్టారుదేవిని విడుదల చేయవలసినదని యాజ్ఞాపించెను. మృత్యులోకమునకు రాణియైన అల్లాట్ చేయునదిలేక ఇష్టారునకు మరల ఆరోగ్యమును ప్రసాదించి ఆమె కోరిన ప్రకారము ప్రాణజలముల నొసంగి ఆమెను భూలోకమునకు పంపివైచెను. ఇష్టారు దేవత ప్రాణజలములచే తన ప్రియుని పునర్జీవితుని గావించుకొనెను. చారిత్రిక పరిశోధన వలన నిట్టిప్రాచీన గ్రంథములు పెక్కులు వెలువడ వచ్చును. వానివలన నీ పురాతన జాతివారి మత విశ్వాసములును, వారి సంఘమునందు వ్యాప్తిలో నున్న గాథలును, వారి యందు గానవచ్చెడి కవితాశక్తియు వ్యక్తమగుచున్నవి.

## పరిసమాప్తి

ప్రాచీనకాల్డియా దేశపు చరిత్రను మనము సంగ్రహముగ తెలిసికొని యున్నాము. ఈ జాతివారు ప్రపంచమందలి అతి ప్రాచీన ప్రజ లని తెలుపుటలో సందేహాము లేదు. సర్వసాధారణముగ నీజిప్టు దేశీయులు మిక్కిలి ప్రాచీను లని యిటీవల వరకును లోకులు తలంచుచుండిరి. కాని వారి నాగరకత నాలుగు వేల సంవత్సరములనాటిది మాత్రమే. కాల్డియాప్రజలు 6000 సంవత్సరములకు పూర్వమే గొప్ప నాగరకతను పొందిరని పైయంశముల వలకు మనకు విస్పష్టమగుచున్నది. ఇరువదవ శతాబ్ద ప్రారంభమున పంజాబు రాష్ట్రమునందలి హారప్పాయను ప్రదేశమునను, సింధు రాష్ట్ర

ములోని మొహెంజోదారో యను ప్రదేశమునను భూమిత్రవ్వించుట వలన అతిప్రాచీనమగు నాగరకతా చిహ్నములు వెలువడిన విషయము చరిత్రకారులకందరకును సువిదితము. ఆ నాగరకతను హైందవ పూర్వపు నాగరకతయని కూడ కొందరు వర్ణించి యున్నారు. కాని యానాగరకతను సౌలభ్యమునకై సింధునదీప్రాంతము నందలి నాగరకతయని వ్యవహరించుచున్నారు. విద్వాంసులగు వారు కాల్డియా నాగరకతను సింధు మైదానములందు వెలసిన నాగరకతను పోల్చిచూచిన యెడల అనేక సామ్యములు కాన్పించి, చరిత్రయందలి నిగూఢ రహస్యము లనేకములు వెలువడుట కవకాశములు కలవు.



కాల్డియా దేశమునకు బాబిలోనియా యను నామాంతర మెప్పుడు సిద్ధించెనో నిశ్చయముగ చెప్పుట కష్టము. కాని జగత్ప్రసిద్ధి చెందిన బాబిలోను పట్టణము ప్రాముఖ్యత చెంది కాల్డియా రాష్ట్రమునకు రాజధాని యైన నాటినుండియు ఈ పేరు విశేష వ్యాప్తిలోనికి వచ్చియుండ వచ్చును. బాబిలోనియా చరిత్రయందు మిక్కిలి ప్రసిద్ధి చెందిన హమ్మురాబీ అను నాతడు బలవంతుడై గొప్ప ప్రతిష్ఠను సంపాదించెను. ఈతడు టింటిర్కి అను తన రాజధానికి దేశమందలి యితర పట్టణములకంటె ఆధిక్యత కల్పించెను. ఆ పట్టణము నీతడు కాడిమిర్రా అని పిలువజొచ్చెను. ఈ పదమునకు భగవంతుని ద్వారము అని యర్థము. ఈ పేరు సకే సెమిటిక్ భాషలో "బాబ్-ఇల్ బాబెల్" అను రూపాంతరము కల్గెను. బాబిల్ పట్టణమునే బాబిలోను పట్టణమని పాశ్చాత్యులు వ్యవహరించిరి.

## ప్రజలవృత్తి

బాబిలోనియా దేశములోనికి వివిధ కాలములలో విదేశీయులు పలువురు దండెత్తి వచ్చి అచ్చట స్థిరనివాసము లేర్పరచుకొనుచు వచ్చిరి. అయినను ఈ దేశములో ప్రవేశించిన పిమ్మట ఈ ప్రజలెల్లరును తొల్లింటి తమ తమ జీవిత పద్ధతులను మార్చుకొని స్థానిక ప్రజలలో కలసిపోయెడివారు. వీరందరునుకూడ టైగ్రిస్, యూఫ్రటీస్ నదులనే నమ్ముకొని

వాని జలములను కాలువలద్వారా దేశములోనికి రప్పించి తమ పొలములలో మంచి పంటలను పండించుకొనుచు కాలక్షేపము చేయుచుండిరి. వీరందరికిని వ్యవసాయమే ముఖ్య జీవనోపాయముగ నుండెడిది. కావున వివిధ కాలములలో నీ దేశములోనికి వేర్వేరు దేశపు ప్రజలు వలస వచ్చినను, బాబిలోనియా నాగరకత మాత్రము వ్యావసాయిక జీవితమును పునాదిపైననే నిలచి యుండెను. ఈ విషయములో మాత్ర మెట్టిమార్పును జరుగలేదు.

## వారి సంఘ వ్యవస్థ

అతి పురాతన యుగములో బాబిలోనియా రాజ్యము నందు రెండు తెగల ప్రజలు నివసించుచున్నట్లు చారిత్రికాధారములవలన తెలియుచున్నది. ఆ కాలమునందు బాబిలోనియా రాష్ట్రముయొక్క దక్షిణ భాగమున "సుమేరు" జాతివారును, ఉత్తర భాగమున "అక్కాడు" జాతివారును నివసించుచుండిరి. ఈ సుమేరు జాతియే బాబిలోనియా ప్రజలకును, నాగరకతకును పునాదిగా నున్నది. బాబిలోనియా రాష్ట్రములోనికి వలసవచ్చిన యితర ప్రజలవలెనే సుమేరు ప్రజలుకూడ వ్యవసాయజీవితమునే అవలంబించిరి.

వీరు యూఫ్రటీసు నదీప్రాంతమున చిన్న చిన్న గ్రామములను నిర్మించుకొని అందు జీవించెడివారు. ఈ గ్రామములలో సామాన్యపుటిండ్లు తప్ప మరేమియును లేకుండెను. ఈ ఇండ్లు పచ్చి ఇటుకలతో నిర్మింపబడు చుండెను. గ్రామ

మధ్యమున గ్రామ దేవతయొక్క ఆలయము నిర్మింపబడుచుండె డిది. ఈ గ్రామ దేవతయొక్క సంరక్షణలో నివసించుచు ప్రజలు తమ నిత్య జీవితమును గడుపుకొను చుండిరి. ఈగ్రామ దేవతయే గ్రామ ప్రజలకు నిజమైన పరిపాలకుడని జనులు తలం చెడివారు. కాని మానవ సహాయము లేనిది దైవమే కార్య మును చేయదు. కావున దైవప్రతినిధిగ నొక మానవుడు పేర్పాటై, ప్రజల సంరక్షణ భారమును పూనవలసిన యావ శ్యకత నేడును, ఆనాడునుకూడ కాన్పించెను. కావున దైవ ప్రతినిధులుగ నీ సుమేరు ప్రజలలో రాజు లేర్పడిరి. వీరు గ్రామ దేవతయొక్క అధికారములను స్వాయముగ పూని ప్రజలను కాపాడుచుండిరి. ప్రతి గ్రామమునకు వేర్వేరుగ్రామ దేవత లుండెడివారు. గ్రామమును, దాని చుట్టు ప్రక్కల నుండెడి కొంత భూభాగమును గ్రామ దేవతయొక్కయు, రాజుయొక్కయు పరిపాలనలో నుండెడివి. ఈభూములలో గ్రామప్రజలే సేద్యము చేసికొని దానివలన ఫలమును అనుభవిం చెడివారు. వ్యవసాయమును సాగించుటకావశ్యకములైన కాలు వలు చెరువులు మున్నగువాని నాయా గ్రామములవారు మిక్కిలి పట్టుదలతో సంరక్షించుకొను చుండిరి. ఈ కాలు వలు మున్నగునవి గ్రామ దేవతయొక్క ఆధీనములో నున్నట్లే ప్రజలు తలంచెడివారు. కావున పొలిమేరలలో నున్న యితర గ్రామములవారు తమ భూములను కాని, కాలువలను కాని

స్వాధీన పరచుకొనిన యెడల గ్రామస్థులు, తమ రాజు నాయకత్వమున నితర గ్రామస్థులపై దండెత్తెడివారు.

వివిధ గ్రామములకును, జనపదములకును నడుమ వివాదములును, యుద్ధములును, జరుగుచుండుట బాబిలోనియా రాష్ట్రముయొక్క ఆనాటి చరిత్రలో సర్వసామాన్య విషయముగ నుండెడిది. అందుల కుదాహరణముగా నొక ఘట్టము మాత్రము మనము స్మరించెదము గాక. లాగాష్, ఉమ్మా అను రెండు పట్టణములు బాబిలోనియా యందు పూర్వకాలమునందు ప్రసిద్ధి చెంది యుండెను. ఈ రెండు పట్టణములకును నడుమ చిరకాలము నుండి తమతమ పట్టణపు సరిహద్దులనుగూర్చి మనస్పర్థలును వివాదములును సాగుచుండెను. కాని యీ రెండు పట్టణములవారును "నిప్పూరు" పట్టణమందు నెలకొనియున్న "ఎన్లిలు" దైవమునకు పురోహితుడుగానున్న ఒక పెద్దమనుష్యుని తమకు మధ్యవర్తిగా నేర్పరచుకొని ఈ వివాదములను అంతమొందించుకొనిరి. మధ్యవర్తిగనున్న పెద్దమనుష్యుడు, ఈ రెండు పట్టణములయొక్క సరిహద్దులను నిర్ణయించి, పొలిమేరయందొక రాతిస్తంభము పాతించి వివాదము పరిష్కారము చేసెను. కొంత కాలము వరకును మరల యెట్టి పోరువులును పొడసూపలేదు. కాని లాగాష్ పట్టణములో "ఇన్నాటమ్" అను రాజు, రాజ్యము చేయుచుండిన కాలములో ఉమ్మా పట్టణపు ప్రజలు తాము ఇంతకు పూర్వము కావించుకొనిన యేర్పాటులను నిర్లక్ష్యము

చేసి లాగాష్ ప్రజలహక్కు భుక్తములలో నున్న కొంత భూమి నాక్రమించు కొనెను. "ఇన్నాటమ్" రాజు మిక్కిలి పరాక్రమవంతుడు. ఇతర పట్టణముల వారు తమ భూముల నాక్రమించుట సహింపజాలక యితడు యుద్ధమును ప్రకటించెను. యుద్ధరంగమునకు పోవుటకు పూర్వమీ రాజు తమ కులదైవమైన "నింగిర్సూ" దేవాలయమునకు పోయి దేవునికి సాష్టాంగ ప్రణామము కావింపగా దేవుడు సంతోషించి అతనికి విజయలాభము కలుగునట్లు దీవించెను. ఆ ధైర్యముతో "ఇన్నాటమ్" తన సైన్యములను శత్రువులపై నడిపి వారిని సంపూర్ణముగ పరాభవించెను. రణరంగమున మూడు వేలకు పైబడి శత్రువులు మరణించినట్లు "ఇన్నాటమ్" పక్షమువారు సగర్వముగా ప్రకటించుకొనిరి. రాజైన ఇన్నాటమ్ ఈ యుద్ధములో స్వయముగా పాల్గొనెను.

## ప్రాచీన కాలపు యుద్ధములు

ఈ యుద్ధము పూర్వకాలమునందు బాబిలోనియా రాష్ట్రములో సంభవించిన ఇతర యుద్ధములలోకెల్ల చాల ప్రాముఖ్యత వహించినట్లు కానవచ్చును. ఏలయన లాగాష్ పట్టణము వారికి లభించిన విజయమునకు చిహ్నముగా నొక జయ స్తంభము నాటించబడెను. జయస్తంభమునకు రెండు ప్రక్కలయందును అనేక చిత్రములు చెక్కబడి యున్నవి. ఒక వైపు రణరంగము నందలి భయానక దృశ్యమొకటి చిత్రింపబడినది. గ్రద్దలును, రామబంధువులును యుద్ధభూమిపై వ్రాలి

మరణించిన సైనికుల కళేబరములను చీల్చి వానిని తినుచున్నవి. మరియొకవైపు జయస్తంభంపై "లాగాష్" ప్రజలు యుద్ధము చేయుచున్న దృశ్యము చూపబడినది. సైనికులెల్లరును కుడి చేతియందు శూలములను, ఎడమ చేతియందు పెద్దడాలును ధరించి శత్రువులతో తలపడుచున్నారు. ఈ డాలు చాలపెద్ద పరిమాణముఃగలది. పాదములనుండి కంఠము వరకునుకూడ ఒక్కడాలే వ్యాపించి, సైనికులను శత్రు ఖడ్గములనుండి రక్షించుటకు వీలుగ నుండును. శత్రువులు తమ ధాటి కాగజాలక వెన్నిచ్చి పరుగెత్తుట ప్రారంభించిన యెడల, సైనికులు తమ డాలులను క్రిందపడవైచి చిన్న చేతి గొడ్డళ్ళను ధరించి పలాయితులగుచుండిన శత్రువులను వెంటాడి సంహరింతురు.

యుద్ధమునందు మరణించిన సైనికులకు అతిశ్రద్ధతో ఈ సుమేరు ప్రజలు పారలౌకిక క్రియలు నిర్వర్తించెడివారు. పైన వర్ణింపబడిన యుద్ధమునకు సంబంధించిన మరియొకచిత్రము మనకు నేడు లభ్యమగు చున్నది. చిత్రమునందు "ఇనాన్నటమ్" రాజు స్వయముగ యుద్ధభూమిలో నిలువబడి వీరస్వర్గము నలంకరించిన తన సైనికుల కళేబరములను ఒక గోతియందు పూడ్పించుచుండుట కానవచ్చును. కళేబరములను పాతి వేయుటకు పూర్వము మరణించిన వారికొరకై తర్పణములను విడుచుటకూడ వీరిలో ఒక ముఖ్యమైన ఆచారముగ నుండెడిది. ఈ క్రియా కలాపములు సక్రమముగ జరుగనియెడల మర

ణించినవారికి ఊర్ధ్వలోక ప్రాప్తి కలుగదని సుమేరు ప్రజల విశ్వాసము.

### దా ని మ తే ము

ఈ సుమేరు ప్రజలకు నిజమైన రాజు గ్రామదైవము. రాజు గ్రామదైవమును పూజించు పూజారి. ఎల్లప్పుడును దైవమును సేకరించుచుండుటవలన నీతనిని ప్రజలు దైవ ప్రతినిధిగ మన్నించి ఆతని యధికారమునంగీకరించెడివారు. గ్రామములందును పట్టణములందునుకూడ గ్రామదైవముయొక్క ఆలయమే ముఖ్యమగు భవనము. ఇతర ప్రజల నివాసములు వీని నాశ్రయించుకొని యుండును. దేవాలయములందు రాజ భవనమున రాజునకు జరుపబడు నిత్యసేవ ననుసరించి స్నాన భోజనాది సౌకర్యములు సమకూర్పబడుచుండెడివి. సామాన్య మనుష్యులకువలెనే దైవమునకుకూడ దారాపుత్రాదులుండునట్లును, ఆతడుకూడ మనుష్యులవలెనే విందులారగించునట్లును, తనపోషణలోనున్న ప్రజలను రక్షించుట కొరకు నితరులతో యుద్ధము చేయునట్లును, యుద్ధము లేని కాలములో నీ దైవము తన భవనమునందు విశ్రమించుచు సంగీత సాహిత్యాదులతో కాలము పుచ్చునట్లును సుమేరు ప్రజలు విశ్వసించుచుండిరి. దేవాలయమునకై ప్రత్యేకముగ నొక కోశాగారము, ధాన్యపుకొట్లు, దేవప్రీతికై బలియొసంగుట కేర్పడిన మేకలు మొదలైనవానికి శాలలు, పూజారులు ఇతర దేవస్థానపు సేవకులు నివసించుట కిండ్లును దేవస్థానపు

అధికారుల యాధిపత్యమున నిర్మింపబడుచుండెను. ఈ చిన్న చిన్న యిండ్లనన్నిటిని మించి దేవాలయపు గోపురము విరాజిల్లు చుండెడిది. బాబిలోనియా రాష్ట్రము నందన్ని యుగములయందునుకూడ పట్టణములందును, పల్లెలందును, ఈ దేవాలయ గోపురములే ప్రాముఖ్యముగ కానవచ్చెడివి.

సుమేరుల క్షీణదశ

సుమేరు రాష్ట్రమందలి వివిధ పట్టణములకు తరచు వివాదములును, యుద్ధములును సంభవించుచుండెడివని మన మిదివరకే తెలిసికొనియున్నాము. వీనివలన నీ పట్టణముల యొక్క బలము క్షీణింప సాగెను. ఇది యిట్లుండగా తూర్పు నుండియు పశ్చిమమునుండియుకూడ ఇతర జాతుల వారీ సుమేరురాష్ట్రముపై దాడి సల్ప జొచ్చిరి. సుమేరు రాజ్యము నకు తూర్పున "ఎలామ్" అనబడు మరియొక రాజ్యము నెల కొని యుండెను. ఈ "ఎలామ్" రాజ్యము మున్ముందు చాల ప్రసిద్ధిని చెందుట మనము చూడ గలుగుదుము. ఈ ప్రాంతమునకు "సూసా" అనునది ముఖ్యపట్టణము. ఎలామ్ రాజ్యము వారు సుమేరు రాష్ట్రముపై తరుచు దండెత్తి వచ్చుచున్నట్లును, సుమేరులకును, వీరికిని యుద్ధములు సంభవించినట్లును తెల్పుటకు మనకు నిదర్శనములు కానవచ్చుచున్నవి. లాగాష్ పట్టణమునకు పురదైవమైన "నింగిర్సూ" యొక్క పురోహితునకు మరియొక పట్టణమునందలి పురోహితుడు వ్రాసినయొక్క లేఖ లభించినది. ఆ యుత్తరమునందు రెండవ పురోహితుడు

లాగాష్ పురోహితునకు తాను "ఏలామ్" ప్రజలనెట్లు పరాభవించి తరిమివైచినదియు తెలుపబడినది. "ఏలామ్" రాష్ట్రము వారు కొందరు సుమేరు రాజ్యముపై దాడి సల్పినట్లును, కొంత సైన్యముతో నీ పురోహితుడు వారిపై బడి వారిని పూర్తిగ ఓడించి తరిమివైచినట్లును, యుద్ధభూమియందు ఆరువందలకు సుమారు సైనికులు మరణించినట్లును, విజయమునకు ఫలితముగ సుమేరుసైన్యములకు ధనము, వస్త్రములు, విలువగల యితర వస్తువులును లభించినట్లును, ఈ లేఖయందు వర్ణింపబడియున్నది.

దీపము ఆరిపోవుటకు పూర్వ మొకమారు పెద్దవెలుగు వెలిగి మాయమగునట్లు సుమేరు ప్రజలు తమ స్వాతంత్ర్యమును పోగొట్టుకొనుటకు పూర్వమొక పరాక్రమము విజృంభించిరి. సుమేరు రాష్ట్రమందలి లాగాష్ పట్టణము చాల ప్రాముఖ్యత వహించి యుండినట్లు మన మీవరకే తెలిసికొని యున్నాము. కాని "ఇనాన్నటమ్" రాజు మరణించిన వెనుక ఈ ప్రభుత్వము క్షీణించెను. ఆదికాలమున పాలకులయందు కానవగుచున్న సరళత, యోగ్యత, ఆడంబరరాహిత్యము మున్నగునవి మాయమై, క్షీణత ప్రారంభించెను. ప్రభువులు తమ బాహ్యాడంబరములకే యెక్కువ ప్రాముఖ్యత యొసంగ జొచ్చిరి. దేశమందెల్లెడలను అరాజకత్వము, ప్రజాపీడనము మున్నగునవి ప్రబలెను. ఈ పరిస్థితులలో లాగాష్ పట్టణమున "ఉరుకాగినా" అను రాజు సింహాసన మధిష్ఠించెను. ఈతడు న్యాయబుద్ధితో ప్రజలను పాలించుటకై యత్నించి, అనాదు

తన రాజ్యమునందు ప్రబలియున్న లంచగొండితనము, మున్నగు వానిని తొలగించుటకై పాటుబడెను. ప్రజలను కష్టముల పాలుచేయు అధికారులనుకఠినముగ శిక్షించెను. ఈ పద్ధతుల వలన రాజ్యమునందలి దుష్టత్వమును, ప్రజాపీడనమును నశించెనుకాని దానితోపాటు ప్రభుత్వము బలహీన మయ్యెను. రాజ్యములో ప్రభుత్వాధికారులు రాజునకు తగిన సహాయము యొసంగరైరి, ఈ యదను కనిపెట్టి లాగాష్ పట్టణముతో చిరకాలమునుండి వైరము నాటించుచున్న "ఉమ్మా" రాజ్యము వారు వీరిపై దండెత్తి వచ్చిరి. ఈ కాలమున "లూగాల్ జగ్గిసీ" అను రాజు ఉమ్మా పట్టణమునకు ప్రభువుగ నుండెను ఈతడు లాగాష్ పట్టణము జయించి, తమ పూర్వపు పగను తీర్చుకొనుటకై కాబోలు పట్టణమును పరశురామ ప్రీతి చేసెను. ఈ రాజు సుమేరు రాష్ట్రమునంతను తన యధీనములోనికి తెచ్చుకొని దేశమునకంతకును పాలకుడయ్యెను, ఇంతటితో సంతుష్టి పడక యీ రాజు సుమేరు రాష్ట్రమునకుత్తరమునన్న రాజ్యములపై దండెత్తి మధ్యధరా సముద్రమువరకును తన సైన్యములను గొనిపోయెను. ఈదండయాత్రవలన సుమేరు రాజ్యమునకు తాత్కాలికమగు ఖ్యాతి లభించినమాట వాస్తవమే కాని ముమ్ముందు దీనివలన చాల నష్టము సంభవించెను. తమ రాజ్యముపై అకారణముగ సుమేరులు దండెత్తి వచ్చుటవలన కోపగించి "అక్కాడు" ప్రజలు పగదీర్చుకొనుటకై నిశ్చయించిరి. ఈ కాలమున సిచ్చ

టిరాజు "మొదటి సారగాన్" అనువానితడు ఈ రాజుతన సైన్యములతో సుమేరు రాజ్యముపై దండెత్తివచ్చి సుమేరుల నవలీలగ నోడించి, ఇచట రాజ్యస్థాపనముచేసెను. సుమేరులు యుద్ధమునందు సులభముగా నోడిపోవుటకాక ముఖ్యకారణము వారి ఆయుధములయందలి లోపము, సుమేరులు కత్తి, గొడ్డల, బల్లెము, డాలు మున్నగువానితో మాత్రముపోరాడిరి. "అక్కాడులు" ధనుర్బాణములతో యుద్ధముజేసిరి. ఈ నూతనా యుద్ధమును సరిగానెదుర్కొను శక్తిలేక సుమేరు లోపము నంగీకరింపక తప్పినదికాదు. సుమేరు జాతియాధిక్యత ఇంతటితో మాయమై బాబిలోనియా రాజ్యమంతయునుకూడ "సెమిటిక్" జాతులవారి యధీనములోనికి పోయెను.

సుమేరురాజ్యమువారి భాగ్యభోగ్యములు వ్యవసాయముపై ఆధారపడియుండెను. ఆకాలములో సుమేరురాష్ట్రమునందు వివిధములగు పంటలు పండుచుండెడివి. చిరకాలమునుండియు ప్రజలు ఖర్జూరపుచెట్లను చక్కగా పెంచుట యెరింగియుండిరి. వీరితరరాష్ట్రములతో వర్తకమునుకూడ సాగించుచుండినట్లు మనకు తెలియవచ్చుచున్నది. సుమేరురాజ్యమునందలి నేల వ్యవసాయయోగ్యమగు మెత్తనిభూమి, ఇచ్చట రాళ్లు దొరుకవు. దేవాలయములు గృహములు, నిర్మించుటకై రాళ్ళు కట్టె మున్నగువానిని సుమేరులు తమదేశమునకు ప్రక్కనున్న "ఎలామ్" ప్రజలనుండి గ్రహించుచుండిరి. అరేబియా దేశమునుండి వీరికి రాగి మున్నగు లోహములు

దిగుమతియగుచుండెను. వ్యాపారాభివృద్ధికై సుమేరుప్రభువులు "ఒంటెలగుంపు"ల నేర్పాటు చేయుచుండెడివారు. ఈ విధముగా సిరియామున్నగు పశ్చిమదేశములతోకూడ సుమేరు ప్రజలు వర్తకవ్యాపారములు సాగించుచుండెడివారు.

## అక్కాడు ప్రజలు

సుమేరురాష్ట్రమును జయించి దానిపై తమ యాధిపత్యమును నెలకొల్పుకొనిన అక్కాడు ప్రజలు సెమిటిక్ జాతులలో నొక్కరు. సెమిటిక్ జాతులకు అరేబియా దేశమే జన్మస్థానమని నేడుచరిత్రకారులు సిద్ధాంతీకరించి యున్నారు. అరేబియాదేశము నేటికాలమున సారహీనమైన యెడారిగా కానవచ్చుచున్నది. పూర్వకాలమున నియ్యది ఇంతచేటు హీనస్థితియందు లేకుండియుండవచ్చునని శాస్త్రజ్ఞులు తలంచుచున్నారు. ఇచ్చటనుండి వివిధయుగములలో జనసమూహములితర దేశములలోనికి వలసపోవుట మనము గమనింపవచ్చును. అరేబియాదేశపుప్రజలు ఇతరప్రాంతములలో వలె నిలకడగా నొకచోట నివసింపక తమసంసారములతోడను పశువులతోడను తిరుగుచుండెడివారు. వీరి జీవితము మిక్కిలి నిరాడంబరముగా నుండెడిది. వీరు సర్వసాధారణముగా తమకిరుప్రక్కల నుండెడి దేశములజనులతో స్నేహమును పాటించుచు వ్యాపారము సాగించుచుండెడివారు. కొన్నిసందర్భములలో నితరులను బెదరించి వారికడనుండి వస్తుసామగ్రులను గైకొనుచుండుటకూడ వీరికి సామాన్యముగానుండెను. కొన్ని సంవత్సరములవరకు నీ జే

శములలో వర్షములు చక్కగా కురియుచుండెడివి. కాని మరి కొన్ని సమయములలో ప్రకృతి విపరీతమైన కాఠిన్యత వహించు చుండెడిది. నీటికొరతవలన ఆ దేశములో నెట్టిపంటలును పండ కుండెడివి అట్టికాలములో నీ అరేబియా దేశస్థులకు మిక్కిలికష్ట ములు సంప్రాప్తమయ్యెడివి. వారికి తినుటకాహారము సైతము లభించెడిదికాదు. అట్టితరుణములలో నీ ప్రజలు స్వదేశమునువిడి పరదేశములకు వలసపోవుటయో, లేకపరదేశములపై దండెత్తి యచ్చటి ప్రజలను దోచుకొనుటయో సాగించుచుండిరి. పైవిధ ముగా అరేబియా దేశపు ప్రజలు పలుమారు యితర దేశములపై దండెత్తిపోవుట చరిత్రలవలన మనకు దెలియవచ్చుచున్నది. అట్టి దాడులలో వీరు తమ దేశమునకు తూర్పుననున్న బాబి లోనియా రాష్ట్రముపై సల్పిన దాడియొకటి. చారిత్రికయుగ మందు అరేబియాప్రజలితర దేశములపై సల్పినదాడులలో నిదియే మొదటిది. వీరుబాబిలోనియా రాష్ట్రమందలి ఉత్తర ప్రాంతమునుమాత్ర మాక్రమించుకొని అచ్చట స్థిరనివాస మేర్పరచుకొనిరి. ఆప్రాంతమునకు "అక్కాడు" అనునామ ముండుటవలన వీరికి "అక్కాడులు" అనుపేరు సిద్ధించెను. అరే బియా దేశస్థులీ అక్కాడుప్రాంతమును క్రమక్రమముగా నాక్ర మించుకొనిరి. ఈ యాక్రమణ క్రీ. పూ 3000-2050 నడుమ జరిగియుండవచ్చును. వీరికడ నాకాలములో శీఘ్రముగా రాక పోకలు జరుపుటకు సాధనములులేకుండెను. నేటికాలమున నరేబియాదేశము గుఱ్ఱములకు మిక్కిలి ప్రసిద్ధిగాంచియున్నది.

కాని బాబిలోనియా దేశము నాక్రమించు కాలమున అరబ్బు లకు గుర్రములు లేకుండెను. పెద్దబరువులను మోయుట కానాడు గాడిదల నుపయోగించుట పరిపాటుగనుండెను. పైన సూచించిన కారణమువలన అక్కాడురాష్ట్రము అరబ్బుప్రజల యధీనములోనికి సంపూర్ణముగా వచ్చుసరికి చాల కాలము గడచెను. సుమేరు రాష్ట్రమును జయించి దానిని తనయధీనము లోనికి గొనిన "మొదటిసారగాన్" రాజే అక్కాడురాష్ట్రము నందు సెమిటిక్ జాతికి చెందిన మొదటిరాజు.

సుమేరుల పునర్విజృంభణము

సారగాన్ రాజు సుమేరు రాష్ట్రమును జయించి అచ్చట సెమిటికు ప్రజల యాధిక్యతను స్థాపించిన మాట వాస్తవమే. కాని ఆ యాధిక్యత చిరకాలము నిలువదయ్యెను. ఈ రాజు వంశ మంతమొందిన వెంటనే సుమేరు రాష్ట్రమునందు రాజ్యాధికారమునకై మరల కలహములును యుద్ధములును ప్రారంభమయ్యెను. కొలది కాలము వరకును మరల సుమేరు ప్రజలే తమ రాష్ట్రమును పాలించిరి. ఆపైన సుమేరు రాజ్యపు సరిహద్దులందు నెలకొనియున్న " గూషియా " రాజ్యపు ప్రజలు సుమేరు దేశము నాక్రమించుకొని రాజ్యపాల నము చేసినట్లు నిదర్శనములు కలవు. మరి కొంత కాలము సాగిన తరువాత " ఎరికు " పట్టణపు రాజైన "ఉరూఖిగల్" అను నాతడు విదేశీయులగు గూషియావారిని తరిమివైచి సుమేరు రాజ్యమును మరల స్థాపించెను. ఈ రాజు స్వయ

ముగా సుమేరు జాతివాడు. ఈతని యనంతరము మరికొంత కాలము వరకును సుమేరు రాజ్యమునందలి మరియొక రాజ వంశమువారి రాష్ట్రమున కాధిపత్యము వహించిరి. వీరు "ఉర్" అను పట్టణమునందలి ప్రభువులు. ఈ ఉర్ పట్టణపు పాలకులలో "ఉర్ ఇంగూరు" అను వాతడును, అతని కుమారుడు "దుంగి" అను వాతడును మిక్కిలి ప్రఖ్యాతి వహించినట్లు తెలుపవచ్చును. "దుంగి" మిక్కిలి పరాక్రమ వంతుడు. రాజ్యపాలనమున మిక్కిలి దక్షుడు. ఈతడనేక యుద్ధములలో సుమేరురాష్ట్రముపై దాడి వెడలుచుండెడి సెమిటికు జాతులవారి నోడించెను. రణస్థితికోవిదుడైన ఈతడు తన శత్రువులకడ నుండి వారి నూతనాయుధములగు ధనుర్బాణములను సంగ్రహించి వానితోడనే వారి నోడించెను. సెమిటికుజాతులకును సుమేరు ప్రజలకును సంభవించిన మొదటి యుద్ధములలో సుమేరు ప్రజలు మిక్కిలి బరువైన డాలు కత్తి, బల్లెము మున్నగువానితో పోరాడుటవలన వారుశీఘ్రముగా ముందునకు సాగిపోవుట కవకాశముండెడిది కాదు. వారి శత్రువులు తేలికయైన ధనుర్బాణములతో శీఘ్రముగ ప్రయాణము చేయుచు సుమేరు సైన్యములకు నష్టము కలిగించుచుండెడివారు. ఈ రహస్యమును గ్రహించిన "దుంగి" రాజు తన సైనికులకు కూడ నూతనమగు ధనుర్బాణాదుల నొసంగి శత్రు సంహారము చేసెను. ఈతనికాలములో ఎలామ్ రాష్ట్రముకూడ సుమేరు ప్రభువుల యధీనములోనికి వచ్చెను

ఈ కాలమునందే సిరియా, కానాన్ రాజ్యములనుండి మరి కొందరు సెమిటికు జాతులవారు బాబిలోనియా రాజ్యముపై దండెత్తసాగిరి. ఈశత్రువులను నిలువరించుటకొరకై 'దుంగి' రాజు మనుమడు తనదేశమునకు పశ్చిమమున నొక పెద్ద ప్రాకారమును నిర్మించెను. దీనికి పశ్చిమ ప్రాకారమని పేరు వచ్చెను. చీనాదేశపు ప్రభువులు తమ దేశమును విదేశీయుల దండయాత్రలనుండి సంరక్షించుకొనుటకై యిట్టి ప్రాకారమును నిర్మించుకొనుట యెల్లరకును తెలిసిన యంశము. బాబిలోనియా ప్రజలుకూడ యిట్టి పద్ధతినే ఆవలంబించిరి. ఈ ప్రాకారము బాబిలోనియా రాష్ట్రమునం దుత్తర భాగమున నిర్మింప బడెను. టైగ్రిస్ యూఫ్రటీస్ నదులీ ప్రదేశమునందు ముప్పదియైదు మైళ్ళ దూరములో ప్రవహించుచున్నవి. ఈ రెండు నదుల నడుమ పైన తెలుపబడిన ప్రాకారము నిర్మింప బడెను. కాని దీనివలనకూడ శత్రువుల పురోగమనమున కెట్టి యభ్యంతరమును కలుగలేదు. వారు క్రమక్రమముగ ముందునకు సాగివచ్చి బాబిలోనియా రాష్ట్రము నంతను స్వాధీనము కావించుకొనిరి. సుమేరు అక్కాడు రాష్ట్రములు రెండును కలిసిపోయి, ఈ రెంటికిని బాబిలోనియా పట్టణము రాజధానిగా నేర్పడెను.

బాబిలోనియా రాజ్యపు చరిత్రయందు సుమేరుప్రజల పేరు ముందు మనకెచ్చటను కావరాదు. ఇంతటితో వీరి ఆధిపత్యము పూర్తిగ నశించుచున్నది. కావున బాబిలో

నియా నాగరకతకు వీరుచేసిన సేవ యెట్టిదను సంశయమును గూర్చి కొన్ని విషయములిచ్చట స్మరించుట యనావశ్యకము కానేరదు. సుమేరు జాతివారు, అతి ప్రాచీనకాలమున విలసిల్లినవారైనను వారనేక విషయములలో సామర్థ్యమును, నేర్పును సంపాదించి యుండిరి. వ్యవసాయము నందు వారు మిక్కిలి సమర్థతను చూపి దేశమును సస్యశ్యామలముగను, భాగ్యవంతముగను కావించిరి. ఇదిగాక వీరొక ప్రత్యేక లిపిని నిర్మించుకొని తమకు కావలసిన యంశములను మట్టి ఇటుకలు, లేక రాళ్ళపై వ్రాయుచుండిరి. శిల్పము, గృహనిర్మాణము మున్నగు వానిలోకూడ సుమేరు ప్రజలు చాల అభివృద్ధి చెందిరి. వివిధలోహములపై చెక్కడపు పనులు వీరికాలమున పేరు వహించెను. రాజ్యపాలనము నందును, శాసన నిర్మాణమునందును కూడ సుమేరు ప్రజలితరులకు మార్గదర్శకులైరని తెలుప వచ్చును. సుమేరు ప్రభువైన "ఉరికాగినా" అను నాతడు మిక్కిలి సమర్థుడగు రాజనియు, ఆతడు తన రాజ్యమునందలి లోపములను సవరించి, ప్రజలను బాధించుచుండెడి దుష్టులగు ప్రభుత్వోద్యోగులను కఠినముగ శిక్షించెడివాడనియు ఈవరకే తెలుపబడినది. ఈ రాజుచే కావింపబడిన అనేక శాసనములు చిరకాలము వరకును బాబిలోనియా రాజ్యములో వాడుక యుండుటయే కాక, బాబిలోనియా చరిత్ర యందు ప్రఖ్యాతిగాంచిన "హామ్మూరబీ" అను సెమిటిక్ రాజుయొక్క శాసనములకు పునాది యయ్యెను.

### అక్కాడుల యుగము

అక్కాడులు బాబిలోనియా రాష్ట్రమునంతను స్వాధీనము చేసికొనిన తరువాతకూడ నీదేశములో శాంతిభద్రతలు సంపూర్ణముగ స్థాపింప బడలేదు. బాబిలోనియాకు తూర్పు భాగమునందు నివసించుచున్న ఎలామ్ జాతివారు, వీరిపై తరచు దండయాత్రలు సాగించుచుండెడి వారు. ఆ సందర్భములో బాబిలోనియా రాజులకును, ఎలామ్ ప్రభువులకును తరచు యుద్ధములు జరుగుచుండెడివి. ఈ యుద్ధములలో సైన్యము లొండొంటిలో పోరాడుకొనుటయేగాక, సామాన్య ప్రజలకు సైతము నష్టము కల్గించెడి వారు. అందు ముఖ్యముగ ఎలామ్ సైనికులు బాబిలోనియా యందలి గ్రామములలో చొరబడి అచ్చటి జనులను చంపి, గ్రామముసగ్ని ప్రీతి చేయుచుండెడివారు. బాబిలోనియాలో ఈ కాలమున "సుమూ, అబూ" వంశము' వారు బాబిలోనియా నగరమును రాజధానిగా చేసికొని పరిపాలించు చుండెడివారు. వీరిలో "హామ్మురాబీ" అను రాజు మిక్కిలి ప్రసిద్ధిగాంచెను. ఈతడు బాబిలోనియాపై తరచు దాడివెడలుచు నష్టము కలిగించుచుండిన 'ఎలామ్' జాతివారిని సంపూర్ణముగ నోడించి వెనుకకు తరిమివైచెను. హామ్మురాబీతో పోరాడిన ఎలామ్ రాజు "రిమ్‌సిన్" అను నాతడు. ఈ 'రిమ్‌సిన్' రాజు హామ్మురాబీ మరణానంతరము సైతము బాబిలోనియారాజ్యముపై తరచు దండయాత్రలు సాగించుచుండినందున, హామ్మ

రాబీ కుమారుడగు "సమ్సూఇలూనా" అనునాతడు ఈరిమ్ సిన్‌తో యుద్ధముచేసి తుదకాతని సంహరించెను. ఇంతటితో బాబిలోనియా రాజ్యమున కితరదేశీయులవలన బాధలు కలుగుట మానెను.

### హమ్మురాబీ రాజు

బాబిలోనియా చరిత్రయందు హమ్మురాబీ రాజు మిక్కిలి కీర్తిప్రఖ్యాతులు సంపాదించెను. ఈతని కాలమునందే సుమేరు అక్కాడు రాష్ట్రములు రెండును ఏకమై బాబిలోనియారాజ్య మేర్పడుచున్నది. ఈ రాజు కాలమునందే బాబిలోనియా నగరముయొక్క ఖ్యాతి క్రమక్రమముగ విస్తరింపనారంభించెను. హమ్మురాబీ రాజు ఎలామ్ ప్రజలతో పోరాడి దేశమునకు శాంతినొసంగెనని యీవరకే తెలిపియున్నాము. ఈరాజు గొప్ప యుద్ధవీరుడు మాత్రమే కాడు. రాజ్యకార్యములయందీతడెల్లప్పుడు నప్రమత్తుడై మెలగుచు ప్రజాక్షేమమునకై చాల పాటుపడు చుండెడివాడు. ఈ రాజుచే వ్రాయింపబడిన రాజ్యాంగలేఖలును, ఉద్యోగీయులకొరకై పంపబడిన ఆజ్ఞలును మనకు లభించినవి. వీనివలన హమ్మురాబీ రాజ్యమునందలి ముఖ్య విషయములతోపాటు న్యాయాంశములను కూడ శ్రద్ధగా కనుగొనుచుండినట్లు తెలియుచున్నది. ఈతడు సైన్యముల రాకపోకలు, సంవత్సర నిర్ణయము, నీటిపారుదల సౌకర్యములు, నీటిపైనను, భూమిపైనను రాకపోకలకై అనుకూలములు మున్నగు ముఖ్యవిషయములలో శ్రద్ధ

వహించుట సమంజసమే. అంతేకాక ఈరాజు తన రాజ్యము నందు దూరప్రదేశములలోనున్న అధికారుల నడవడిని గూర్చి ఎల్లప్పుడును తెలిసికొను చుండెడివాడు; సామాన్యజనుల వివాదములనుకూడ నీతడు న్యాయముగవిని, శ్రద్ధగా వానిని పరిశీలించి, క్రింద న్యాయస్థానములలో లోపము సంభవించినట్లు తోచినపక్షమునగాని, క్రింది యధికారులు లంచములతీసికొని నట్లు అనుమానము కలిగినయెడలకాని, అభియోగములను పున రాలోచించుటకై పంపెడివాడు. హామ్మురాబీ రాజునకు కలిగిన కీర్తి ముఖ్యముగా నాతనిచేకావింపబడిన న్యాయశాసనములపై ఆధారపడి యున్నది. ఈ శాసనములు హామ్మురాబి ప్రభువు రొక్క రాజ్యము నందంతటకు అంగీకరింపబడి అమలు జరుగు చుండెను. ఈ శాసనములు హామ్మురాబీ రాజు తన బుద్ధి విశేష ముచే సృష్టించినట్లు తెలుపజాలము. సర్వసాధారణముగా శాస నములన్నియు ప్రజలయందు వాడుకలోనున్న ఆచార వ్యవహా రాదులు, విశ్వాసములు మున్నగువాని నాధారముగ చేసి కొని కావింపబడును. బహుశః యీ శాశనములన్నియుకూడ నుమేరురాజుల రాజ్యకాలమునందే అమలులోనుండి యుండ వచ్చును. హామ్మురాబీ ఈ శాసనములన్నిటిని క్రోడీకరించి వానినొక ధర్మ గ్రంథముగా నేర్పరిచెను. ఈ శాసనములీ రాజు కాలమునసే లిఖితరూపమును వహించి యుండవచ్చును. ఈ శాసనములందు సామాన్య ప్రజలు ఉద్యోగులు, వివిధ వృత్తుల నవలంబించు వైద్యులు వ్యాపారస్థులు మున్నగు

వారు, బానిసలు మున్నగు సన్యాసులనుగూర్చియు, వారి ధర్మములు, హక్కులు మున్నగువాని గూర్చియు తెలుపబడినది. ఈ విధముగ హమ్మురాబీ రాజు తన విశాల రాజ్యమునందలి ప్రజానీకమునొక్క హక్కులను సంరక్షించుటకై పాటుబడు చుండెడివాడు. దీనివలన నతని న్యాయ పరత్వము ద్యోతకమగు చున్నది. కాని యెవ్వరైన న్యాయ ధర్మముల నతిక్రమించి వర్తించిన పక్షమున రాజు వారిని మిక్కిలి కఠినముగా దండించెడివాడు. హమ్మురాబీ రాజుచే కావింపబడిన న్యాయశాసనము లన్నిటిని విశదముగ తెల్పుట కిచ్చట యవకాశము లేదు. యూదు జాతీయులకు న్యాయశాసనములు గావించిన "మోజెస్" పై రాజు న్యాయసిద్ధాంతముల ననుసరించెనని పలువురు తలంచుచున్నారు. హమ్మురాబీ కాలమునందు బాబిలోనియా రాష్ట్రములో స్త్రీలస్థితి యెట్లుండెనను సంశము, పై రాజు శాసనములవలన దెలియ వచ్చుచున్నది. ఈ కాలమున స్త్రీలకు చాల స్వాతంత్ర్య మున్నట్లు తెల్పుట సత్యేతరముకాదు. వివాహము కాని స్త్రీలకు కూడ వారివారి పేరిట పెట్టె యాస్తు లుండెడివి. స్త్రీలలో కొందరు వర్తకము మున్నగునవి చేయుచు ధనార్జనము కావించెడివారు. ఉన్నత కుటుంబములలోని స్త్రీలు, ఆధ్యాత్మిక చింతయందు కాలము గడుపుచుండియు తమ కొరకు ప్రత్యేకమగు "ఒంటెలదండు" నేర్పాటు చేసికొని ఇతర దేశములతో వ్యాపారము కావించుచుండెడివారు. ఇట్టి

స్త్రీలు బ్రహ్మచర్య నియమమును పాటించెడివారు. కాని వీరు మఠములలో మాత్రమే కాలము గడుపవలెనని యెట్టి నిర్బంధములు నుంచెడివి కావు. ఇట్టి స్త్రీలు సారాయి దుకాణములను మాత్రము పెట్టరాదు. అట్టిదుకాణములలో ప్రవేశించుట కూడ నిషేధము. ఈ నియమమును వ్యతిరేకించి ప్రవర్తించిన వారికి మరణ దండన యొసంగబడుచుండెను. వ్యాపారము చేయువారు న్యాయముగ ప్రవర్తింపవలెను. ఇతరులను మోసము చేయుటకై ప్రయత్నించినవారికి కఠిన శిక్ష విధింపబడుచుండెను. వివాహితులగు స్త్రీలు భర్త్రయధీనమం దుండెడివారు. కాని వివాహ విచ్ఛేదము సంభవించినయెడల, ఆస్త్రీ యొక్కయు, సంతానము యొక్కయు పోషణకై తగిన ధనము నొసంగ వలసిన బాధ్యత భర్తపై యుండెడిది.

ఈ త ని స స్కా ర ణ ము లు

ఈ కాలమునందు బాబిలోనియా రాష్ట్రములో బానిసల నుంచుకొనుట న్యాయసమ్మతముగా పరిగణింపబడుచుండెను. కాని బానిసల హక్కులనుకూడ హమ్మురాబీరాజు శాసనములు సంరక్షించెను. సర్వసాధారణముగ వివాహయోగ్యరాండ్రుగానున్న ఆడబానిసలను వర్తకు లమ్మకమునకై తెచ్చెడివారు. హమ్మురాబీరాజు తన శాసనములలో బానిసల విలువను నిర్ణయించెను. ఈ బానిసల యందు విశేషమగు యోగ్యత అనగా సంగీతము, కుట్టుపని, మున్నగువానిలో నేర్పు ఉన్నచో వారి విలువ మరింత హెచ్చెడిది. బానిసలను

కొనినవారు పిదప తను యింటి వారితో సమానముగ చూచుచు పోషించవలెను. అట్టి కానిపక్షమున యజమానునికి మగ శిశువు జన్మించిన యెడల నా బానిసను వారలు విక్రయించుటకు వీలులేదు. బానిసలను విక్రయించినవారును కొనినవారును న్యాయశాస్త్ర రీతిని పత్రములను వ్రాయించి ఒండొరుల కిచ్చుకొనుచుండిరి.

హామ్మురాబీరాజు ప్రజోపయోగకరములగు అనేక ఘనకార్యములుచేయించెను. ఆతడు శిథిలావస్థ యందున్న పూర్వపు దేవాలయముల నుద్ధరించి అనేక నూతన దేవాలయములను ప్రతిష్ఠించెను. విదేశీయులగు ఎలామ్ దేశస్థులు బాబిలోనియా దేశము నాక్రమించిన కాలములో ఇచ్చటి కాలువలు జలాశయములు మున్నగునవి తగినంత శ్రద్ధలేక పాడుబడి పోయెను. దాని వలన వర్ష ఋతువునందు ఇచ్చటి నదులు కట్టలపై పొంగి పొరలి దేశమునకు విశేష నష్టము కలిగించుచుండెడివి. హామ్మురాబీరాజు కాలములో మొట్ట మొదటి సంవత్సరములయందు వరదలవలన కొన్ని పట్టణములు పూర్తిగ కొట్టుకొని పోయెను. ఈ విధముగ గ్రామములకును పట్టణములకును నష్టము కలుగకుండుటకై యీ రాజు టైగ్రిస్ నదికి యెత్తైన కట్టను నిర్మించెను. హామ్మురాబీరాజు తన పేరిట ఒక బ్రహ్మాండమగు కాలువను త్రవ్వించి టైగ్రిస్ నది యందలి అధికజల మా కాలువలో ప్రవహించునట్లు చేసెను. ఇట్టి కాలువ ప్రపంచమునందు మరెచ్చ

టను లేదని చారిత్రికులు తెల్పుచున్నారు. ఈ పెద్ద కాలువ నుండి చిన్న కాలువలను త్రవ్వి నదీజలములు దేశములోనికి ప్రవహించునట్లు కావింపబడెను. సుమారు పదునేను శతాబ్దములవరకును ఈ కాలువ మంచిస్థితిలో నుండెను. దీనిని గాంచి గ్రీకులు మొదలగు విదేశీయు లద్భుత పడిరి. ఈ కాలువను త్రవ్వించిన సందర్భమున హామ్మురాబీరా జొక శాసనమును వేయించెను. అందాత డిట్లువ్రాసెను. "నేను సుమేరు అక్కాడు ప్రజల కొక వరప్రసాదముగ నుండునట్లు నెహార్ హామ్మురాబీని (హామ్మురాబీరాజు కాలువను) త్రవ్వించితిని. ఈ కాలువ నీటిని నేను బంజరు ప్రదేశములుగ నున్న మైదానములలోనికి ప్రవహింపజేసితిని. ఈనీటిని ఎండిపోయిన కాలువలలోనికి ప్రవహింపజేసి ప్రజలకు సమృద్ధిగ జలము నందజేసితిని. నేను ఎడారి భూములను జల సమృద్ధము లగు ప్రదేశములుగ మార్చితిని. వీనిని సారవంతములుగను సస్య సమృద్ధములుగను కావించి యిచ్చటిప్రజల జీవితములను నేను సౌఖ్యవంతముగనొనర్చితిని." హామ్మురాబీరాజు వ్రాసిన యంశములలో నతిశయోక్తి యించుకైనను లేదని రూఢిగ తెల్పవచ్చును.

మహనీయుడైన ఈ రాజు కాలమునుగూర్చి చారిత్రికు లెట్టి నిశ్చయమును కావింపజాలరైరి. మొత్తముమీాద నతడు క్రీ. పూ. 2000 సంవత్సరముల ప్రాంతము వాడని చెప్ప వచ్చును.

## మ త వి ష య ము లు

సెమిటికు జాతికి చెందిన ఝూ 'సుమూ అబూ' వంశము వారి కాలములో బాబిలోనియా నగరమునకు మిక్కిలి ప్రాముఖ్యత యేర్పడెను. సుమేరు ప్రజల రాజ్య కాలములో సుమేరు రాష్ట్రమునం దుండిన వివిధ పట్టణములు తమ తమ ప్రత్యేక ప్రభుత్వములను స్థాపించుకొని రాజ్యపాలనము కావించుకొను చుండినట్లు మన మీవరకే తెలిసికొని యున్నాము. సెమిటికు జాతులవారు బాబిలోనియా నాక్రమించుకొనిన తరువాత అక్కాడు సుమేరు రాష్ట్రములు రెండు నేకమై బాబిలోనియా రాష్ట్రమంతయు ఒకే ప్రభుత్వ పాలనలోనికి వచ్చెను. అప్పటినుండియు బాబిలోనియా నగరము దేశమునకు కేంద్రమై మిక్కిలి పేరు మోసెను. ఈ దేశమునకు బాబిలోనియా అని పేరు వచ్చుటకుకూడ బాబిలోను నగరమే కారణమై యుండవచ్చును. ఆ కాలమునందు ప్రతి నగరమునకును ఒక పురదైవత ముండెడిది వాడుక యుండెను. అట్లే బాబిలోను నగరమునకు 'మార్డూకు' అను నాతడు పురదైవతముగా నుండెను. ఈ నగరము దేశమునకు రాజధానియగుటకు పూర్వ మీ దేవులకు ప్రాముఖ్యత లేకుండెను. కాని బాబిలోనియా నగరము ప్రభుత్వ కార్యస్థానముగ నేర్పడినప్పటి నుండియు 'మార్డూకు' దైవముకూడ మిక్కిలి యౌన్నత్యమును సంపాదింప సాగెను. ఈ కాలము వరకును బాబిలోనియా ప్రజలకు ముఖ్యదేవుడు 'ఎన్లిల్.'

ఇప్పుడు ' మార్డూకు ' ' ఎన్లిలు ' లకు పోటీ యేర్పడెను. ప్రజ లెల్లరును చిరకాలము నుండియు ' ఎన్లిల్ ' ను పూజించుట కలవాటుపడి యుండుటవలన ' ఎన్లిల్ ' కు గల యాధిక్యత పోలేదు కాని, ఎచ్చటనో మారుమూల అణగియున్న ' మార్డూకు ' దైవము మాత్రము దేవతాగణములో ప్రముఖ స్థానమునకు వచ్చెను. ఇంతేకు పూర్వము సుమేరు ప్రజలలో వాడుకయందున్న ధర్మ సంబంధములగు గీతములు మార్పు చెంది, అందు ' మార్డూకు ' నకు క్రొత్త ప్రాశస్త్యము నొసంగ బడెను. ఈ గానములయందు మార్డూకు 'ఎన్లిల్' కుమారుడని వర్ణింప బడినది. ఈతడు తన తండ్రికంటె కూడ ఘనుడట. 'మార్డూకు' తన పరాక్రమముచేత కష్టములలో చిక్కుకొనిన దేవతా గణమును రక్షించినందున ఈతనికి ప్రాముఖ్యత లభించినది. ఈతడు దుష్ట ప్రకృతులను సంహరించి, మరల సృష్టిని యథాప్రకారముగా కావించెను. సుమేరు ప్రజలకాలమున ప్రచారములో నున్న ధార్మిక గీతములు మున్నగువానిని పండితులగు వారు ప్రత్యేకముగ శ్రమపడి సంరక్షించిరి. నూతనముగ వ్రాయబడిన గీతములను బాబిలోనియా ప్రభుత్వమువారు సామాన్య ప్రజలలో వ్యాప్తికిదెచ్చిరి.

ఈకాలమునందు భాషా వైజ్ఞాని కాభివృద్ధి కూడ బాగుగా జరిగినదని తెలుపవచ్చును. బాబిలోనియా రాజ్యమునందు ' సుమా అబూ ' వంశము వారి యాధిపత్యము నెలకొనిన తరువాత కూడ పూర్వయుగము నాటి సుమేరు

భాషకు గల ప్రాముఖ్యత నశింపలేదు. న్యాయశాసనముల యందును, వ్యాపార సరళి యందును, మత గ్రంథములలోను సుమేరు భాషాపదములే విరివిగ వాడబడుచుండెను. ఆ పదముల యర్థము సామాన్యులకు సులభముగా తెలియుటకొరకు సుమేరు పండితులు ప్రత్యేక నిఘంటువులను సిద్ధ పరచెడివారు. ఇట్టి నిఘంటువులు నేటికి కూడ లభ్యమగు చున్నవి. సుమేరు భాషయందు వ్రాయబడిన ముఖ్యము లగు గ్రంథములు బాబిలోనియా భాషలోని కనువదింపబడెను. జ్యోతిశ్శాస్త్రము మున్నగు శాస్త్రగ్రంథములు శ్రద్ధగా సమకూర్చబడెను. ఆవశ్యకములైన చోట వీనికి వ్యాఖ్యానములుసైతము సిద్ధపరుప బడెను. శకునములయందు బాబిలోనియా ప్రజలకు చాల నమ్మక ముండెడిది. కావున శకునములు వాని ఫలములు మున్నగువానిని తెలుపు గ్రంథము లనేకములు సిద్ధము కావింపబడెను. వీనియందు దేవతా ప్రీతిగా బలిచేయబడిన మేకల కార్జము ( Liver ) పై గల గుర్తుల వలనను, జంతువుల పుట్టుక, వాని జీవితమునందలి అనేక ఇతర వ్యాపారములవలనను, దేవతల యిష్టానిష్టములు తెలిసికొను విధానములు వర్ణింపబడినవి. వైద్యగ్రంథములు, మంత్రతంత్రాదులను గూర్చిన గ్రంథములు కూడ పూర్వపు సుమేరు యుగమునుండి శ్రద్ధగా సంగ్రహింపబడి, జాగ్రత్త పరుపబడెను. బాబిలోనియా జాతివారి వాఙ్మయమును శ్రద్ధగా పరిశీలించిన పక్షమున వీరు తమకు పూర్వులైన సుమేరు ప్రజలనుండి

విజ్ఞాన సంబంధము లగు అన్ని విషయములను కూడ సంగ్రహించి వానిని జాగ్రత్తపరచి రనియు, వానిలో అనావశ్యకము లగు నట్టి మార్పులను కూడ కావింపలేదనియు తెలుపవచ్చును. సుమేరులనుండి గైకొనిన విజ్ఞాన భాండారమును బాబిలోనియా ప్రజలు తమ బుద్ధివిశేషము ననుసరించి యభివృద్ధి కావించిరి. వర్తక సరళియందు సుమేరు భాషాపదములే నిలిచిపోయెను. సుమేరుల కాలమందు వలెనే పన్నులు మున్నగునవి నాణెముల ద్వారా కాక దినుసుల ద్వారానే చెల్లుచుండెను. నాణెముల వాడకమును బాబిలోనియా ప్రజ లెరుంగక పోలేదు. కాని వానిని తరచుగా మాత్ర ముపయోగించెడి వారుకారు. ఏదైన ఇంటిని కాని భూమిని కాని అమ్మవలసిన యెడల ధరను కొన్ని వెండి నాణెములుగా నిర్ణయించెడివారు. కాని యీ వెండి నాణెములిచ్చి పుచ్చుకొనుట మిక్కిలి యరుదు. ఈ భూమికిని ఇంటికిని మారుగ కొందరు బానిసలు, కొన్ని పశువులు, ఆయుధములు, వస్త్రములు మున్నగువాని నొసంగి అప్పును తీర్చుట యెక్కువ పరిపాటిగా నుండెను. ఈ పశువులు మున్నగువాని ధర కూడ వెండినాణెములను బట్టియే నిర్ణయింపబడు చుండెను. మొత్తముమీద బాబిలోనియాప్రజలు నాణెముల వాడకమున కెక్కువ యలవాటు పడినవారు కారు. వారి వర్తకమునందు వస్తువు లిచ్చి పుచ్చుకొనుటయే కాని ధనమును నాణెముల రూపమున క్రుమ్మరించుట లేకుండెను.

[illegible]

హమ్మురాబీ వంశమువారు మిక్కిలి ప్రతాపవంతులై బాబిలోనియా రాష్ట్రమునంతను స్వాధీనము చేసికొనుటయే కాక "ఎలామ్" రాష్ట్రమునుకూడ తమ రాజ్యములో చేర్చుకొనిరి. కాని సముద్రతీరమున దక్షిణమునందు పూర్వకాలము నాటి సుమేరు ప్రజలరాజ్యమొకటి స్వతంత్రముగా పరిపాలన చేయుచుండెను. ఈ సముద్ర తీరరాజ్యమును జయించుటకై బాబిలోనియాయందలి సెమిటిక్ ప్రభువులు చాల ప్రయత్నము చేసిరి. కాని కృతకృత్యులు కాజాలరైరి. కావుననే ఆనాడు బాబిలోనియా దేశమందలి రాజ్యములలో సముద్ర తీర రాజ్యమొకటియని చారిత్రికులచే వర్ణింపబడినది. ఈ తీర రాజ్యమువారు హమ్మురాబీ వంశమువారి తరువాత బాబిలోనియా రాజ్యమునంతను పరిపాలించినట్లు కొందరు తలంచుచున్నారు. కాని ఇందులకు తగినయాధారములు కాన్పింపవు. తీరరాజ్యమునకును, హమ్మురాబీ వంశమువారికిని తరచు యుద్ధములు సాగుచుండినందువలన, కేంద్రప్రభుత్వమగు బాబిలోనియారాజులబలము కొంతవరకు క్షీణించెను. ఈ సందర్భమునందే ఈశాన్యదిశనుండి కొందరనాగరక జాతులవారు బాబిలోనియాపై దండెత్తుట ప్రారంభించిరి. వీరిని "కాసైటు" లని చరిత్రకారులు పేర్కొనుచున్నారు. ఈ "కాసైటుజాతి" వారు మీడియారాజ్యపు పర్వతములనుండి జగ్రోస్ కనుమలద్వారా అప్పుడప్పుడు అక్కాడు ప్రాంతముపై దండెత్తుట వాడుకగా

నుండెను. కాని హామ్మురాబీరాజు కుమారుడు "సమ్సూఇలూనా" అను నాతని రాజ్యకాలములో వీరు ప్రథమపర్యాయము బాబిలోనియా దేశములోనికి చొరచుకొని వచ్చినట్లు తెలుపవచ్చును. కాని మొట్టమొదటి పర్యాయ మగు వలస ఈ కాస్సైటు లధికసంఖ్యాకులుగ దేశమునందు ప్రవేశింపలేదు. ఈ ప్రాంతములలో గుఱ్ఱములను స్వారిచేయుట కుపయోగించినవారీ కాస్సైటులే యని తోచుచున్నది. బాబిలోనియాప్రజ లింతకుపూర్వము గాడిదలనేకాని గుఱ్ఱమునుచూచి యుండలేదు. కావున శరవేగమున పరుగెత్తు నీ వింతమృగ మును, వారాశ్చర్యముతో చూడసాగిరి. దీనికివారు 'పర్వతగార్ధభము' పేరొసంగిరి.

"సమ్సూఇలూనా"యొక్క మునిమనుమడైన "అమ్మిజడూగా" కాలమునందు సైతము బాబిలోనియారాజ్యము బలవత్తరముగా నుండెను. ఈతడు సముద్రతీరమునందు నెలకొనియున్న సుమేరురాజ్యముతో యుద్ధములు చేయుచునే యుండెను. మరికొంతసైన్యము "ఎలామ్" రాష్ట్రమునందు నిలుపబడెను. కాని పశ్చిమసరిహద్దునుమాత్రము వీరుజాగ్రత్త గా కాపాడుకొనుటకై యత్నింపలేదు. హామ్మురాబీవంశమును పదభ్రష్టము కావించిన జాతులవారీ పడమట దిక్కునుండియే బాబిలోనియాపై దాడులు సాగించిరి. "సమ్సూదితూనా" అనురాజు రాజ్యముచేయుచున్న కాలములో ఆనటోలియా ప్రాంతమునుండి 'హిట్టయిటు'లుఅను అనాగరకజాతివారు బాబి

లోనియాసామ్రాజ్యముపై దాడిచేసిరి. [illegible] బాబిలోనియా సైన్యములనోడించి బాబిలోనునగరమును దోచుకొని [illegible] సంతను, ధ్వంసముకావించుటేగాక [illegible] యొక్కయు, ఆయన భార్యయొక్కయు, విగ్రహములను తీసికొని వెడలిపోయిరి. హిత్తైటులదాడితో హమ్మురాబీవంశము నశించినది. కాని హిత్తైటులు బాబిలోనియారాష్ట్రమందు, స్థిరముగానుండలేదు. దేశమును కొల్లగొట్టి వీరు వెడలిపోయిన వెనుక "కాస్సైటు" తెగవారు సకల బాబిలోనియాపై దండెత్తివచ్చి యీ దేశము నాక్రమించుకొనిరి. ఈ తెగకు నాయకుడైన "గాండాష్" అను నతడు బాబిలోనియానగరములో తనరాజ్యమును స్థాపించుకొనెను. ఈ కాస్సైటు తెగవారు సుమారు ఆరుశతాబ్దులకాలము బాబిలోనియాయందు ప్రభుత్వమును సాగించినట్లు తెలియుచున్నది.

### కాస్సైటులు

ఈ కాస్సైటు తెగవారు బాబిలోనియా నాగరకతకు విశేషముగ దోహదమొసంగినట్లు తెలుపజాలము. వీరెక్కుడు విజ్ఞానవంతులుగ గాన్పించుటలేదు. అదియునుగాక ఈ కాస్సైటులు బహుళసంఖ్యాకులుగా బాబిలోనియాయందు ప్రవేశింపలేదు. వీరు పరిపాలకులుగ మాత్రము వ్యవహరింపజొచ్చిరి. ఈ తెగకుచెదింన సామాన్యప్రజలు విశేషముగా బాబిలోనియా రాజ్యములోనికి రానందున వీరికాలములో పాలకులు వేరుగను పాలితప్రజలు వేరుగను ఉండసాగిరి.

వీరు రాజ్యపరిపాలనమునందుమాత్రము మంచిసామర్థ్య మునుచూపిరి. సుమేరుప్రజల రాజ్యకాలమునందు సంవత్సర నిర్ణయమును గావించుటకు క్లిష్టమైన పద్ధతులు వాడబడు చుండెను. సంవత్సరమునందు జరిగిన యేదైన ముఖ్యవిషయ మును గుర్తునందుంచుకొని వీరాసంవత్సరమున కా ముఖ్యసంఘ టనయొక్క నామము నొసంగుచుండెడివారు. కాని కాస్సైటు లీ పద్ధతి యనుకూలముగా లేదని దానిని విడచిపైచి మరియొక పద్ధతి నవలంబించిరి. ఒకరాజు సింహాసనము నధిష్ఠించిన తేదీ నుండియు వీ రొక నూతనశకము నారంభించి, దాని ననుసరించి సంవత్సర నిర్ణయమును చేయు చుండెడివారు. ఈ నూతన పద్ధతివలన కాల నిర్ణయమునందు చాలవరకు సౌలభ్య మేర్పడెను.

కాస్సైటురాజులు బాబిలోనియా రాజ్యము నేగాక, ఆ రాజ్యమునకు తూర్పుననున్న "ఎలామ్" రాష్ట్రమును, పర్షియా సముద్రతీరమున చిరకాలమునుండి నెలకొనియున్న సుమేరు రాజ్యమునుకూడ తమపరిపాలనలోనికి గైకొనిరి. బాబిలోనియా కుత్తరభాగమున నున్న అస్సీరియా రాజ్యముకూడ తమ పాలనకులోబడి యున్నట్లు వీ రచ్చటచ్చట తెలుపుకొనిరి కాని యీ విషయమును సంపూర్ణముగ విశ్వసించుటకు వీలు లేదు. క్రీ. పూ. పదమూడవశతాబ్ది మధ్యభాగమున అస్సీ రియారాజు బాబిలోనియా రాజ్యముపై దండెత్తి బాబిలో నియానగరమును కొల్లగొట్టి వెడలిపోయినట్లును, సుమారు పది

సంవత్సరముల కాల మీరాజు బాబిలోనియాపై రాజ్యముచేసి నట్లునుకూడ కొన్ని యాధారములవలన దెలియుచున్నది. ఏదియెట్లున్నను, అస్సీరియారాజ్యము కాసైటుప్రభువుల యాధిపత్యమును సంపూర్ణముగా నంగీకరింపలేదని దృఢముగా తెలుపవచ్చును. ఈకాసైటు వంశము వారు ఆనాటికి మిక్కిలి ప్రాబల్యము వహించియుండిన ఈజిప్టురాజులతో స్నేహాభావముతో మెలగుచుండెడివారని, వీరిరువురికినినడచిన రాజ్యాంగ లేఖలవలన తెలియవచ్చుచున్నది. ఈజిప్టురాజులకు కాసైటు వంశమువారియెడ గౌరవమున్నను లేకపోయినను, బాబిలోనియా నాగరకతను,విజ్ఞానమునుమాత్రము వారు మన్నించుచుండెడివారు. ఇందులకు తార్కాణముగా వీరు పరదేశములరాజులతో పత్రవ్యవహారములు జరవునప్పుడు బాబిలోనియాభాషనే వాడుచుండెడివారు.

ఈజిప్టుదేశపురాజులు బాబిలోనియాలోని కాసైటు ప్రభువులతో స్నేహముగానున్నట్లు నటించుచు రహస్యముగా వారిప్రజలను వారిపై తిరుగుబాటు చేయుటకు ప్రోత్సహించుచుండెడివారు. పైనసూచింపబడిన అస్సీరియావారి దండయాత్ర యిట్టి ప్రోద్బలమువలన సంభవించినదే యని యూహించుట సత్యదూరముకానేరదు. కాని యీ దండయాత్రవలన కాసైటువంశమువారి ప్రభుత్వము నశింపలేదు. వీరు మరల బలమును సమకూర్చుకొని అస్సీరియాదేశముపై దండయాత్రలు నడిపిరి. క్రీ. పూ. 1180వ సంవత్సరప్రాంత

మున ఎలామ్ ప్రజలు బాబిలోనియాపై దండెత్తివచ్చి కాసైటు వంశమును నాశనము చేసిరి.

ఎలామ్ రాష్ట్రమునకు ముఖ్యపట్టణము "సూసా" నగరము. ఈ నగరమున బాబిలోనియా దేశమునందు కాసైటు వంశమువారిచే నిర్మింపబడిన రాతిచెక్కడములు మున్నగునవి కాన్పించినవి. కావున ఎలామ్ దేశమువారు బాబిలోనియానుండి వీనిని తమదేశమునకు కొల్లగొట్టుకొని పోయిన ట్లూహింపవచ్చును. కొంతకాలమువరకును బాబిలోనియా దేశముపై ఎలామ్ ప్రభువులు రాజ్యముచేసిరి. కాని మరియొక రాజవంశమువారు వీరి నోడించి బాబిలోనియారాజ్యమును మరల స్వతంత్రరాజ్యముగ ప్రతిష్ఠించిరి. ఈ వంశమువారిలో ప్రథమ "నెబుచడ్నెజారు" అనురాజు మిక్కిలి ప్రాముఖ్యత వహించియున్నాడు. (క్రీ. పూ. 1175) ఈతడు పరాక్రమ శాలి. ఈరాజు ఎలామ్ ప్రజలను కాసైటు తెగవారినికూడ ఓడించెను. "ఎలామ్" ప్రజలతో జరిగిన యుద్ధములలో తన రథసైన్యములకు నాయకుడగు "రిటీమార్డూకు" అను నాతడు చూపిన ధైర్యసాహసములకు సంతసించి "నెబుచడ్నెజారు" ఆతని కొక జాగీరునుప్రసాదించెను. ఆయంశమును ప్రకటించుటకై యొక జయస్తంభము నెలకొల్పబడెను. ఈ జయస్తంభము పూర్వకాలపు బాబిలోనియాశిల్పమునకు చక్కనియుదాహరణ మని చారిత్రికులు తెలుపుచున్నారు. దీనిపై మనోహరమగు దృశ్యములెన్నియో మిక్కిలి నేర్పుతో చిత్రింపబడినవి. ప్రథమ

నెబుచడ్నెజారురాజు అస్సీరియా రాజులతో పెక్కు యుద్ధములు కావించెను. కాని ఈ యుద్ధములలో నాతనికి పరాభవము కలిగెను. ఈ కథా కాలమునాటికి అస్సీరియా రాజ్యము బలవత్తరమై బాబిలోనియాకు పక్కలో బల్లెమువలె పరిణమించెను. చిరకాలమునుండి యితర రాజ్యములతో యుద్ధములు సాగించుచు వచ్చుచుండినందున బాబిలోనియా ప్రభుత్వము నిర్వీర్యము కాజొచ్చెను. ఉత్తరమునుండి నూతనముగా ప్రాబల్యమునకు వచ్చుచున్న అస్సీరియా రాజ్యమును, పశ్చిమమునుండి అరేబియా దేశము వారును బాబిలోనియా వారికి ఒత్తిడి కలిగింప నారంభించిరి. అరేబియానుండి వెలువడిన ఈ అనాగరకులు "అరామియా" తెగకు చెందినవారు. వీరి దండయాత్రల వలన పట్టణములు, పల్లెలును నశించెను. వీరు బాబిలోనియా యందలి దేవాలయములను నాశనముచేసి యందలి దేవతా విగ్రహముల నెత్తుకొని పోయిరి. అరామియా తెగవారి దండయాత్రల వలన నూతనముగ బాబిలోనియా యందు స్థాపితమైన రాజవంశము నశించెను. ఆపైన మరిమూడు రాజవంశములు బాబిలోనియా యందు రాజ్యపాలనము కావించెను. కాని వానిని గూర్చి ప్రత్యేకముగా తెలుపదగిన యంశములేవియును లేవు. క్రీ. పూ. ఎనిమిదవ శతాబ్దియందు బాబిలోనియాలో మరియొక నూతన రాజవంశము ప్రాధాన్యతను వహించెను. ఈ వంశమువారు 'అరామియా' తెగవారిని నిరోధించి దేశమునందు శాంతిని

నెలకొల్ప కలిగిరి. దేశమునందు పాడుపడియున్న కట్టడములను పునర్నిర్మించుటకై ప్రయత్నములుకూడ జరిగెను. సిప్పార్ అనే పట్టణమునందు సూర్యదేవుని గౌరవార్థము నిర్మింపబడిన దేవాలయము పునరుద్ధరింపబడెను.

బాబిలోనియా రాజ్యము క్షీణించుట

బాబిలోనియా రాజ్యముయొక్క ఆధిక్యతమాత్రము క్షీణింపసాగెను. అస్సీరియా రాజ్యము నానాటికిని అభివృద్ధి చెందసాగెను. క్రీ.పూ. 852వ సంవత్సరమున అస్సీరియా ప్రభువు బాబిలోనియాపై దండెత్తి యిచ్చటి రాజును తనకు సామంతునిగ కావించికొని, తన సార్వభౌమాధికారమును ప్రకటించు నిమిత్తము ఈ రాజ్యమునందలి బార్సిప్పా కూథా నగరములలోని దేవాలయములలో జంతుబలి యొసంగి తన రాజ్యమునకు మరలిపోయెను. మరి కొంతకాలము వరకును బాబిలోనియా వారు తమ స్వాతంత్ర్యమును రక్షించుటకై అస్సీరియా రాజులతో పోరాడసాగిరి. కాని యిందువలన ఫలితమేమియు లేదయ్యెను. అస్సీరియా వారి సైన్యములు క్రమశిక్షణము పొందియుండిన కారణమున నయ్యవి దుర్జేయములయ్యెను. క్రీ. పూ. 728 వ సంవత్సరమున అస్సీరియా వారు బాబిలోనియా నగరమును మరల ఆక్రమించు కొనిరి. ఆపైన బాబిలోనియాయందు ప్రభుత్వము కావించిన వా రస్సీరియా రాజులే కాని స్థానిక ప్రభువులు కారు. ప్రభుత్వాధికారములు బాబిలోనియా ప్రజలకడనుండి లాగుకొనబడినవి. కాని

వర్తక వ్యాపారములయందును, ధర్మ శాస్త్ర విషయములందును బాబిలోనియాదే ఏకైక ప్రాముఖ్యత వహించెను. అది యునుగాక బాబిలోనియా నాగరికత నస్సీరియా ప్రజలు గౌరవ దృష్టితో చూచుచుండెడి వారు. ఒకానొక కాలమున అస్సీరియా రాజ్యము బాబిలోనియాను జయించినను, బాబిలోనియా వారిపైన తమపై రాజ్యాధికారము చేయుట బాబిలోనియా వారికి కష్టదయ్యెను. కావున బాబిలోనియా ప్రజలు తమ పూర్వ స్వాతంత్ర్యమును మరల స్థాపించుకొనవలయును అను ఉద్దేశ్యముతో అస్సీరియా ప్రభుత్వముపై తరచుగా తిరుగుబాటులు చేయుచుండెడి వారు. ఈ కారణము వలన బాబిలోనియా రాష్ట్రము అస్సీరియా రాష్ట్రమునకు మెడలోని గుదిబండవలె పరిణమించెను. అస్సీరియా ప్రభుత్వము నిర్దయముగ తన శత్రువు లగు నితర దేశములవారితో పోరాడు సందర్భములలో బాబిలోనియా వారు తిరుగుబాటు కావించి వారిని చీకాకు పెట్టుచుండెడి వారు. కావున బాబిలోనియా ప్రభుత్వపు సమస్యను పూర్తిగ పరిష్కరింపవలెనని అస్సీరియా రాజ్యము నిశ్చయించుకొనెను. కాని యీ సమస్యను పరిష్కరించుటకై అవలంబింపబడిన పద్ధతులలో మాత్రము సామరస్యము లేదయ్యెను. అస్సీరియా రాజగు "సెన్నాచెరిబ్" అను నాతడు బాబిలోనియా ప్రజల యెడ కాఠిన్యమును వహించి వారిని శిక్షించి లోబరచుకొను నుద్దేశ్యముతో ఒక పూర్వ మార్గము నవలంబించెను. బాబిలోనియా పట్టణమును నాశనము చేసిన యెడల బాబిలోనియా

ప్రజలు రెక్కలు తెగిన పక్షులవలె నిస్సహాయులై పోవగలరని తలంచి యాతడు యూఫ్రటీసు నదీప్రవాహమును మరలించి బాబిలోను పట్టణము వైపునకు మరల్చెను. నదీ ప్రవాహము బాబిలోను నగరము నందు ప్రవేశించి పట్టణమందలి సగము భాగమును తనపొట్ట బెట్టుకొనెను. "సెన్నాచెరబ్" అనంతరము అస్సీరియా రాజ్యమును పాలించిన "ఇసార్ హాడన్" అను రాజు తన పూర్వికుని రాజనీతిని పూర్తిగ విడనాడి సామోపాయముచే బాబిలోనియా వారిని తనకు వశంవదులుగ చేసికొనుటకై యత్నించెను. ఈతడు బాబిలోను నగరములో నాశనమైన భాగమును మరల కట్టించి, ఈ పట్టణవాసులకు వారిహక్కులను తిరిగి యొసంగెను. కాని దండోపాయమును, సామోపాయమునుకూడ బాబిలోనియా ప్రజల నణచి వేయుటలో కృతకృత్యములు కాజాలక పోయెను. 'అషుర్ బనిపాల్' అను అస్సీరియా రాజు కాలములో బాబిలోనియా వారు పెద్ద తిరుగుబాటు చేసిరి. ఈ వరకే ఈజిప్టు దేశముతో యుద్ధములుచేయుచు అలసియున్న అస్సీరియా సైన్యములు ఈతిరుగుబాటు నడంప జాలకపోయెను. క్రీ.పూ, 606లో అస్సీరియా రాజ్యము పూర్తిగ నశించెను. ఈ సందర్భమున "నబోపోలేసర్" అను నాతడు బాబిలోనియాయందు వేరొక రాజ్యమును స్థాపించి స్వాతంత్ర్యమును ప్రకటించెను. ఈ స్వతంత్ర రాజ్యము సుమారొక శతాబ్దివరకు ప్రబలముగ నున్నట్లు నిదర్శన పూర్వకముగ మనకు తెలియ నగు చున్నది.

అస్సీరియావారియొక్క పారతంత్ర్యమునుండి వెలువడిన తర్వాత బాబిలోనియా దేశము మరియొక పర్యాయము గొప్ప వైభవముతో విలసిల్లెను. ప్రప్రథమమున నబోపోలేసర్ రాజుయొక్క ఆధిపత్యమును బాబిలోనియా బార్సిప్పా పట్టణములు మాత్ర మంగీకరించెను. బాబిలోనియాయందలి ఇతర పట్టణములు అస్సీరియాప్రభువుల యధీనమందే యుండెను. క్రీ. పూ. 606 నాటికి అస్సీరియా రాజ్యమునకు ముఖ్యపట్టణ మైన నైనివా నగరము శత్రువుహస్తగత మయ్యెను. మీడియా దేశపురాజులు అస్సీరియావినాశమునకు కారణభూతులైరి. నబోపోలేసర్ రాజు స్వయముగ నైనివా పట్టణము పై దాడి వెడల లేదు కాని, అట్లు కావించిన వారి నాతడు తన మిత్రులుగ పరిగణించెను. ఒకప్పు డస్సీరియా సామ్రాజ్యములో రాష్ట్రములుగా నున్న పాలస్తీనా సిరియా రాష్ట్రములను ఈజిప్టు వారా క్రమించిరి. కాని బాబిలోనియా రాజ్యమునకు చెందవలసిన భాగముల నీజిప్టు దేశ మాక్రమించ కుండునట్లు నబోపోలేసర్ రాజు కట్టుదిట్టము చేసెను. యువరాజగు నెబుచెడ్నెజారు "కార్ఖెమిష్" అను ప్రదేశమున ఈజిప్టు వారి సైన్యములను క్రీ. పూ. 604 సంవత్సరమున సంపూర్ణముగ పరాభవించెను. ఈ విజయమువలన బాబిలోనియా రాజ్యముయొక్క బలము స్థిరపడెను. ఈసందర్భమునందే "నబోపోలేసర్" రాజు మరణించి నందున "నెబు చడ్నెజారు" సింహాసన మధిష్ఠించెను. బాబిలోనియా రాజులలో నీ పేరుగల వారియందీతడు ద్వితీయుడు.

ఈ రాజు తన రాజ్యముయొక్క కీర్తిని మిక్కిలి విస్తరింప జేసెను. ఈతడు గొప్ప శూరుడు. ఈరాజు కాలములో పాలస్తీనా సిరియా రాష్ట్రములు తమంత తామే యీతని అధికారము నంగీకరించెను. ఈతడు తనపై యుద్ధమును ప్రకటించిన ఈజిప్టు వారిని వారి మిత్రులను పరాభవించెను. జెరుసెలేమ్ పట్టణము నీతడు రెండు పర్యాయము లాక్రమించుకొని అందలి యూదులను బందీలుగ తన దేశమునకు గొనివచ్చెను. ఫొనీషియా రాజ్యమును, టైర్ పట్టణమునుకూడ నీతడు వశపరచుకొనెను. ఈ విధముగ నెబుచడ్నెజారు రాజు తన తండ్రిచే ప్రారంభింపబడిన రాజ్య విస్తరణమును సంపూర్తి కావించెను. తనకు ప్రతిస్పర్థిగానున్న ఈజిప్టు రాజ్యమును నెబుచడ్నెజారు పూర్తిగ నోడించి తన రాజ్యమున కెట్టి ప్రమాదమును లేకుండ జాగ్రత్త పడెను. నెబుచడ్నెజారు ప్రభువు కేవలము యుద్ధకుశలుడు మాత్రమే కాడు. ఈతనికి శిల్పకళ యందును, వివిధ నిర్మాణములయందును చాల కుతూహల ముండెను. ఈతడు బాబిలోను నగరములో చాల మార్పులు కావించి దాని నొక నూతన పట్టణముగ చేసెను. తన తండ్రియొక్క రాజ ప్రాసాదమును ఈతడు సంపూర్ణముగ మార్పించి మరల కట్టించెను. ఈతని కాలములో నిర్మింపబడిన కట్టడము లన్నియు చాల యెత్తును, విశాలములు నగు తిన్నెలపై కట్టబడు చుండెను. అందు ముఖ్యముగ సంస్మరింపవలసిన వీతని తోటలు. బాబిలోనియా దేశమునందు సామాన్యముగా ఇండ్లనుకూడ మిక్కిలి యెత్తైన

వేదికలపై నిర్మించుట వాడుక. వర్ష కాలమునందు దేశమం తయు జలమయముగ కనిపించు చుండును. అదియునుగాక యెల్లప్పుడును భూమి తేమగా నుండును. కావున సామాన్య పునాదులపై కట్టిన యిండ్లు చిరకాలము నిలువజాల కుండెడివి. ఆ కారణముచే బాబిలోనియా దేశస్థులు లోతైన పునాదులను తీసి, పెద్ద తిన్నెలను ఇటుకలతో కట్టి వానిపై తమ తమ యిండ్లు నిర్మించు కొనెడివారు. ఆ అలవాటును బట్టి నెబుచడ్నెజారు రాజు ఇటుకలతో బహిర్నిర్మితములగు కమాను ( Arch )లను నిర్మించి వానిపై చదును నేలను కృత్రిమముగ కల్పించి అచ్చట చక్కని తోటలను వేయించెను వివిధ దేశ ములనుండి చక్కని పూల చెట్లను, నానాజాతి వృక్షములను తెప్పించి యీ తోటలలో నాటించుచు వానిని భూలోక నందనవనమువలె కావించెను. పురాతన కాలమునందు ఈ తోటలు ప్రపంచమునందలి యద్భుత నిర్మాణములలో నొకటిగ పరిగణింప బడుచుండెను. బాక్రిప్పా, బాబిలోను నగరముల యందలి దేవాలయముల నితడు పునర్నిర్మింపించెను. మార్డాక్ దేవుని ఆలయమునకును తన రాజ ప్రాసాదమునకును నడుమ గల వీధిలో చక్కని రాళ్లు పరిపించి అచ్చట నొక ద్వారమును నిర్మింపించెను. దీనిని "ఇష్టారుద్వార"మని వ్యవహరించెడివారు. ఈ ద్వారము వివిధ చిత్రములతో మనోజ్ఞముగ చూపట్టు చుండెడిది. బాబిలోను నగరమునకు చుట్టునుగల ప్రాకారము బలవత్తరముగా కావింపబడెను. శత్రుదుర్భేద్యముగనుండుటకై

నగరమునకు రెండు ప్రాకారములు నిర్మింపబడెను. ఈనెబుచడ్నెజారురాజు నలుబది రెండు సంవత్సరములు గొప్పవైభవముతో పరిపాలించి బాబిలోనియారాజ్యమును బలవత్తరముగను, నగరమును సుందరతరముగను కావించెను. ఈతని యనంతరము రాజులైనవారిలో సమర్థు లెవ్వరును లేరు. క్రీ. పూ. 555 సంవత్సరమున "నెబోనిడస్" అను నాతడు రాజయ్యెను. ఈతడుకూడ నూతన మందిరములను దేవాలయములను నిర్మించెను. కాని యీతనియందు ధైర్య శౌర్యములు లోపించెను. కావున నీతనిరాజ్యము చిరకాలము నిలువలేదు. పర్షియా దేశపు రాజైన 'సైరస్' అనునాతడు బాబిలోనియా రాజ్యముపై దండెత్తెను. నెబోనిడస్ రాజు శత్రువుల నెదుర్కొనుటకు తన కుమారుని పంపెను. కాని యీరాజు కుమారుడు 'జీపిస్' అను ప్రదేశమున పర్షియా సైన్యములచే సంపూర్ణముగ పరాభవింపబడెను. నెబోనిడస్ రాజు బాబిలోను నగరమును విడచి పారిపోయెను. 'గోబ్రియస్' అను పర్షియా సేనాని క్రీ. పూ. 539 సంవత్సరమున బాబిలోను నగరము నాక్రమించుకొనెను. ప్రాకారమునందున్న సైనికులు మిక్కిలి ధైర్యముతోడను, పట్టుదలతోడను, పోరాడినను ఫలితము లేకపోయెను. బాబిలోనియాయందు చాల ప్రాముఖ్యత వహించియుండెడి మతాధికారు లెల్లరును పర్షియా రాజగు "సైరస్" కు స్వాగతమొసంగి ఆతనికి తమ పురదైవతమగు 'మార్డూకు' విజయలాభము నొసంగెనని సంతోషించిరట. నెబోనిడస్ రాజు వద

దేశమునుండి దేవతా విగ్రహములను తెప్పించి, వానిని గౌర
వముతో ప్రతిష్ఠించినందున ఈ మహాప్రభువుల నాగ్రహము
కలిగి వీరు తమ రాజునకే ప్రతికూలురైరి. ఇట్టులైన బాబి
లోనియా ప్రజలు విదేశీయుల పరిపాలనమునుండి విడివడుటకై
ప్రయత్నములు చేయలేదు. ఇంతటితో బాబిలోనియా వారి
స్వాతంత్ర్యదశ నశించి పారతంత్ర్యదశ ప్రారంభించుచున్నది.

## పారతంత్ర్య దశ

పర్షియా రాజగు సైరస్ కాలమునందు బాబిలో
నియా దేశము విదేశ పరిపాలనయం దున్నను ప్రజలకు విదేశ
పరిపాలనయందలి కష్టములు సంభవింప లేదు. సైరసురాజు
మత ప్రాపంచిక విషయములన్నిటియందును బాబిలోనియా
ప్రజలకు సంపూర్ణ స్వాతంత్ర్యము నొసంగెను. రాజుయొక్క
పేరు మాత్రమే మారినదికాని ప్రజల జీవితము యథాపూర్వ
ముగనే నడచుచుండెను. కాని యీ పరిస్థితులు చాలకాలము
నిలువలేదు. పర్షియా సామ్రాజ్యమునందంతటః కలహములు
ప్రారంభ మయ్యెను. బాబిలోనియా ప్రజలు వీనియందు ప్రవే
శించి రాజుపై తిరుగుబాటు కావించినవారి పక్షము నవలం
బించిరి. ఇందులకు ఫలితముగా డేరియస్ అను పర్షియా
రాజు బాబిలోను నగరమును ముట్టడించి స్వాధీనము చేసి
కొనెను. ఈ యుద్ధముల వలన బాబిలోను నగరము చాల
నష్టపడెను. ఈ పట్టణము చుట్టుగల ప్రాకారమును, నగర
మందలి కొన్ని గొప్ప నిర్మాణములును కూడ చెడిపోయెను.

జెర్జస్ అను మరియొకపర్షియా రాజు బాబిలోను నగరముపై దండెత్త వలసిన వాడయ్యెను. ఈ దేశపు ప్రజలు తమ స్వాతంత్ర్యమునకై మరియొక పర్యాయము పర్షియా ప్రభుత్వముపై తిరుగుబాటు చేసిరి. జెర్జస్ రాజు బాబిలోను నగరపు ప్రాకారములను సంపూర్ణముగ పడగొట్టుటతో సంతుష్టి జెందక నగర దైవతమగు మార్డూకుయొక్క అద్భుతమగు దేవాలయమును నాశనము చేసెను. క్రీ. పూ. 331 వ సంవత్సరమున గ్రీకు రాజును,జగద్విఖ్యాత వీరుడు నగు అలెగ్జాండర్ పర్షియా రాజ్యమును తుదముట్టించెను. అలెగ్జాండరు రాజు ఆసియా ఖండమంతటికిని తాను ప్రభువు నని ప్రకటించి బాబిలోను నగరమును తనకు రాజధానిగా చేసికొనెను. ఈతడు బాబిలోను నగరముయొక్క పూర్వవైభవమును గాంచి యద్భుతపడి, పుర దైవతమగు మార్డూకు దేవాలయమును పునరుద్ధరింపవలె నని తలంచెనట. కాని యాకార్యము కష్టసాధ్యమని యెరింగి ఆతడు దానిని విరమించెను.

బాబిలోను నగరము క్రమముగా క్షీణించెను. అచ్చట సుప్రసిద్ధ దేవాలయముల చుట్టును ప్రజలు మరి కొంత కాలము వరకును నివసించిరి. కాని వ్యాపారస్థులు మున్నగు వారి కీ పట్టణ మనుకూలముగ లేనందున, వారందరును నూతనముగా నిర్మింపబడిన సెల్యూకియా పట్టణమునకు వెడలి పోయిరి. అలెగ్జాండరు మరణానంతరము బాబిలోనియా పరగణాకు రాజైన సెల్యూకస్ అను వాత డీ నూతన పట్టణము

స్థాపించి దానిని తనకు రాజధానిగా చేసికొనెను. ఈ నూతన పట్టణము లన్నియు బాబిలోను నగరమునందు కూలి పడి పోయిన మందిరములు, దేవాలయములు మున్నగు వానినుండి ఇటుకలు, రాళ్ళు మున్నగువానిని ధారాళముగ గైకొనెను.

కొంతకాలము గ్రీకుల యధికారములో నున్న తరువాత బాబిలోనియా రాష్ట్రము పర్షియా దేశస్థులైన మరియొక రాజవంశము వారిచేతను, అటుపైన అరబ్బుల చేతను, క్రీ. శ. 13 వ శతాబ్ది మధ్యభాగము నుండి తురుష్క సామ్రాజ్యము వారిచేతను పాలింప బడెను. ఇరువదవ శతాబ్దియందు తురుష్క ప్రజలు తమ సుల్తానును దేశమునుండి వెడలనడచి రాచరికమును అంతమొందించి ప్రజాస్వామిక ప్రభుత్వమును స్థాపించిరి. ఆ సందర్భమున వారు అనేక శతాబ్దులనుండి తమ యధికారములో నుండిన సామ్రాజ్యముపై గల అధికారమును వదలుకొనిరి. దీనివలన మెసపొటేమియా మున్నగు దేశములందలి అరబ్బులకు నామమాత్ర స్వాతంత్ర్యము సిద్ధించెను. కాని యీ అరబ్బు ప్రజలు నాగరకత విషయమున వెనుకపడి యున్నారను మిషతో బ్రిటిషువారి రాష్ట్రమును తమ సంరక్షకత్వములోనికి గైకొనిరి.

## బా బి లో ను ప్ర జ ల వి శి ష్ట త

బాబిలోనియా దేశముయొక్క పూర్వ నాగరకతను గూర్చిన యనేకాంశములను మన మాకాలమునందు తయారు చేయబడిన ఇటుకలవలన దెలిసికొన వచ్చును. ఈ దేశము

వారు ప్రత్యేక మగు నొక లిపిని కల్పించిరి. వీరి భాషయందలి అక్షరములు చాల గీతలతో నిండియుండి చూచుటకు విచిత్రముగా కాన్పించును. హిందూ దేశము నందు పూర్వకాలమున తాటియాకులపై ఘంటములతో వ్రాత వ్రాసినట్లుగానే వీరు మెత్తని మట్టి యిటుకలపై ఘంటములతో వ్రాసెడివారు. అంతియే కాదు. ఈ వ్రాత చెడిపోకుండుటకు గాను వీరొక ప్రత్యేకమగు నేర్పాటు చేసెడివారు. ఇటుకపై వ్రాసిన తరువాత ఆ ఇటుకను కాల్చెడివారు. కాల్చిన యిటుకపై మెత్తటి మట్టిని పూసి ఆ మట్టిపూతపై మొదటి యంశములనే వీరు మరల వ్రాసెడివారు. ఆ యిటుకను మరల గాల్చిగట్టిపరచెడివారు. ఇట్లు చేయుటవలన కలుగు లాభము వేరుగ తెలుప నక్కరలేదు. ఏ కారణము వల్లనైనను ఇటుకపై వ్రాత చెరిగిపోయినను, లేక ఎవ్వరైన దానిని బుద్ధి పూర్వకముగ మార్చిన పక్షమునను, ఇటుకపై గల పూతను తొలగించిన యెడల సత్యవిషయము కాన్పించును. ఇట్టి ఇటుకలు వేనవేలుగ మెసాపొటేమియా దేశములో లభ్యమైనవి. ఆ కాలపు ప్రజలు వీనిని ముఖ్యముగా దేవాలయములయందు జాగ్రత్త పరచెడివారు.

బాబిలోనియా దేశపు ప్రజలు గొప్పగొప్ప కట్టడములను నిర్మించినట్లీ వరకే తెలుపబడి యున్నది. వీరు జ్యోతిశ్శాస్త్రమునందు మిక్కిలి యభివృద్ధి కావించినట్లు వీరిచే రచింప

బడిన గ్రంథములవలన తెలియనగు చున్నది. గ్రహచారమును వీరు చక్కగ పరిశీలింప గలిగిరి. సూర్యచంద్రుల గ్రహణములను వీరు సరిగ నిర్ణయించు చుండెడివారు. ఈ దేశస్థులే అనంతమగు కాలమును సంవత్సరములుగను, సంవత్సరమును పండ్రెండు మాసములుగను, వారము నేడు దినములుగను, దినము యిరువదినాలుగు గంటలుగను విభజించి కాలనిర్ణయమందు సౌకర్యమును కలిగించిరి. గణిత శాస్త్రమునకుకూడ వీరు గొప్పసేవ కావించిరి. వివిధ వస్తువుల కొలతలు, తూకము ఘనపరిమాణము మున్నగు వానిని నిర్ణయించుటకై బాబిలోనియా ప్రజలు చక్కని యేర్పాట్లు కావించిరి.

ఈ విధముగా బాబిలోనియా దేశస్థులు సుమారు నాలుగువేల సంవత్సరములకు పూర్వమే గొప్ప నాగరకతను సంపాదించుకొని యుండుట వ్యక్తమగు చున్నది. ఆధునికులు వీరివలన ననేక విజ్ఞాన శాఖలయందు మహత్తర విషయములను దెలిసికొని, వీరి కెంతయో ఋణపడి యున్నారు.

# కాల్డియా బాబిలోనియా రాజ వంశావళి

## కాల నిర్ణయ పట్టిక

| | రాజవంశము | కాలము | ముఖ్యులైన రాజులు |
|---|---|---|---|
| 1 | జీసిస్ వంశము (6 రాజులు 99 సంవత్సరములు) | క్రీ.పూ. 3050 | ఉంజ (వంశస్థాపకుడు), గిమిల్ సిన్ |
| 2 | కిష్ వంశము (8 రాజులు 100 సంవత్సరములు) | క్రీ.పూ. 2925 | కూబా (స్థాపకుడు) జముడార్ |
| 3 | ఎరిక్ వంశము (ప్రథమ) (1 రాజు 25 సంవత్సరములు) | క్రీ.పూ. 2825 | లూగల్ జగ్గిసీ |
| 4 | ఆక్కాడువంశము (12 రాజులు 197 సం॥లు) | క్రీ.పూ. 2800 | షరూకిన్ (స్థాపకుడు) బారమ్‌సిన్ |
| 5 | రెండవఎరిక్ వంశము (5 రాజులు 26 సం॥లు) | క్రీ.పూ. 2600 | ఉర్ నిగిన్ (స్థాపకుడు) ఉర్ షమాష్ |

| | రాజవంశము | కాలము | ముఖ్యులైన రాజులు |
|---|---|---|---|
| 6 | గూటీయా ఆక్రమణము | క్రీ.పూ. 2575 | లాసిరాబ్ ఇనిమాబిజక్ |
| 7 | ఉర్ వంశము (5 రాజులు 119 సం॥లు) | క్రీ.పూ. 2400 | ఉర్ ఎంగూరు (స్థాపకుడు), దుంగి, ఇబిసిన్ |
| 8 | ఇసిన్ వంశము (16 రాజులు 226 సం॥లు | క్రీ.పూ. 2275 | ఇష్బీఇర్రా(స్థాపకుడు) ఇష్మెదాగన్ |
| 9 | ప్రథమ బాబిలోనియా వంశము (11 రాజులు 300 సం॥లు) | క్రీ.పూ. 2050 | సు అబూ(స్థాపకుడు) హమ్మురాబి-సముసూ ఇలూనా-అబేషూ. |
| 10 | ద్వితీయ బాబిలోనియా వంశము (11 రాజులు) | క్రీ.పూ. 1900 | ఇలూమా ఇలూ (స్థాపకుడు) ఈ_గామిల్ |
| 11 | తృతీయ బాబిలోనియా వంశము(36 రాజులు577సం॥లు) | క్రీ.పూ. 1750 | గాండాష్ (స్థాపకుడు) కాగా, ఇండాష్ |

| | రాజవంశము | కాలము | ముఖ్యులైన రాజులు |
|---|---|---|---|
| 12 | చతుర్థ బాబిలోనియా వంశము (11 రాజులు 133 సం॥) | క్రీ.పూ. 1175 | ప్రథమ నెబుచడ్నీజారు మార్డూక్ —నాదిన్_ అఖీ |
| 13 | పంచమ బాబిలోనియా వంశము (3 రాజులు22సం॥లు) | క్రీ.పూ. 1040 | షిమ్మాష్—షిపాక్ (స్థాపకుడు) |
| 14 | ఆరవ బాబిలోనియా వంశము (2 రాజులు 20సం॥లు) | క్రీ.పూ. 1020 | ఇల్మాష్షాకిన్షమ్ (స్థాపకుడు) |
| 15 | ఏడవ బాబిలోనియా వంశము (1 రాజు 6 సం॥లు | క్రీ.పూ. 1000 | ఈతడు ఎలామియా దేశపురాజు. నామము బాగుగా తెలియరాదు |
| 16 | ఎనిమిదవ బాబిలోనియా వంశము (13 రాజులు) | క్రీ.పూ. 995 | నబూముకిన్ అప్లీ (స్థాపకుడు) నబూఅప్లీ ఇడ్డినా. |
| 17 | తొమ్మిదవ బాబిలోనియా వంశము (5 రాజులు 22సం॥లు) | క్రీ.పూ. 753 | నబూషంఇష్కున్ నబోనసర్ |

| | రాజవంశము | కాలము | ముఖ్యమైన రాజులు |
|---|---|---|---|
| 18 | పదవ బాబిలోని యావంశము (16 రాజులు 106 సం॥) | క్రీ.పూ. 731 | నబూముకింజర్ సెనకెరిబు ఏసర్హద్దాన్ |
| 19 | నూతన బాబిలోని యావంశము (6 రాజులు 87 సం॥) | క్రీ.పూ. 735 | నబోపాలసర్ (స్థాపకుడు) రెండవ నెబుచడ్నెజ్జారు, నెబోనిడస్ |
| 20 | అకామియా (పారసీక ఆక్రమణ 10 రాజులు203సం॥లు) | క్రీ.పూ. 539 | సైరస్, కాంబిసస్ ప్రథమ డేరియస్ ప్రథమ జర్జస్ |
| 21 | యవనులఆక్రమణ (14 రాజులు 192 సం॥లు ) | క్రీ.పూ. 331 | అలెగ్జాండర్ వీరుడు సెల్యూకస్ |
| 22 | పార్థియనుల ఆక్రమణ (27 రాజులు 364సం॥లు) | క్రీ.పూ. 139 | ప్రథమ మిథ్రిడేట్స్ |
| 23 | ససానియనులఆక్రమణ (28రాజులు -10 సం॥ను) | క్రీ. శ. 226 | ప్రథమ అర్దశీరు |

| | రాజవంశము | కాలము | ముఖ్యులైన రాజులు |
|---|---|---|---|
| 24 | అరబ్బుల ఆక్రమణ ఖలీఫాలప్రభుత్వము | క్రీ.శ. 626 | ఉమర్, ముస్తసిమ్ |
| 25 | మంగోలులఆక్రమణ | క్రీ. శ. 1258 | హులాగు, తైమూర్ |
| 26 | పారసీకుల—తురుష్కుల వైరము | క్రీ.శ. 1502 | షాఇస్మాయిల్ (ప్రథమ), సుల్తాన్ సులేమాన్ (ప్రథమ), షాఅబ్బాస్ (ప్రథమ) |
| 27 | తురుష్కుల ఆక్రమణము | క్రీ. శ. 1638-1914 | నాల్గవ మురాద్ ఐదవ మహమ్మద్ |
| 28 | బ్రిటిషు వారి సంరక్షకత్వము | క్రీ. శ. 1914 | |

అస్సీరియా రాష్ట్రము బాబిలోనియా దేశమున కుత్తరమున నున్నది. అస్సీరియా దేశమును పాలించిన ప్రభువులు "అషుర్ లేక అస్సూర" అను కులదైవమును పూజించు చుండిన కారణమున, ఆ దేవత భక్తులయొక్క దేశము అస్సీరియా యని పేరు గాంచెను. ఈ రాష్ట్రములోకూడ టైగ్రిస్ యూఫ్రటీసునదులు ప్రవహించుచున్నవి. బాబిలోనియారాష్ట్ర మీనదీ ప్రవాహములకు తుదిభాగమున నుండుట వలన నచ్చటి భూమి మెత్తగను, సారవంతముగను, వ్యవసాయమునకు మిక్కిలి యోగ్యముగను ఉన్నది. అస్సీరియా రాష్ట్రము కొండలచే నిండియుండుటవలనను, టైగ్రిస్ యూఫ్రటీసు నదు లీ దేశమున నింకను ప్రాథమిక దశయందే యుండుటచేతను నదీ జలముల వలన నీ భూములకు తగినంత సహాయము లభించుటలేదు. ఈ కారణముచే అస్సీరియా రాజ్యమున సారవంతములును, వ్యవసాయయోగ్యములును, అగు భూములు తక్కువగ కాన నగును. నదీ ప్రవాహములు భూమట్టమునకు చాల లోతున ప్రవహించుచుండుటవలన కాలువల ద్వారా నదీ జలములను దేశమునకు తెప్పించి వ్యవసాయాభివృద్ధి కావించుట కవకాశములు తక్కువగానున్నవి. పూర్వకాలమునందు ఈ దేశము వారు పై నదీతీరములలో వ్యవసాయముసాగించుటకై మోటల నుపయోగించి, నేడు మనము మోటబావులనుండి నీటినితోడు కొనునట్లు నదులనుండి నీటిని చేదుకొనెడి వారు.

బాబిలోనియా నాగరతకు వ్యవసాయమే పునాదిగ నుండెడిది. దేశమునందు రాజు లెన్ని పర్యాయములు మారి నను, ఎన్ని యుద్ధములు, విదేశ దండయాత్రలును సంభవించి నను, బాబిలోనియా ప్రజలు మాత్రము వ్యవసాయమునే ముఖ్యజీవనాధారముగ చేసికొని కాలము గడిపిరి. తాము పండించిన వస్తుజాలము నితర దేశములకు పంపుటకును, ఇతర రాష్ట్రములనుండి తమ కావశ్యకములగు వస్తువులు తెచ్చు కొనుటకును వీరు కొంతవరకు వాణిజ్యమునుకూడ సాగించు చుండిరి. ఈ విధముగా బాబిలోనియా ప్రజలు కృషి వాణిజ్య ములయందే విశేషముగ నిమగ్నులై యుండుటచే వారి నాగరకతయందొక విధమగు సౌమ్యతయు, విజ్ఞాన ప్రియత్వ మును కానసగును. బాబిలోనియనులు యుద్ధములయందు విశేషముగ పాల్గొని యుండిసను, శాంతిప్రియు లనియే తెలుపవచ్చును.

అస్సీరియా వారియందు మాత్ర మిందులకు విరుద్ధము లగు లక్షణము కాననగుచున్నవి. వీరి దేశము వ్యవసాయము నకు అనుకూలము కానందున ఇచ్చటి ప్రజలు తమ జీవ నోపాధికై యితరమార్గముల నన్వేషింప వలసిన వారైరి. ప్రథమ దశయందు వీరికి వేటవలన జీవనము గడచెడిది. తరువాత అస్సీరియా వారీ అనాగరక జీవితమునకు స్వస్తి చెప్పి ఖడ్గమును చేతబూని తన చుట్టు ప్రక్కల దేశము లపై దండెత్తి వానిని జయించి అచ్చటి భాగ్యభోగ్య

ములను, ధనధాన్యాదులను తమ ఉపయోగమునకై వినియోగించెడివారు. అస్సీరియా ప్రజలకు యుద్ధమే ముఖ్య వృత్తిగా నుండెనని చెప్పుట సత్యదూరము కాదు. వీరియందు క్షాత్రతేజమును, క్రౌర్యమును కూడ కాన్పించుచుండెను.

అస్సీరియా దేశమునకు ఉత్తరమునను తూర్పునను పర్వత పంక్తులు కలవు గనుక బైటికి కోటవలె దేశమును సంరక్షించుచుండెను. కావున నచ్చటి ప్రజలు విదేశసంచయాత్రలు లేక విశేషము చలించనందున స్వాతంత్ర్యముగను నిర్భయముగను జీవించుచుండిరి. దక్షిణ సముద్రతీరస్థమండలములలో నుండిన కాల్దియాను ప్రజలు కృషీకాయత్తులై బాబిలోనియా నివాసులకంటె ధార్మికులుగను శక్తిమంతులుగను ఉండెడివారు. బాబిలోనియా అస్సీరియా ప్రజలలోం పోలికలకు మిక్కిలి సమీపముగ నుండినను వారియందు భిన్నత్వము ద్యోతకమగు చున్నది. కాని మతము వాఙ్మయము, నాట్యయ శాస్త్రము విజ్ఞాన విషయములు మున్నగు వాని యందు అస్సీరియా ప్రజలకును బాబిలోనియా వారికిని విశేష తారతమ్యము లేదు. అస్సీరియా వారీ విషయములలో బాబిలోనియా ప్రజల ననుకరించి రని తెల్పినను తప్పులేదు. అస్సీరియా ప్రజలు భుజబలసంపదయందు బాబిలోనియా వారికన్న మిన్నగ నుండినను, బుద్ధిబలమందు మాత్రము వారు తమ సోదరులకు తీసికట్టుగనే ఉండిరి. జగత్ప్రసిద్ధి చెందిన రోమక ప్రజలు గ్రీకు దేశమును జయించియు ఆ దేశీయులయొక్క అద్భుత వాఙ్మ

యము, శిల్పకళ, వేదాంతము మున్నగు నంశములను ముగ్ధులై వారినాగరకతను సంపూర్ణముగ నంగీకరించి వైజ్ఞానిక విషయములలో గ్రీకు దేశీయులను తమకు గురువులుగ భావించినట్లే అస్సీరియావారుకూడ బాబిలోనియా రాష్ట్రమును జయించియును వారి నాగరకతా వైభవమునకు దాసోహమ్మని దానినే యవలంబించిరి. శిల్పకళయందు మాత్రము అస్సీరియా వారు నూతన మార్గములను త్రొక్కినట్లు తెలుపబడుచున్నది. అస్సీరియా జాతివారిని ఆసియా జాతి రోమక ప్రజలని వర్ణించుట పరిపాటిగ నున్నది. వీరుకూడ రోము దేశస్థులవలెనే గొప్పవీరులుగను మిక్కిలి యుద్ధ ప్రియులుగను ప్రసిద్ధిజెంది అనేక దేశములను భుజబలముచే జయించి తమ సామ్రాజ్యములో చేర్చుకొనిరి. కాని రోమను ప్రజలలో కాన్పించిన పరిపాలనా నైపుణి వీరిలో కొరవడెను. ప్రతాపముచే జయించిన రాజ్యమును నీతిచే శాశ్వతముగ తమకు లొంగియుండునట్లు వీరు కావించుకొన జాలరైరి. కాని అస్సీరియా సామ్రాజ్య భానుడు నభోమండల మధ్యమున దీపించినంత కాలమును వీరిసైన్యము లజేయములై విలసిల్లెను.

## అస్సీరియా జాతి ఎట్లు ఏర్పడెను?

బాబిలోనియా ప్రజలును, అస్సీరియా ప్రజలును ఒకే జాతికి చెందిన వారు. అరేబియా దేశమునుండి సెమిటిక్ జాతులవారు విదేశములకు వలస పోవుటనుగూర్చి యీవరకే తెలుపబడియున్నది. ఇట్లు వలసవచ్చిన సెమిటిక్ ప్రజలు

కొందరు బాబిలోనియా దేశము నాక్రమించి అచ్చట రాజ్య పాలనము చేయుచున్న సుమేరు జాతివారి యాధిక్యతను క్షీణింప జేసినట్లు మనము తెలిసికొని యున్నాము. బాబిలోనియా దేశమునకు వలస పోయిన సెమిటికు ప్రజలలో మరి కొందరు అస్సీరియా రాష్ట్రముపై దండయెత్తి అచ్చట స్థిర నివాసమేర్పరచు కొనిరి. క్రీ.పూ.24 శతాబ్దియందే అస్సీరియా రాష్ట్రములో సెమిటిక్ ప్రజలు నివసించుచుండినట్లు మనకు నిదర్శనములు కాన్పించుచున్నవి. కాని యీ ప్రజలయందొక విశేషము కానవచ్చుచున్నది. పరదేశముల నుండి అస్సీరియా దేశములోనికి వలస వచ్చిన ప్రజలు, అచ్చటనే చిర కాలము నుండి నివసించు చుండిన స్థానిక జాతులతో కలసి పోవుట వలన నొక ప్రత్యేక జాతి ఈ యుభయుల సమ్మేళనము వలన బయలుదేరెను. ఆ జాతినే అస్సీరియా జాతి యని చారిత్రికులు వర్ణించు చున్నారు. టైగ్రిస్ నదీతీరమున నెల కొనియున్న " అస్సుర " అను అతి పురాతన పట్టణపు ప్రాంతమున భూమిని త్రవ్వించుట వలన కొన్ని చారిత్రిక నిదర్శనములు వెలువడినవి. వీని వలన నీప్రాంతములందతి ప్రాచీన కాలమున కొందరురాజులు పాలించినట్లు తెలియనగుచున్నది. ఈ రాజులు తమ జాతులకు పురోహితులుగను, పాలకులుగను కూడ నుండిరి. వీరి నామములు కూడ సెమిటికు జాతులవారి నామములను పోలుట లేదు. కావున నీ రాజులు ఆనటోలియా కొండలలో నివసించు చుండెడి యొక తెగవారని నిర్ధా

యింప వలసి వచ్చుచున్నది. క్రీ. పూ. 25 వ శతాబ్ది ప్రాంత మున అస్సీరియా ప్రాంతములకు వలస వచ్చిన సెమిటికు జాతు లవారీ ఆనటోలియా పార్వతీయులతో సమ్మేళనము చెందిన ట్లూహించుట పొరపాటు కాదు. బాబిలోనియా యందు నివాస మేర్పరచుకొనిన సెమిటికు ప్రజలలో కానరాని క్రౌర్య మస్సీరియా జాతియందు చూపట్టుటకు కారణము కొండజాతి వారిలో కానవచ్చెడి సహజఘోరత్వము వారికి సంక్రమించుట వలననేమో యని కూడ తలంప వలసి వచ్చుచున్నది.

## ప్రాచీన యుగము

అతి పురాతన కాలములో అస్సీరియా జాతియొక్క స్థితిగతు లెట్లుండెడివో మనకు విశేషముగ తెలియరాకున్నవి. వీరి చరిత్రయందు మనకు తెలియ వచ్చిన ప్రథమ ఘట్టము "అస్సుర్" అను పట్టణముయొక్క నిర్మాణము. ఈ పట్ట ణము టైగ్రిస్ నదీ తీరమున నొక రాతి మెట్టపై నిర్మింప బడెను. కేకియా అను రాజు ఈ పట్టణము చుట్టును కోటను కట్టించి తన నగరమును సంరక్షించు కొనెను. 'ఉష్ప్రియా' అను మరి యొక రాజు అస్సీరియా దేశస్థులకు కులదైవమైన "అస్సుర" యొక్క ప్రతిష్ఠాపనము చేసెను. "ఇతాషూమా" అను మరియొక రాజు కాలములో అస్సీరియా ప్రజలు తమ ధైర్యశ్రీసాహసముల ప్రకటించుట ప్రారంభించిరి. ఈ రాజు కాలములో పశ్చిమ దిశనుండి సెమిటికు జాతులవా రస్సీరియా దందు వెడలి వచ్చిరి. అస్సీరియా వీరులు వీరి నెదిరించి

వెనుకకు తరిమి వైచిరి. బాబిలోనియా రాష్ట్రములో రాజ్య స్థాపనము కావించిన "సుమూ అబూ" రాజు క్రీ.పూ. 20 వ శతాబ్ది యంతమునందు అస్సీరియాపై కూడ నేలెను. కాని అచ్చటి ప్రజల స్వాతంత్ర్య సాహసములను సహింపక ఈ రాజు తనంత తానే వెనుకకు తగ్గవలసి వచ్చెను. బాబిలోనియా రాజులలో మిక్కిలి ప్రఖ్యాతిగాంచిన హమ్మురాబీ యను నాతడు అస్సీరియా రాజ్యమును జయించి తన సామ్రాజ్యమునందు దాని నొక పరగణాగా కావించు కొనెను. ఈ రాష్ట్రమునందు సైన్య వ్యవస్థకై యీతడు కావించిన యేర్పాట్లను తెల్పు కొన్ని చారిత్రికాధారములు నేడు మనకు లభ్యమగు చున్నవి.

హిట్టయిటు లను అనాగరిక జాతులవారు బాబిలోనియా రాష్ట్రము నందలి ప్రథమ రాజవంశమును నాశన మొనర్చిరి. ఆపైన క్రీ.పూ. పదునెనిమిదవ శతాబ్ది పూర్వభాగమున కాస్సైటులను వారు బాబిలోనియా దేశమును వశపరచు కొనినట్లు తెలుపబడినది. ఈ సందర్భమునందు అస్సీరియావారు బాబిలోనియాప్రభువుల యధికారము నంగీకరింపక స్వాతంత్ర్యమును ప్రకటించిరి. ఇదే కాలమున వీరు పర రాజ్యములపై దండెత్తి వాని నాక్రమించు కొనుట కూడ ప్రారంభించిరి. ఈ కాలపు అస్సీరియా రాజులలో "షమ్షీఅదాద్" అను నాతడు గొప్ప వీరుడుగా శాసించు చున్నాడు. ఈతనిచే నాటింపబడిన జయ స్తంభ మొకటి అస్సుర్ పట్టణమున

గా నవచ్చినది. ఈ శాసనమునందీ రాజుయొక్క వంశముకాని, తుని తండ్రిపేరు గాని, లిఖింపబడ లేదు. కాని ఈ రాజు సగర్వముగ తాను "భూమండలాధిపతి"నని వర్ణించు కొని యున్నాడు. ఈ జయ స్తంభము "మహార్ణవ తీరము" న చెక్కింప బడినట్లు కూడ అందుదహరింపబడినది. ఈ మహా ర్ణవము బహుశః నల్లసముద్ర మేమో యని యూహింప వచ్చును. ఈ యాధారముపై షమ్షీఅదాద్ రాజు తన సైన్యముల నుత్తర దిశకు నడిపించి అర్మీనియా కొండల నుండి నల్ల సముద్రము వరకు నడిపించి ఆయా దేశములను జయించి నట్లు తలంప వచ్చును. కాని అస్సీరియాకు దక్షిణమున నున్న బాబిలోనియా రాజ్య మింకను బలవత్తరముగా నుండిన కారణ మున అస్సీరియా ప్రభువులు తమ పొరుగు రాజ్యముతో స్నేహముగ నుండ జొచ్చిరి. వీరు తమ తమ రాజ్యముల పరిహద్దులను నిర్ణయించు కొనుచు నొక సంధికూడ కావించు కొనిరి. ఈ కాలమునందు మిటాని అను మరియొక రాజ్యము కూడ మిగుల ప్రబలముగా నుండెను. ఈ రాజ్యము మెసొ పొటేమియా యందలి ఉత్తర ప్రాంతమున స్థాపితమయ్యెను. ఈ మిటానిరాజు ప్రబలుడై అస్సీరియా రాజ్యమందలి యుత్తర ప్రాంతము నాక్రమించి, నైనివా పట్టణము నందలి 'ఇష్టార్' దైవము యొక్క విగ్రహమును గొనిపోయి దానిని ఈజిప్టు ప్రభువులకు కానుకగా నొసంగెనట. ఇట్టి యాచా రము లాకాలమున వాడుకలో నున్నట్లు తోచు చున్నది.

ఏ రాజ్యము నడిచి విగ్రహము లైనను స్వదేశమునకు [illegible] పోయి, ఆ విగ్రహమును ప్రజలచే పూజింపజేసినచో [illegible] తమకు శుభము కల్గునని ఆ కాలము నాటి ప్రజలు [illegible] చుండిరి

### అస్సీరియా రాజ్యము బలపడుట

మిటాని రాజ్యము త్వరలోనే క్షీణించి నందున అస్సీరియా ప్రభుత్వము బలవత్తర మయ్యెను. అస్సీరియా రాజులు బాబిలోనియా ప్రభువులతో వివాహ బాంధవ్యమును కూడ నెరపిరి. కాని ఈ రాజ్యముల నడుమ స్నేహభావము కంటె విరోధమే తరచుగ నుండెడిది. అస్సీరియా రాజు [illegible] పశ్చిమ దిక్కునకు దండయాత్రలు సాగించి అనేక పట్టణములను జయించిరి. ఇట్లు దిగ్విజయము చేసిన వారిలలో షాల్ మొనాసిర్ అను రాజు మిక్కిలి ప్రసిద్ధి గాంచెను. ఇతడు అనేక పట్టణములను జయించెను. అస్సీరియా దేశమునకు కులదైవతముగు 'అస్సుర' దేవుని పక్షమున తామీ దిగ్విజయమును సాధించినట్లు వీరు తలంచు చుండిరి. కాని అస్సీరియా ప్రభువులు తమ దండయాత్రలలో మిక్కిలి క్రౌర్యమును చూపెడివారు. అరీనా అను పట్టణమువారు తనను చిరకాల మెదిరించి పోరాడిరను కోపముతో షాలుమొనాసిరు రాజు ఆ పట్టణమును జయించిన మీదట, దానిని నాశనముచేసి అచ్చట ఉప్పు చల్లించి, కొంత మట్టిని తనతో కూడ రాజధానికి కొని పోయెను, తన తన రాజధానిని చేరిన తరువాత సింహద్వారము

కొన్ని నిలువబడి నా శత్రువుల సంహరించి ఈ విధముగ మట్టి చేసితిని చూపుటకో అన్నట్లు ఆ మట్టినంతయు తన చేతుల తోనే ఈ రాజు ఎగుర పోసెను. తన రాజ్యము బలపడిన కారణమున నీ ప్రభువు రాజధానిని అషుర్ పట్టణమునుండి మార్చి టైగ్రిసు నదీతీరమున ఇరువదిమైళ్ళ యెగువ నున్న "కాలా" పట్టణమునకు మార్చి అచ్చట గొప్ప రాజమందిరములను కోటను కట్టించెను. షాల్ మెనాసిర్ కుమారుడు "టుకుల్టినినిబు" అనువాడు. ఈతనుకూడ తండ్రివలెనే గొప్ప వీరుడు. ఈ రాజు బాబిలోనియా రాజ్యమును జయించి ఏడు సంవత్సరములపాటు ఆ సింహాసన మధిష్ఠించెను. కాని యీ గౌరవ మాతనికి చిరకాలము దక్కలేదు. బాబిలోనియావారు మరల తిరుగుబాటు చేసి అస్సీరియా సైన్యములను తమ దేశమునుండి వెడల నడచిరి. "టుకిల్టినినిబ్" రాజు ప్రజలలో పలువురకనిష్టుడైనందున ఆతని కుమారుడే అతనిని చంపించెను.

అస్సీరియా రాజ్యము యొక్క వైభవము తరచు మార్పులకు లోనగు చుండెడిది. కొంత కాలము పాటు వీరి ప్రభుత్వ మున్నత స్థితియందును మరికొంత కాలము క్షీణదశ యందు నుండసాగెను. ఈ కాలమున అనటోలియా కొండల నుండి అనాగరక జాతులవారు అస్సీరియా సామ్రాజ్యముపై దండెత్తి పూర్వ రాజులు జయించిన యనేక భాగములను వశపరచు కొనిరి. ఈ కారణమున అస్సీరియా రాజ్యము మిక్కిలి సంకుచితమై తన సహజమగు సరిహద్దులకే కట్టుబడి

యుండవలసి వచ్చెను. ఈ కాలములో కూడ కొందరు అస్సీరియా రాజులు తమ సామ్రాజ్యమును విస్తరింపజేసి కాపాడుకొనుటకై ప్రయత్నములు చేసిరి. బాబిలోనియా రాజులు ప్రభను కొనసాగించిరి, అస్సీరియా ప్రభుత్వము మూడు పర్యాయము లోపించెను. కాని అస్సీరియా రాజ్యము యొక్క పూర్వ వైభవమును పునరుద్ధరించిన వాడు ప్రసిద్ధ టిగ్లాథ (థిలాసిర్ క్రీ. పూ. 1120) అను వాడు. ఇతని కాలమునం దస్సీరియా సైన్యములు మిక్కిలి దూర ప్రాంతములకు దండెత్తి పోయి తన శౌర్యమును ప్రదర్శించెను. ఈ రాజు మొట్టమొదట తన రాజ్యమునకు సమీపమునందున్న ఆనటోలియా కొండలయందలి అటవిక జాతుల వారిని జయించి వారాక్రమించిన ప్రాంతములను మరల తన రాజ్యములో కలుపుకొనెను. అటుపిమ్మట యూఫ్రెటీసు నదిని దాటి మధ్యధరా సముద్రము వరకు గల దేశములన్నిటిని జయించెను. ఈ రాజు గొప్ప వీరుడు మాత్రమే కాదు. ఇతనికి వేటయందు మిక్కిలి ఆసక్తి యుండెడిది. ఇతడు స్వయముగా అనేక సింహములను, అడవిదున్నలను, ఏనుగులను చంపెనట. మధ్యధరా సముద్రమును సమీపించిన మీదట నీతడు జలచరమగు నొక గొప్ప క్రూర మృగమును చంపెనట్లు గాథలు కలవు. ఇట్టి యనన్య సామాన్య సాహసమును, పరాక్రమమును కలిగి యుండుటచే టిగ్లాత్ యొక్క కీర్తి దూరదేశములకు వ్యాపించెను. ఈ రాజు

సిరియా దేశమునందున్నప్పుడు, ఆ విషయ మెఱింగి ఈజిప్టు చక్రవర్తి యీతనికి ఒక నీటి గుఱ్ఱమును, మొసలిని కానుకగా పంపెనట. టిగ్లాథు రాజునకు వేటయందు చాల ప్రీతి యని యెఱింగియే యిట్టి అపూర్వ బహుమానములు పంపబడి యుండవచ్చును. టిగ్లాథు రాజు మధ్యధరా సముద్రము వరకు గల దేశమును జయించిన మాట వాస్తవమే కాని యీతడీ విశాల భూభాగమును తన యధికారములోనికి కొని వచ్చుటకై యెట్టి శ్రద్ధయును చూపలేదు. ఇచ్చటి ప్రభువుల కడనుండి ఈ రాజు కప్పములను గైకొను చుండెడివాడు. ఒక వంక నీతడు పశ్చిమోత్తరము నందు యుద్ధములలో నిమగ్నుడై యుండగా అదను చూచి బాబిలోనియా రాజు అస్సీరియాపై దండెత్తి అచ్చటి దేవతా విగ్రహములను కొల్లగొట్టుకొనిపోయిరి. నాలుగు వందల సంవత్సరములు గడచిన వెనుక సెన్నాచరబు అను అస్సీరియా రాజు బాబిలోనియా పై దండెత్తి తమ దైవతములను చెరనుండి విడిపించి మరల స్వదేశమునకు గొని వచ్చెనట. తన కీర్తిని నిలువ బెట్టుకొనుటకై టిగ్లాథు పీలాసర్ రాజు బాబిలోనియా రాజ్యముపై దండెత్తి అందలి ఉత్తర ప్రాంతమును తన రాజ్యములో కలుపుకొనెను. మొత్తముమీద టిగ్లాథు పిలాసర్ రాజు అస్సీరియాను పరిపాలించిన సుప్రసిద్ధ ప్రభువులలో నొకడని నిస్సంశయముగా తెలుపవచ్చును. ఈతని యనంతరము రాజ్యసింహాసన మధిష్ఠించిన వారెవ్వరు నీతని వలె రణకుశలురును,

పరాక్రమ వంతులును కారు. టిగ్లాథు పిలాసెర్ రాజు కుమారుడు బాబిలోనియా ప్రభువులతో స్నేహభావముతో ప్రవర్తించుటయేగాక ఆ దేశపు రాజకుమార్తెను వివాహ మాడెను. ఈ కాలమున "అరామియా" దేశపు చెందిన అనాగరిక ప్రజలు బాబిలోనియా అస్సీరియా రాజ్యములపై దండెత్తి వచ్చి ఆ దేశముల నల్లకల్లోలము కావించిరి. టిగ్లాథుపిలాసెర్ రాజు జయించిన ప్రాంతము లన్నింటిని అస్సీరియా వారు కోల్పోయిరి. ఈ విధముగా అస్సీరియా రాజ్యముయొక్క ఔన్నత్యము నందలి ప్రథమ దశ యంతరించెను.

### అషుర్ నసిర్ పాలు

క్రీ. పూ. తొమ్మిదవ శతాబ్ది ప్రారంభమున అస్సీరియా రాజ్యము మరియొక పర్యాయము విజృంభించెను. మూడవ అదాద్ నిరారి అను రాజు కాలములో ఈ పునరుద్ధరణము ప్రారంభించెను. ఈతడు బాబిలోనియా దేశీయులతో యుద్ధములు కావించి ఇద్దరు రాజుల నోడించెను. కాని ఆ పైన అస్సీరియా బాబిలోనియా రాజులు వివాహ బాంధవ్యముసుకూడ నెరపినట్లు తెలియు చున్నది. ఈతని కుమారుడగు రెండవ టుకల్టినినిబు అను నాతడు కూడ గొప్పవీరుడు. ఈ రాజు మెసపొటేమియా యందలి పశ్చిమ ప్రాంతముపై కి దండెత్తి ఆ ప్రాంతమును జయించెను. ఈతని కుమారుడు మూడవ అషుర్ నసిర్ పాలు అను ప్రభువు. అస్సీరియా చరిత్ర యందు గొప్ప ప్రఖ్యాతి గాంచెను. ఈ రాజు క్రీ. పూ.

884 నుండి 859 వరకును రాజ్యపాలనము చేసెను. అషుర్ నసిర్ పాలు యూఫ్రటీసు నదిని దాటి సిరియా రాజ్యమును ప్రవేశించి అచ్చటి రాజుల నెల్లరను జయించెను. ఈతని సైన్యములు మధ్యధరా సముద్రము వరకును నిరాఘాటముగ సాగిపోయెను. అస్సీరియా జాతివారి క్రౌర్యమును గూర్చి యీవరకే సూచింప బడినది. అషుర్ నసిర్ పాలు తన శత్రువులతో వ్యవహరించిన పద్ధతుల వలన నీ విషయము సంపూర్ణముగ వ్యక్తమగు చున్నది. ఈ రాజు తన దండయాత్రలను గురించియు, తాను శత్రువులపై జరిపిన క్రూరహింసలనుగూర్చియు వివరముగ తెలిపి యున్నాడు. " నేను ఆ పట్టణమునుజయించి అందలి సైనికుల కెల్లరకును శిరచ్ఛేదనము కావించితిని; నేను కొందరిని మాత్రము బందీలుగా గైకొని, మిగిలిన వారిని కాల్పించితిని. తెగగొట్ట బడిన శిరస్సులను, కొందరి మృతకళేబరములను కూడ నేను పట్టణ ద్వారము కడ వ్రేలాడ గట్టించితిని. ఏడువందల మందిని శూలారోపణకు గురి కావించితిని. అచ్చటి యువకులను, పడుచులను, నేను మంటలలో కాల్పించి వారి పట్టణమును పరశురామ ప్రీతి చేశితిని. " ఇట్టివర్ణనలు అషుర్ నసిర్ పాలు కావించిన దిగ్విజయ వర్ణనలయందు మిక్కిలిసామాన్యములగు నంశములు. ఈతనితో యుద్ధము కావించిన శత్రువులలో రణరంగమున కూలినవారె యదృష్టవంతులని చెప్పవలెను. తనతో నెవ్వరైన పట్టుదలతో పోరా

పాలుచే నిర్మింపబడిన రాజు ప్రాసాదమునందలి విచిత్రములును, పాలుమెనాసిరు రాజుకు విదేశీయులకు ప్రభువులు కప్పముకట్టు చిత్రములును నేడు మనము చూడవచ్చును. 'బాలావత్' అను గ్రామము సమీపమున అస్సీరియా రాజ్యమునకు సంబంధించిన కంచు ద్వారములు లభించినవి. ఇయ్యవి అపూర్వనిర్మాణము లని నేడు పొగడ్త గాంచుచున్నవి. ఈ కంచు తలుపులు నిజమునకు కర్ర తలుపులపై పరుప బడిన సన్నని కంచు రేకు మాత్రమే యని తెలియ నగుచున్నది. ఈ ద్వారములు పాలుమెనాసిరు రాజుయొక్క ప్రాసాదమునందలివి కవాటములు. ఈ కంచు రేకును మిక్కిలి నేర్పరితనముతో ఆ కాలపు పనివారు బహువిధము లగు చిత్రము లేర్పడునట్లు మార్చిరి. ఈ చిత్రముల వలన పాలుమెనాసిరు రాజు అర్మీనియా దేశముపై కావించిన దండయాత్రల వృత్తాంత మంతయు స్పష్టముగా తెలియ నగును. ఈ పాలుమెనాసిరు ప్రభువు సిరియా జాతి వాడు. హిట్టైయిటులు మున్నగు పలువురతో యుద్ధములు కావించి జయలక్ష్మిని వరించెను. పైన చెప్పబడినకంచు రేకుల మీద అస్సీరియా వారు తమ రథములలో కొండలు దాటు చున్నట్లును, ఇంజనీయరులు నదులపై వంతెనలు కట్టుచున్నట్లును సైన్యములు విడిసిన ప్రదేశముల కట్టుదిట్టముగా శిబిరము లేర్పరచు చున్నట్లును, అస్సీరియా సైన్యములు తమ తమ యుద్ధ సాధనములతో శత్రుసైన్యముల దాకుచున్నట్లును చిత్రింపబడి యున్నవి. వీరికి శత్రువులగు ఆటవిక జాతులవారి

అనాగరక వేషములను, యుద్ధ పద్ధతులను, అనేకసంవత్స పాలు కాలములో కష్టముల కోర్చి కాపాడిన ప్రాచ్యవిధాన ములను కూడ మన మీ లేఖలవైపు చిత్రించబడి యుండుట గమనింప వచ్చును.

కాని అస్సీరియా వారి వైభవము చిరకాలము నిలువ దయ్యెను. మూడవ షాలుమనాసరు రాజు మరణానంతరము వీరి రాజ్యము మరల క్షీణించెను. అస్సీరియా సామ్రాజ్య విషాద పర్యాయము క్షీణదశ చెందుటకు కారణము అస్సీరియా కొండలలో యురార్టు అను ప్రాంతమునందలి అనాగరిక జాతి వారి విజృంభణము. వీరు నానాటికిని బలవత్తరులై అస్సీరియా రాజ్యముపై దాడులు కావింపసాగిరి. ఈ రాజ్యము నందలి యనేక భాగములు సామ్రాజ్యమునుండి వేరుపడి పోయెను. అస్సీరియా రాజ్యముయొక్క ఉత్తర ప్రాంతముల కపాయదశ ప్రాప్తించెను. ఈ విధముగా అస్సీరియా సామ్రాజ్య చరిత్రయందలి ద్వితీయ ఘట్టము ముగియుచున్నది.

ఉచ్ఛదశ

క్రీ. పూ. ఎనిమిదవ శతాబ్ది మధ్యభాగమున అస్సీరియా సామ్రాజ్యము మరల తలయెత్తుచున్నది. క్రీ. పూ. 746 సంవత్సరమును అస్సీరియారాజ్యమునకు రాజధానియైన కాలా పట్టణమున సైనిక విప్లవము చెలరేగెను. రాజైన అషుర్ నిరారి అను వానిని సింహాసనమునుండి తొలగించి ఆతని సేనానాయకుడు టిగ్లాథ్ పిలాసిర్ అనుబిరుదుతో రాజయ్యెను.

చిరకాలమునుండి టిగ్లాత్ పిలాసిర్ అనునామము మహోన్నత్యమునకు చిహ్నముగా నుండుటవలన నూతనముగా రాజైన సేనానాయకుడీ బిరుదమును వహించుటలో ఆశ్చర్యములేదు. ఈ రాజు మొట్టమొదట బాబిలోనియాపై దండెత్తెను. తనరాజ్యమునకు దక్షిణ ప్రాంతము నుండి యెట్టి యపాయమును సంభవింపకుండునట్లు చూచుకొనుటయే యీతని లక్ష్యము. ఈ దండయాత్రయందు బాబిలోనియా రాజు అస్సీరియావారికి లోబడి ఆరాజ్యమునకు సామంతునుగా నుండుట కంగీకరించెను. ఆపైన టిగ్లాత్ పిలాసర్ రాజు అస్సీరియాకు చిరకాలమునుండి బద్ధ శత్రువులుగానున్న అర్మీనియా దేశపు రాజులతో యుద్ధము ప్రకటించెను. యురార్టూ ప్రాంతమును పాలించుచున్న రాజు అస్సీరియా వారికి ముఖ్య శత్రువు. కావున టిగ్లాత్ పిలాసిర్ ఈ రాజుయొక్క రాతిదుర్గమును తుసుప్పా అను దానిని ముట్టడించెను. కాని యీ దుర్గము దుర్భేద్య మయ్యెను. కావున దుర్గమునకు చుట్టుప్రక్కలగల ప్రాంతమును జయించి దుర్గసమీపమున తన జయస్తంభమును నెలకొల్పి ఈ అస్సీరియా రాజు మరలి పోవలసిన వాడయ్యెను. కాని తుసుప్పా దుర్గమునకు చుట్టుప్రక్కల నున్న దేశమంతయు నాశనము కావింపబడినందున యురార్టూ రాజు యొక్క బలము క్షీణించెను. చాల సంవత్సరములవరకును ఆతడు అస్సీరియా రాజ్యమున కెట్టి హానిని కలిగింప నసమర్థుడయ్యెను. ఈ విధముగా

దక్షిణోత్తరములందు [illegible] రాజ్యమున [illegible] అపాయము లేకుండునట్లు కాపాడుకొని [illegible] రాజు మధ్యధరా సముద్రతీరము [illegible] రాజ్యము [illegible] ప్రసరించెను.

ఈ కాలములో ఇశ్రాయేల్, జూడా అను రెండు యూదు రాష్ట్రములు ప్రబలియుండెను. ఈ రాజ్యముల పరస్పర సఖ్యత లేనందు వలనను, రాజ్యములలోనే అంతర కలహము లుండుటవలనను టిగ్లాత్ పిలాసర్ రాజునకు ఈ రాజ్యముల యాంతరంగిక విషయములలో కలుగజేసుకొను అవకాశము కలిగెను. క్రీ.పూ. 735 వ సంవత్సరమున ఇశ్రాయేల్ రాష్ట్రమునకు రాజైన [illegible] అహాజు అస్సిరియారాజు సహాయమునుకోరి అందులకు ప్రతిఫలముగా కప్పమును కట్టుటకు అంగీకరించెను. మరికొంతకాలమైన పిమ్మట జూడా రాజ్యముకూడ నిదేవిధముగా అస్సిరియా ఆధిపత్యము నంగీకరించెను. కాని పాలస్తీనా దేశమునందలి మరికొన్ని ప్రాంతముల వారు డెమాస్కస్ రాజు సహాయముతో టిగ్లాత్ పిలాసర్ నెదిరించిరి. కావున నితడు పాలస్తీనాపై దండెత్తి పోయి తన శత్రువులను సంపూర్ణముగా పరాభవించెను. ఈ సందర్భమునందే అస్సిరియా వారు ఇశ్రాయిల్ రాష్ట్రమునందలి కొన్ని జిల్లాలను, గెలిలీ, నెప్తాలి మున్నగు వాని నాక్రమించి అచ్చటిప్రజలను ఖైదీలుగ నిర్బంధించి తమ దేశమునకు గొని పోయిరి. డెమాస్కస్ పట్టణమువారు తన్నెదిరించి యుద్ధము

చేసిన కారణమున టిగ్లాత్ పిలాసిర్ రాజు రెండుసంవత్సరముల వరకు నీ కోటను ముట్టడించి తుదకు దానిని స్వాధీనపరచుకొనెను. ఇచ్చటి ప్రజలను తనరాజ్యమునకు బందీలుగా కొనిపోయెను. అస్సీరియా రాజ్యముయొక్క సామర్థ్యము నొకపర్యాయము చవిజూచియును పాలస్తీనాయందలి రాజు లూరకొనలేదు. ఈ కాలమునందు ఈ జిప్టు దేశమున నొక నూతన రాజవంశము స్థాపిత మయ్యెను. ఈ రాజులు పాలస్తీనా దేశమునెట్లయిన తమ యధీనములోనికి తెచ్చుకొనవలయు నను ఉద్దేశ్యముతో నిచ్చటి రాజుల నస్సీరియా ప్రభుత్వముపై తిరుగుబాటు చేయుటకు ప్రోత్సహించిరి. ఈజిప్టు రాజుల సహాయము తమకు లభించు నను ధైర్యముతో ఇజ్రాయిల్ రాజును, టైర్ ప్రభువును అస్సీరియా ప్రభుత్వముపై కుట్రలు సాగించిరి. అస్సీరియా రాజగు సారగాన్ అనునాతడు క్రీ. పూ. 722 నందు పాలస్తీనాపై దండెత్తి అచ్చటి రాజుల నోడించుటయేకాక రెండు సంవత్సరముల తరువాత నచ్చటి ప్రజలను చెరపట్టి విదేశములకు పంపివేసెను. బాబిలోనియా రాజ్యమునుండియు, అస్సీరియా సామ్రాజ్యము నందలి యితర ప్రాంతములనుండియు, ప్రజలనిచ్చటికి గొనివచ్చి వారికి పాలస్తీనమునందు నివాస మేర్పరచెను.

### రాజనీతి

పురాతన కాలమునం దస్సీరియా రాజులు తాము జయించిన దేశములలోని ప్రజలను బందీలుగా కావించి ఇతర ప్రాంత

ములలో వారిని బానిసలుగ విక్రయించుచుండిరి. కాని నాల్గవ టిగ్లాత్ పిలాసర్ రాజొక నూతన పద్ధతి నవలంబించెను. తన సామ్రాజ్యములోని కేదైన నూతన రాష్ట్రము చేర్చబడిన యెడల నీ రాజా ప్రాంతములోని ప్రజలలో సగము మందిని చెరపట్టి యితర దేశములకు పంపివేసెడివాడు. ఇతర దేశపు ప్రజలను కొందర నీ దేశమునకు గొని వచ్చి వారి కిచ్చట నివాస మేర్పరచుచుండెను. ఇట్లు చేయుట వలన నూతనముగ జయింపబడిన దేశము తిరుగుబాటును చేయకుండ సామ్రాజ్యమునందణగి మణగి యుండుననివారి యభిప్రాయము. ఒక దేశమునుండి సగభాలు ప్రజలను విదేశములకు నిర్బంధముగ పంపివేచినయెడల నా దేశముయొక్క శక్తి క్షీణించును. నూతనముగ నితర ప్రాంతములనుండి వచ్చి యీ దేశములో స్థిరనివాస మేర్పరచుకొనిన వారికిని స్థానికులకును సహజముగా విరోధముండును. కావున నీనూతన ప్రజలు తమకు పాలకులగు అస్సీరియా వారిపైననే ఆధారపడవలసి వచ్చును. ఈ విధముగా పాత దేశములయందు ప్రజానీకములో నైక్యత స్నేహాభావము నశించును. రాజనీతియందు వర్ణింపబడిన సామాద్యుపాయములలో నీ భేదోపాయము యొక్కటిగదా!

ఈ సూత్రము వలన నస్సీరియా సామ్రాజ్యము కొంత కాలము వరకు నెట్టి భయమును లేక వర్థిల్లెను. కాని కాలక్రమమున నీ భేదాత్మక రాజనీతి వారి క్షీణతకు కారణమయ్యెను. ఒక దేశము వారిని విదేశములకు పంపి వైచి

సంమన వారు నూతన దేశముపై నెట్టి యభిమానములేక దానియభివృద్ధికై పాటుబడక తటస్థ భావమును వహించి యూరకుండెడివారు. స్వదేశీయులు నిరుత్సాహము వలన దేశాభివృద్ధికై యే విధముగను తోడ్పడ జాలరైరి. ఈ కారణములచే నస్సీరియా సామ్రాజ్యము నందలి పెక్కు దేశములు వ్యవసాయములనుగాని చేతి పనులచేకాని తమ జాతీయ సంపదను పెంపొందింప జాలకపోయెను. ఇట్లు దేశ సౌభాగ్యము ఆర్థికజీవితమును క్షీణించినందువలన కొంతకాలమున కీ ప్రాంతములు సామ్రాజ్యమునకు లాభదాయకములగుటకు మారు గుదిబండలవలె సామ్రాజ్యమును క్రుంగదీయ జొచ్చెను.

పాలస్తీనమునందలి రాజులను జయించిన వెనుక అస్సీరియా రాజగు సారగాన్ (క్రీ.పూ. 722-705) ఈజిప్టు ప్రభువునుకూడ పరాభవించి మరల తన దేశమునకు వెడలి పోయెను. బాబిలోనియా రాజ్యమింతవరకు నస్సీరియా వారికి మిత్రరాజ్యముగా నుండెడిది. బిట్‌యాకిన్ ప్రాంతపు కాల్డియా రాజొకడు బాబిలోనియాకు తూర్పున నున్న ఎలామ్ రాజ్యమువారి సహాయముతో బాబిలోనియాపై దండెత్తి తన్నెదిరించిన అస్సీరియా సైన్యముల నోడించ తరిమివైచెను. బాబిలోను ప్రజలు బిట్‌యాకినును తమ రాజుగా నంగీకరించిరి. ఎలామ్ రాజ్యమువారి నస్సీరియా వారి సామ్రాజ్యము దినదినాభివృద్ధిగావించుట యిష్టములేక కాల్డియా ప్రభువును

ప్రోత్సహించి యీ విధముగ కస్సైటులకు పరాభవము కల్గించిరి. ఈ కాస్సైటుల ప్రభవము అస్సీరియాకు ప్రక్కలో బల్లెమువలె నుండి పోయెను. కాని సారగాన్ రాజు కొంత కాలమువరకు నీ సరాకీన ప్రభువు నెదిరించక యూరకుండెను. అస్సీరియా రాజ్యమునకు పశ్చిమోత్తరమున నున్న యురార్టూ ప్రజల వలన తమకు చిరకాలమునుండి అపాయము కలుగుచుండి నందువలన మునుముందు వీరినణచి వేయుట ముఖ్యమని తలంచి సారగాన్ రాజు వీరితో యుద్ధముచేసి వీరి రాజ్యమును తన సామ్రాజ్యములో చేర్చుకొనెను. ఆపైన నితడు తన దృష్టిని బాబిలోనియావైపు మరల్చి బిట్ యాకిన్ను యుద్ధరంగమున నోడించి బాబిలోనియా రాష్ట్రమును వశపరచుకొనెను. ఏడు సంవత్సరములవరకు నితడు బాబిలోనియా రాజ్యముపై పరిపాలన చేసినట్లుకూడ నిదర్శనములు కలవు. ఇప్పు డస్సీరియా రాజ్యము మధ్యధరా సముద్రమువరకును వ్యాపించి నందున నిచ్చటి ప్రజలకు అయోనియాదేశపు నీటి దొంగల వలన తరచు నష్టము సంభవించుచుండెను. ఈ నీటి దొంగలను శిక్షించుటకై సారగాన్ రాజు ఫొనీషియావారి సహాయమును పొంది, వారి నౌకలతో నీ దొంగల గుంపు నాక్రమించి వారి నావలను నాశనము చేసెను. చేపలను నీటినుండి బయటకు లాగినట్లుగా తాను అయోనియా చోరులను శిక్షించితి నని సారగాన్ రాజు సగర్వముగ చాటుకొనెను.

## శిల్పకళాభివృద్ధి

ఈ సారగాన్ రాజు కాలములో శిల్పకళాభివృద్ధి మిక్కుటముగా జరిగె ననుటకు నిదర్శనములుగలవు. అస్సీరియా యందలి శిల్పుల కితర దేశీయుల శిల్పవిద్య నెరుంగుట కీ యుగమునం దవకాశములు లభించెను. సారగాన్ రాజు నూతనముగా నొకపట్టణము కట్టించెను. అస్సీరియా రాజధానియగు నైనివాపట్టణమునకు తూర్పున కొన్ని మైళ్ళదూరమున "దూర్ షరూకిన్" అను ఈ నగరము వెలసెను. సారగాన్ ప్రభువుదీనిని తన రాజధానిగా చేసికొనెను. ఈ నూతననగర నిర్మాణము నందును రాజప్రాసాదమునందును శిల్పులు తమనైపుణ్యమును విరివిగా ప్రకటించిరి. రాజభవన ద్వారమున రెండు బ్రహ్మాండమైన ఎద్దులును, ఇతర పౌరాణిక విగ్రహములును నెలకొల్పబడెను. సారగాన్ కుమారుడగు సెన్నాచరబ్ కాలములో నైతము శిల్పకళాభివృద్ధి చక్కగాజరిగెను. ఈరాజు నైనివానగరమును పునర్నిర్మాణము కావించెను. ఈతని కాలములో నైనివానగరముచుట్టునుగల కోటయు, రాజభవనములునుకూడ మరల నిర్మింపబడెను. రాజనగరును నిర్మించుటకు ప్రథమమున మిక్కిలి యెత్తయినయొక పెద్దవేదిక తయారయ్యెను. అతి విశాలమగు నావేదికపై సెన్నాచరబ్ రాజు తనప్రాసాదమును కట్టించెను. ఈప్రాసాదములు మిక్కిలి ఉన్నతముగను, విశాలముగనుండెడివి. మందిరముల గోడలపై చిత్రకారులును, శిల్పులును తమ నైపుణ్యమునంతను ప్రకటించి వివిధ మృగములను

ఆనాటి చరిత్రయందలి ముఖ్యఘట్టములను చిక్కిలి మనోజ్ఞముగా చిత్రించిరి. పట్టణము చుట్టునుగల కోటబురుజులను నీ రాజు చిక్కిలి బలపరచెను. ఈకోటయందు పదునైదు ద్వారము లుండెడివట. నైనివానగరము టైగ్రిస్‌నది తీరమున నుండెడి దని యీవరకే తెలుపబడియున్నది. అస్సీరియాసామ్రాజ్యము క్షీణించు నంతవరకును కూడ నీ నగరమే రాజధానిగా విలసిల్లెను.

సెన్నాచరబ్ - అతని కుమారుడు క్రీ. పూ. (705-681)

క్రీ. పూ. 705 సంవత్సరమున సారగాన్ రాజు మరణించుటవలన నాతని కుమారుడగు సెన్నాచరబ్ సింహాసన మధిష్ఠించెను. ఈతడు రాజ్యసూత్రములు గ్రహించిన కొలదికాలములోనే సామ్రాజ్యమునందెల్లెడల తిరుగుబాటులు ప్రారంభించెను. ఇట్లు తిరుగుబాటుచేసిన రాష్ట్రములలో బాబిలోనియా మొట్టమొదటిది. ఆపైన సిరియాపాలస్తీనములుకూడ అస్సీరియా ప్రభుత్వముపై తిరుగబడెను. సెన్నాచరబ్ మొదట బాబిలోనియా రాజ్యమునందలి యల్లరుల నణచివైచి ఆపైన సిరియా పాలస్తీనములపై దండయాత్ర సాగించెను. ఈజిప్టు రాజు తిరుగుబాటుచేసిన రాష్ట్రముల సహాయమునకై కొంత సైన్యమును పంపెను. ఎల్టెకీయను ప్రదేశమున సెన్నాచరబ్ ఈజిప్టు సైన్యములను పూర్తిగానోడించెను. క్రమక్రమముగా అన్ని ప్రాంతములయందును తిరుగుబాటు లడగిపోయెను. పాలస్తీనమునందలి జెరుసలేమ్ పట్టణమును తనకు

వశపరుప వలసినదని సెన్నాచరబ్ జుడారాష్ట్రమునకు రాజైన హెజకీయాకు వర్తమాన మంపెను. ఈ రాజు మొట్టమొదట అస్సీరియావారికి వశ్యుడై కప్పమును కట్టియుండెను. కాని జెరుసలేమ్ పట్టణమునుమాత్రము వశపరచుట కిష్టపడక యెదురు తిరిగెను. ఈ అవిధేయత కాతనికి కఠినమగు శిక్ష లభించియుండెడిదే. కాని యింతలో అస్సీరియాసైన్యములలో మహామారి బయలుదేరి యల్లకల్లోలము కావించినందున సెన్నాచరబ్ పాలస్తీనమునుండి తన సైన్యములను మరలింప వలసిన వాడయ్యెను.

ఎలామియారాష్ట్రమువారి సహాయముతో బాబిలోనియా వారు తనపై పలుమారులు తిరుగుబాటు చేయుట సహింప జాలక సెన్నాచరబ్ రాజు బాబిలోనియా రాజ్యమను పూర్తిగా నాశనము చేయవలెనని నిశ్చయించుకొనెను. ఇందులకు ప్రాతి పదికముగా నీతడు కాల్డియా రాజు నోడించెను. ఈ కాల్డియా ప్రభువు తలదాచుకొనుటకు బాబిలోనియా యందలి దక్షిణ ప్రాంతపు భూములలోకి పారిపోయెను. బాబిలోనియాకుముఖ్య మిత్రుడైన ఎలామ్‌రాజు క్రీ. పూ. 689 వ సంవత్సరమున మరణించెను. బాబిలోనియా నగరమును సంపూర్ణముగా నాశనము కావించు నుద్దేశ్యముతో సెన్నాచరబ్ రాజు యూఫ్రటీసు నదీ ప్రవాహముల నీ నగరమువైపు మరల్పించెనని యీవరకే తెలుపబడినది. ఈ యపూర్వ పద్ధతి వలన బాబిలోను నగరములో చాల భాగము నశించెను. కొంతకాలమువరకును బాబి

లోనియాలో అరాజకత్వమేర్పడెను. క్రీ. పూ. 681 వ సంవత్సరమున సెన్నాచరిబ్ రాజు తన కుమారులచే హత్య కావించిరి. సెన్నాచరిబ్ కు కుమారులలో నొకడైన "ఇసార్ హాడన్" అనువానిని బాబిలోనియా రాష్ట్రమునకు రాజప్రతి నిధిగా నియమించెను. ఈ రాజకుమారుడు శ్రేష్ఠుడుగాను. రాజు తనయెడ అనాదరము చూపెనను కోపముతో ఆతని యితర కుమారులు తిరుగుబాటుచేసి, తండ్రియైన సెన్నాచరిబ్ ప్రార్థన సలుపు సమయమున దేవాలయమునందే నాతని చంపివైచిరి. తండ్రి మరణవార్త వినగానే "ఇసార్ హాడన్" నైనివా నగరమునకు శీఘ్రముగా నేతెంచెను. ఇచ్చట అల్లరులు ప్రారంభ మయ్యెను. ఈతడీ తిరుగుబాటుల నవలీలగా అణచివైచి, ఆపైన తన నెదిరించిన సోదరులతో కొంత కాలము వరకును పోరాడి తుదకు వారిని దేశభ్రష్టుల గావించెను. ఇట్లు జయశ్రీని వరించి ఇసార్ హాడన్ రాజధానికి మరలి వచ్చి తన తండ్రి సింహాసనము నధిష్ఠించెను. ఇసార్ హాడన్ రాజు బాబిలోనియా రాష్ట్రమునెడ యవలంబించిన స్నేహ విధానమునుగూర్చి యీవరకే తెలుపబడియున్నది. దేశములో అరాజకత్వము ప్రబలెను. ఇట్టి స్థితినుండి ఇసార్ హాడన్ రాజు బాబిలోనియాను రక్షించెను. ఈతడు సుప్రసిద్ధమగు బాబిలోను పట్టణమును మరల కట్టించి, వారి కులదైవమగు మార్డూకు దేవుని విగ్రహమును మరల ప్రతిష్ఠింపించెను. ఈ పద్ధతుల వలన బాబిలోనియా ప్రజలను, అందు

ముఖ్యముగా ఎక్కువ పలుకుబడిగల మత గురువులను సంతుష్టి పరచుట యీ రాజు ప్రధానోద్దేశ్యముగా నుండెను. మరి కొంతకాలమైన తరువాత తన కుమారులలో నొకనిని బాబిలోనియా రాజుగా ప్రకటించెను. కాని యింతమాత్రమున అస్సీరియా బాబిలోనియా రాజ్యముల నడుమ చిరకాలము నుండి ప్రజ్వలించుచున్న విరోధాగ్ని చల్లారలేదు.

ఇసార్ హాడన్ రాజు యుద్ధము లనేకములు కావించెను. విశాలమగు తన సామ్రాజ్యము నందలి వివిధ రాష్ట్రములు విడిపడి పోకుండుటకై కొన్ని యుద్ధములు సాగించెను. మరికొన్ని యుద్ధము లాతని సైన్యాధికారుల ప్రోత్సాహము వలన తనకిష్టము లేకున్నను సాగించినవి. అస్సీరియా సామ్రాజ్యము నందలి సేనలకు సమస్త మగు అనుకూలములును లభించు చుండినందున వారు బల గర్వముచే నితర దేశములతో నిత్యమును కయ్యమునకు కాలు దువ్వుచుండెడివారు. వారి రణకండూతిని, యుద్ధప్రియత్వమును రాజు సైతము హద్దులలో నుంపజాల కుండెడివాడు. ఈ కారణమున అస్సీరియా రాజ్యమున కితర దేశములతో ననివార్యముగ వైరము సంభవించెడిది. ఈ యుద్ధములకు ఫలితముగా ఈజిప్టు దేశము నస్సీరియా వారు జయించిరి. ఈ విజయమువలన అస్సీరియా సామ్రాజ్యముయొక్క పశ్చిమపు టెల్లలు చాల దూరమువరకు నెట్టుకొని పోయెను. అస్సీరియా దేశీయులు పాలస్తీనా సిరియా దేశముల నాక్రమించిన తరువాత వారికిని ఈజిప్టు

రాజులకును యుద్ధ మనివార్య మయ్యెను. మధ్యధరా సముద్రము నంటియున్న యీ దేశముల నెట్టయిన నాక్రమింపవలెనని ఈజిప్టు ప్రభువు లపేక్షించుచుండిరి. అస్సీరియా రాజులు పాలస్టైనను జయించుచున్న సందర్భములో, ఈజిప్టు రాజులు పాలస్టైనందు ప్రజల నస్సీరియా సామ్రాజ్యముపై తిరుగుబాటు చేయవలసిన దని ప్రోత్సహించిరి. కొందరు పర్యాయములు వీరికి బహిరంగముగా సైన్యసహాయము కూడ చేసిరి. ఈజిప్టు పాలకుల చర్యలను సహింపజాలక అస్సీరియా వారు యుద్ధ సన్నద్ధులైరి. సిరియా దేశమునందు టైర్, సిడన్ అను సుప్రసిద్ధ పట్టణము లుండెడివి. ఈ పట్టణములను అస్సీరియా ప్రభుత్వమును ధిక్కరించుటకై ఈజిప్టు రాజు ప్రోత్సహించెను. ఇసారుహాడన్ రాజు సిడన్ పట్టణముపై తన సైన్యముల నడిపించెను. ఈ పట్టణము సముద్రమధ్యమున దుర్భేద్య మగు కోట ప్రాకారమునం దుండెడిది. అయినను ఇసారుహాడన్ రాజు దీని నవలీలగ జయించి, కోట గోడలను భగ్నము కావించి ఆ పట్టణమునకు సమీపముననే సముద్రతీరమున తన పేర వేరొక పట్టణమును నిర్మాణము కావింపించెను. టైరు పట్టణము మాత్రము అస్సీరియా రాజునకు వశము కాలేదు. ఈ యుద్ధము సమాప్తమైన పిమ్మట ఇసారుహాడన్ రాజు తన సైన్యముల నీజిప్టు దేశముపై నడపించెను. ఈజిప్టురాజు భయపడి పారి మెంఫిసు అను పట్టణమునందలి బలవత్తరమగు కోటలో దాగుకొనెను. అస్సీరియా

సైన్యము లీ కోటను ముట్టడించి భయంకరమగు యుద్ధము కావించి తుట్టతుదకు దానిని వశపరచు కొనెను. ఈజిప్టురాజు చేయునదిలేక కొంత సైన్యమును తీసికొని దీబిస్ ప్రాంతము నకు పారిపోయెను. ఇసారుహాడన్ రాజు తన శత్రువు నంతటితో విడచి రాజాంతఃపురమును కొల్లగొట్టెను. ఈ సంగర్భములో నీత డీజిప్టురాజుల విగ్రహములలో నిరువదియైదింటిని తన స్వాధీనము చేసికొని వానిని నైనివానగరమునకు పంపివేసెనట. కాని యీ విజయము చిరకాలము నిలువలేదు. పలాయితుడైన యీజిప్టురాజు అతి శీఘ్రముగనే క్రొత్త సైన్యము మును సిద్ధ పరచుకొని మెంఫిస్ నగరముపై దాడి వెడలెను. ఈ యుద్ధమునం దస్సీరియా వారి స్వల్పమగు సైన్యము సంపూర్ణముగ హతమయ్యెను. ఈజిప్టురాజు మరల తనసింహాసనము నధిష్ఠించెను. ఇసారుహాడన్ రాజీకాలములో తన సామ్రాజ్యమునందు చెలరేగిన యంతః కలహములను సవరించుటయందు నిమగ్నుడై యుండెను. రాజ్యాధికారములకై పెనగులాడుచున్న తన కుమారులలో నొకరిని నైనివా నగరము నందును, వేరొకనిని బాబిలోను పట్టణము నందును ప్రతిష్ఠించి, వారిని సంతుష్టి పరచి, ప్రచండమగు సైన్యముతో నీత డీజిప్టు దేశముపై దండెత్తెను. కాని యీతడు మధ్యమార్గముననే కాల ధర్మము పొందెను. (క్రీ. పూ. 668)

## అషుర్బనిపాలు

ఇసార్‌హాడన్ కుమారుఁడగు అషురుబనిపాలు అను నాతఁడీజిప్టు రాజ్యమును సంపూర్ణముగ జయించుట యందు కృతార్థుఁడయ్యెను. ఆదేశమును పాలించుచున్న ఇథియోపియా రాజు పూర్తిగ పరాభవింపఁబడెను. తన తండ్రిచే నియమింపఁబడిన సామంతరాజుల నషురుబనిపాలు రాజు మరల వారి వారి స్థానములలో ప్రతిష్ఠించెను. వీరిలో నీకో అను నాతఁడు ప్రముఖుఁడు. కాని అస్సీరియా ప్రభువు స్వదేశమునకు మరలి పోవుటయే తడవుగా నీజిప్టు దేశమున మరల అల్లరులు చెలరేగెను. నీకో మొదలగు సామంత రాజుల నస్సీరియా ప్రభుత్వముపై తిరుగుబాటు కావించుటకై తొల్లింటి యీజిప్టు రాజు ప్రోత్సహించెను. కాని యీజిప్టు నందు నివసించుచున్న అస్సీరియా రాజప్రతినిధి యీకుట్రలను సకాలముననే కనుఁగొని నీకో మున్నగు సామంతులను నిర్బంధించి రాజద్రోహులుగా నైనివా నగరమునకు పంపెను. కాని రాజనీతిజ్ఞుఁడగు అషుర్ బనిపాలు రాజు నీకో సామంతుని మిక్కిలి ఆదరించి, ఆతనిని తన కనుకూలునిగ కావించుకొని ఈజిప్టు దేశమునందలి యాతని రాజ్యమునకు మరల పంపివేసెను. నీకో మరెన్నఁడును స్వామిద్రోహము తలపెట్టలేదు. ఈజిప్టు దేశమును పాలించిన ఇథియోపియా ప్రభువులలో తుది వాఁడగు టానట్ ఆమన్ అను వాఁడు మెంఫిస్ నగరమును మరల ముట్టడించి అచ్చటి అస్సీరియా సైన్యము

లను సంపూర్తిగా సంహరించెను. ఈ వార్తవిని అస్సీరియా రాజు మరల ఈజిప్టుపై దండెత్తి వచ్చి టానట్ ఆమన్ ను పూర్తిగ నోడించి శాశ్వతముగా నీజిప్టు దేశమునుండి తరిమివైచెను. అటుతరువాత ఈజిప్టు దేశ మస్సీరియా సామ్రాజ్యములో శాంతముగా కొంత కాలము వరకు నిలచి యుండెను. నీకో సామంతుని కుమారుడు ఈజిప్టుదేశములో మరియొక రాజ వంశమును స్థాపించెను. ఈతడు కూడ అస్సీరియా ప్రభువుల యాధిపత్యము నంగీకరించెను.

## యుద్ధములు

అనేక యుద్ధములు కావించి అషుర్ బనిపాల్ రాజు ఈజిప్టు దేశముపై అధికారమును సంపాదించెను. కాని ఈ యధికారము చిరకాలము నిలువలేదు. బాబిలోనియా రాష్ట్రమునకు సమీపమున నున్న ఎలామియా రాజ్యము వారు బాబిలోనియాపై దండెత్తి ఆ రాష్ట్రమందలి యుత్తర భాగమును వశపరచు కొనిరి. అస్సీరియా ప్రభువైన అషుర్ రాజు దీనిని సహింపక తన సైన్యములను బాబిలోనియా లోనికి నడపి ఎలామ్ సైన్యములను సంపూర్ణముగా పరాభవించెను. ఈ యుద్ధములో ఎలామ్ రాజు హతు డయ్యెను. అస్సీరియా సేనానాయకు లీ శత్రురాజు శిరస్సును ఖండించి దానిని తన ప్రభువునకు కానుకగా పంపిరట. కాని ఈ పరాజయము వలన ఎలామ్ రాష్ట్రమువారి బలము నశింపలేదు. క్రీ. పూ. 652 సంవత్సరమున అషురుబనిపాలు సహోదరుడైన

షామాష్ షముకీన్ అనువాడు తన అన్నపై [illegible] చేసెను. ఇతడు బాబిలోనియా రాష్ట్రమున రాజ ప్రతినిధిగా నుండెను. ఇతని కెలాష్ రాష్ట్రమువారును, అర్మీనియా సామ్రాజ్యము నందలి ఇతర ప్రాంతములవా రనేకులును తోడ్పడిరి. అషురు బనిపాలు రాజు నిష్క్రియుడు కాడు. ఇతడు తన సైన్యములను శత్రు సమూహములపై మరియొక పర్యాయము నడిపించి వారినందరిని సంపూర్తిగా నోడించెను. అషురుబనిపాలు సహోదరుడు బాబిలోనియా నగరమునందలి తన ప్రాసాదముతో పాటు భస్మమయ్యెను. అషుర్ రాజు బాబిలోనియా నగరములో మరల నొక పర్యాయము సింహాసనము నధిష్ఠించి, తన జీవితాంతము వరకు దానినే తనకు రాజధానిగా కావించుకొనెను. ఎలామ్ రాజుల వలన నిరంతరము తనకు హాని సంభవించుచుండినందున అషురు రాజు వారి రాష్ట్రముపై దండెత్తి రాజధానియైన సూసా నగరమును సంపూర్ణముగా నాశనము చేసెను. మరికొంత కాలము వరకును ఈ రాజు శత్రువులతో పోరాడుచునే యుండెను. వారిపై పగ దీర్చుకొనుటయే ఈ యుద్ధముల ముఖ్యోద్దేశముగా కాన్పించుచున్నది. ఇట్లు పరాభవింపబడిన రాజులలో "యేటూ" అను అరబ్బు రాజొకడు. అతని యనంతరము సింహాసన మధిష్ఠించిన "యూటా" అను వానిని అషురు రాజు చెరపట్టి నైనివా నగరమున రాజద్వారమువద్ద గొలుసులతో బంధించి యుంచెనట. ఈ అషురు రాజు పాలన

యందలి తుది సంవత్సరములలో చెప్పదగిన యెట్టి ఘన కార్యములును లేవు కావోలు. అందుచేతనే యీ కాలమును గూర్చిన యెట్టి యంశములును మనకు చిక్కుటలేదు. అది యునుగాక నిరంతరము యుద్ధములవలన అస్సీరియా దేశము నందలి వీరవర్గ మంతయు నశించినందున వారి సైన్యములు నిస్తేజములయి యుండవచ్చును. ఈ కారణము వలన అస్సీరియా రాజు తన రాజ్యకాలమందలి యవసాన దశలో మరే దేశములపై దండెత్తి పోలేదు.

### విజ్ఞానప్రియత్వము

అషుర్ బనిపాల్ యొక్క రాజ్యకాల మస్సీరియా చరిత్రయందు మిక్కిలి ప్రాముఖ్యత వహించుచున్నది. ఇతడు కావించిన యుద్ధములును, సంపాదించిన విజయములును ఈ వరకే పేర్కొనియున్నారము. ఈ రాజుకాలములో అద్భుత మగు శిల్పకళాభివృద్ధి కానవగుచున్నది. నైనివానగరము నందు అషురు రాజుయొక్క రాజభవనములో ఉత్తమోత్తమము లగు శిల్పచిత్రములు చిత్రింపబడెను. రాజులయొక్క వేట వారియుద్ధములు మున్నగు సంఘటనలను రాతిపలకలపై జీవకళ లుట్టి పడునట్లు శిల్పులు చిత్రించిరి. ఇట్టి నైపుణ్యము నస్సీరియా చరిత్రయందు మరెవ్వరి కాలమందును గనబడదు. ఏనుగ దంతముపైనను వివిధ లోహములపైనను కూడ ఈ కాలమునాటి శిల్పులు తమ పనితనమును ప్రకటించిరి. అషురు బనిపాల్ యొక్క రాజ్యకాలము నందు విజ్ఞానసంరక్షణమునకై

యెంతయో ప్రయత్నము కావింపబడినట్లు తెలియ నగుచున్నది. ఈతడు అస్సీరియా సామ్రాజ్యమునందలి దేశములలో అన్ని ప్రాంతములకును తన వ్రాయసగాండ్రను పంపి వారికి లభ్యమైన అన్ని గ్రంథములకును ప్రతులను వ్రాసికొనిరమ్మని యాజ్ఞాపించెను. ఈ విధముగా ఆనాటికి ప్రచారమునందున్న సమస్త శాస్త్రీయ, మత విషయిక వాఙ్మయ గ్రంథముల కన్నిటికి నూతన ప్రతులు సంపాదింపబడెను. ఇట్లు సేకరింపబడిన గ్రంథజాలము నంతను ఈ రాజు తన రాజ ప్రాసాదమునందలి పుస్తక భాండాగారమున నుంచి సంరక్షించెను. ఈ యపూర్వ గ్రంథాలయమునుండి యనేక గ్రంథములను ఆధునికులు సేకరించి యున్నారు. ఆధునిక చరిత్రకారులు విద్యాభిమానియైన యీ రాజున కెంతయో ఋణపడియున్నారని చెప్పుటలో నతిశయోక్తి యించుకయును లేదు.

### అస్సీరియా వినాశము

అష్షుర్ బనిపాల్ రాజు కాలమునందే అస్సీరియా రాజ్య వినాశముయొక్క చిహ్నములు కానరాసాగెను. ఈ రాజ్యము వారు చిరకాలమునుండియు రాజ్య తృష్ణచే పరదేశములపై దండెత్తిపోవుటయు తమ శౌర్యపరాక్రమములచే యుద్ధ నైపుణ్యము చేతను వానిని జయించు చుండుటయు యీవరకే వర్ణింప బడినది. యుద్ధ భోజనులైన వీరి ప్రతాపము కొంతకాలమునకు క్షీణింప జొచ్చెను. దేశమునందలి వీరు లెల్లరును మడసిరి. వారి స్థానమున నియమింపబడిన జీత

గాండ్రుగు సైనికులలో తొల్లింటి అస్సీరియా వీరుల యుత్సాహముగాని పరాక్రమముకాని కానరాదయ్యెను. ఇదియిట్లుండ అస్సీరియా రాజ్యముపై పరరాష్ట్రములనుండి దండయాత్రలు ప్రారంభ మయ్యెను. ఈ దండయాత్రలు నడిపిన వారు "మీడులు" అను అనాగరక జాతివారు. వీరు నైనివా నగరమును ముట్టడించినపుడు సిథియనులు అను మరియొక అనాగరకజాతి వీరికి సహాయపడెను. బాబిలోనియా ప్రజలు వీరికి రహస్యమున ప్రోత్సాహము కలిగించిరి. విశాలమైన అస్సీరియా సామ్రాజ్యమునందలి యొక్క రాష్ట్రముకూడ తమ సార్వభౌమునికి సాయపడుట కంగీకరింపలేదు. ఈ సామ్రాజ్యమునందలి ప్రజలెల్లరును కేవల భయముచే అస్సీరియా ప్రభుత్వమునకు వశంవదులై యుండిరి. వారికి తమ రారాజునెడ నెట్టి యభిమానము లేకుండెను. క్రీ. పూ. 609 వ సంవత్సరమున నైనివా నగరము యొక్క ముట్టడి ప్రారంభమయ్యెను. మూడు సంవత్సరముల వరకును అస్సీరియా సైన్యములు సెన్నాచెరిబ్ రాజుచే నిర్మింపబడిన బలిష్ఠమగు కోటగోడలలో నిలచి శత్రువులతో పోరాడిరి. తుట్టతుదకు క్రీ. పూ. 606 వ సంవత్సరమున కోటగోడలు భేదింపబడెను. సిన్‌షార్ ఇష్కూన్ అను ఆనాటి అస్సీరియా ప్రభువు శత్రువులకు లోబడుట కంగీకరించక తన రాజభవనమునకు నిప్పుదరికొల్పి తన భార్యలతోడను, ఉప పత్నులతోడను, సంతానములతోడను దగ్ధుడయ్యెను. అత్యద్భుతమగు సుందర మందిరములతో విలసిల్లిన

నైనివా నగరము సంపూర్ణముగ నశించి పాడుపడి, వన్య మృగములకు నివాసస్థలముగ పరిణమించెను.

ఈ దేశము ఎట్లు తిరిగి ప్రత్యక్షపరుపబడెను?

నైనివా నగరము శత్రుహస్తగత మైన రెండు శతాబ్దులలోనే అస్సీరియా సామ్రాజ్య వైభవమును, సుప్రసిద్ధములగు నైనివా, కాలా, మున్నగు పట్టణములను జనులు మరచిపోయిరి. ఈ పట్టణములు నెలకొనియున్న ప్రదేశములలో గడ్డి, మొక్కలు, తీగెలు, మున్నగునవి మొలచి త్వరలోనే పురాతన మందిరములు ఎవ్వరికిని కానరాకుండ మాయమయ్యెను. బాబిలోనియా అస్సీరియా ప్రభువులు తమ తమ మందిరముల నున్నతమైన వేదికలపై నిర్మించుచుండెడివా రని తెలుపబడి యున్నది కదా! ఆ మందిరములు మున్నగు కట్టడములు పచ్చ గడ్డిచే కప్పబడి పోయిన తరువాత చూపరుల కవి మంటి దిబ్బలో లేక కొండలో యను భ్రాంతి కలిగించుచుండెడివి. అస్సీరియా సామ్రాజ్య పతనమునకు రెండు శతాబ్దుల తరువాత జెనోఫన్ ( Xenophon )అను సుప్రసిద్ధ గ్రీకు వీరు డస్సీరియా దేశములో ప్రయాణముచేయుచు తటస్థించెను. ఈతడు వీరుడు మాత్రమేకాక గొప్పవిద్వాంసుడును, గ్రంథకారుడు నైనందున "పదివేలమంది తిరోగమనము" (The Retreat of the ten thousand) అను ఉద్గ్రంథమును వ్రాసెను. అందీతడు అస్సీరియాదేశములో తాను గాంచిన పురాతనపట్టణముల వర్ణన కావించి, ఆ పట్టణములను లారిస్సా, మెస్పిలా,

అను పేర్లతో సూచించెను. కాని వీని నిజస్థితి నాత డెరుంగ డయ్యెను. తత్పూర్వసరములలో నుండు ప్రజలుకూడ నీ పట్టణ ముల పూర్వచరిత్రి నెరింగినట్లు కాన్పింపదు. మరియొక శతాబ్దము గడచినవెనుక ప్రఖ్యాత యవనవీరు డగు అలెగ్జాం డరు తన సైన్యములతో పారసీక సామ్రాజ్యముపై దండె త్తెను. ఆనాటికి బాబిలోనియా అస్సీరియా ప్రదేశములు ఈరాజ్యమునందు భాగములుగా నుండెను అలెగ్జాండరు వీరుని నౌకా సైన్యములు యూఫ్రటీసునది యందు ప్రయాణము చేయుచుండగా నదీప్రవాహమునందు రాతిగోడల వంటివి వారికి గమన నిరోధము తరచు కావింప జొచ్చెను. ఈ యడ్డంకులను తీసివేయుట మంచిదని తలంచి యవనులు నదీ ప్రవాహమునందు దిగి బ్రహ్మాండమైన రాళ్ళను నీటినుండి బయటకు తీసి తమ మార్గమును నిరాటంకము కావించు కొనిరి. కాని అతి పురాతన మగు బాబిలోనియా అస్సీరియా నాగరకతా చిహ్నములను దాము నాశనము చేయుచుంటి మని వారెరుంగ జాలరైరి. నిజమునకు యవనులు యూఫ్రటీసునదినుండి యివలకు తీసివడవైచిన శిలలు పురాతన కాల ములో నదీ ప్రవాహముహ నాపుటకై బాబిలోనియా ప్రజలు కట్టించిన ఆనకట్టలు, నదీ జలముల నీ విధముగ ఆపి తమ కావశ్యకమగుదిక్కున కా నీటిని కాలువలద్వారా వారుప్రవ హింపజేయుచుండెడివారు. మొత్తముమీాద అనేక కారణ ముల వలన యూఫ్రటీసు మైదానములలో ప్రాచీన కాలము

నందు విలసిల్లిన సభ్యతాసాంస్కృతిక చిహ్నములు నానాటికిని నశించి, ప్రపంచముచే మరువబడెను. చాలకాలము వరకును ఐరోపియను విద్వాంసులును, చారిత్రికులునుకూడ ప్రాచీన నాగరికత యనగా గ్రీకురోము దేశముల నాగరికతయనియే వ్యాఖ్యానము చేయుచుండెడివారు. గ్రీకురోము నాగరికతలకు చాల శతాబ్దులు పూర్వమే సంపూర్ణ వికాసము చెందిన ప్రాచ్యదేశపు సభ్యతను వారించుకయును ఎఱుంగకుండిరి. గ్రీకురోము సంప్రదాయములకు చెందని యితర దేశ సభ్యతలను వారు “అనాగరకము” లని చిన్న చూపుతో చూచుచుండిరి.

19 వ శతాబ్దియందు చరిత్రకారుల సేవ

కాని పందొమ్మిదవ శతాబ్ది యారంభదశయందు ప్రాచీన నాగరకతా నిలయములైన యీ ప్రదేశములందు చారిత్రికపరిశోధన ప్రారంభ మయ్యెను. ఈ పరిశోధన కంకురార్పణ కావించిన యాతడు రిచ్ (Rich) అను నాంగ్లేయుడు. 1820 వ సంవత్సరమున నీ ఆంగ్లేయుడు బాగ్దాదు నగరమునందు ఈస్టిండియాకంపెనీ వారి ప్రతినిధిగా నియమింపబడెను. యూఫ్రటీసు నదీ తీరమునందు కాన్పించుచున్న బ్రహ్మాండమగు మంటి దిబ్బలను త్రవ్వింపవలెనని యాతనికి కుతూహలము జనించెను. మోసలు పట్టణమునకు సమీపమున కొలది కాలమునకు పూర్వమే మనుష్యులయొక్కయు జంతువులయొక్కయు ప్రతిమలు లభించెనని విని యున్నందున నీతని కోరిక మరింత దృఢపడెను. నూతన చారిత్రికాంశములను

కనుగొనవలె నను ఉత్సాహముతో రిచ్ మహాశయుడు తన స్వంతధనమును వినియోగించి, పైన వర్ణింపబడిన మంటిదిబ్బలను త్రవ్వించుట ప్రారంభించెను. కాని యీతని ప్రయత్నము లెక్కువ ఫలవంతములు కాలేదు. ఇంతేకాక మెసొపొటేమియా ప్రాంతమును పాలించుచుండిన తురుష్క ప్రభుత్వము వారి యధికారులీచారిత్రిక పరిశోధనయొక్క ప్రాముఖ్యతను గుర్తింప జాలక, అయ్యవి విగ్రహారాధన సంబంధములగు కార్యకలాపములని భావించి, యీ ప్రయత్నములను నిరోధించిరి. ఈ కారణముచే రిచ్ మహాశయుడు పగిలిపోయిన కొన్ని విగ్రహములను మాత్రము సేకరించి స్వదేశమునకు మరలిపోయెను. ఈ విధముగా మెసొపొటేమియా ప్రాచీన చరిత్రను గూర్చిన పరిశోధన ప్రారంభించిన గౌరవ మొక యాంగ్లేయునికి దక్కెను.

1842 వ సంవత్సరమున బోటాయను నాతడు మోసలు పట్టణమున పరాసు ప్రభుత్వము వారి ప్రతినిధిగా నియమింపబడెను. ఈతనికికూడ చారిత్రిక పరిశోధనయందు మిక్కిలి ఆసక్తియుండెను. ఈతడు మోసలు నగరమున కెదురుగనున్న "కోయుంజిక్" అను గ్రామము నొద్దగల మంటి దిబ్బలను త్రవ్వించుట ప్రారంభించెను. దీనినే జెనొఫన్ అను గ్రీకు చరిత్రకారుడు మెస్పిలా యని పేర్కొనెను. కోయుంజిక్ గ్రామమునొద్ద పేర్కొనదగిన యెట్టి చారిత్రిక చిహ్నములును లభింపలేదు. మరికొంత కాలమున కాతడు "ఖోర్సాబాద్"

అను ప్రదేశమునొద్ద [illegible] ప్రారంభించెను. అతని కాలములో [illegible] ముగ [illegible] విశాలమైన హాలు లతనికి కాన్పించెను. ఆ [illegible] గోడలపై వివిధ చిత్రములు చిత్రించబడి యుండెను. కొన్ని ప్రదేశములలో విలక్షణమగు లిపియందు శాసనములు వ్రాయబడి యుండెను. వీని సన్నిటిని గాంచి బోటా ఆశ్చర్యానందములకు గురియయ్యెను. ఆమీదట [illegible] కాలము సంతయు ఖోర్సాబాద్ శిథిలములను పరిశీలించి చారిత్రికాంశములను సేకరించుట యందే గడపెను. ఇతడు “నైనివా నగరపు కట్టడములు” “Monuments di nirive” అను పేరుతో అయిదు పెద్ద సంపుటములను ప్రకటించెను. బోటా కావించిన చారిత్రిక పరిశోధనల చేతను, అతడు ప్రకటించిన గ్రంథ రాజములచేతను ఐరోపీయ విద్వాంసులలో ప్రాచ్య ఖండపు నాగరకతను గూర్చిన అభిజ్ఞానమును, నిరసన భావమును చాలవరకు తొలగిపోయెను. అనాటినుండి బాబిలోనియా అస్సీరియా దేశముల ప్రాచీన చరిత్రను తెలిసికొన వలయునని పలువురు ఉత్సాహవంతులు పూనుకొనిరి. ఇట్టి వారిలో “లయార్డ్” అను ఆంగ్లేయుడు మిక్కిలి ప్రముఖుడు. ఇతని ప్రయత్నములకు వలయు ధనసహాయమును కావించుటకు బ్రిటీషు మ్యూజియమ్ వారును, ఆంగ్లేయ ప్రభుత్వమునుకూడ వెనుకాడెను. అట్టి సందర్భమునందు సర్ స్ట్రాట్ ఫర్డ్ కానింగు

అను ఆంగ్ల ప్రముఖుడు మిక్కిలి ఉదార బుద్ధితో తాని ప్రయత్నమున కగు వ్యయమును భరించెదనని వాగ్దానము చేసెను. ఈ సహాయముతో 1845 వ సంవత్సరమున "లయార్డు" (Layrd) తన ప్రయత్నములను ప్రారంభించెను. ఈ చరిత్ర పరిశోధకుడు పెక్కు శ్రమలకోర్చి తన పనిని జయప్రదముగ కొనసాగించెను. ఈ ప్రాంతములలో ఎండలు విపరీతముగ కాయును. ఇచ్చటి యుష్ణము శీతల దేశములలో నివసించువారికి భరింపరానిది. ఇందులకు తోడు వర్షములు ప్రారంభము కాగానే విషజ్వరములు మున్నగునవి ప్రారంభమై ప్రజలను పీల్చి పిప్పిచేయును. ఇది యిట్లుండగా స్థానికులగు అరబ్బు ప్రజల మూఢత్వమును, అనాగరకస్థితియును, అధికారుల ప్రాతికూల్యమును, ఈ ఆంగ్లేయుని చారిత్రిక పరిశోధనకెన్నియో అంతరాయములు కల్పించెను. ఈ విజాతీయుడు బంగారము మున్నగునవి లంభించునను ఆశచే భూమిని త్రవ్వించుచున్నాడని యొక పర్యాయమును, ఈతడు విగ్రహాదులను పునరుద్ధరించి, సత్యమత ధర్మములకు హాని కలిగించుచున్నాడని మరియొక పర్యాయమును బాబిలోనియా ప్రాంతము నాకాలమందు పరిపాలించుచున్న తురుష్క ప్రభుత్వము వారి యుద్యోగులు లయార్డు ప్రయత్నములను నిరోధించిరి. ఈ విజ్ఞాన ప్రియుని యత్నముల నచ్చటి అరబ్బు ప్రజ లెంతమాత్రమును గ్రహింప జాలరైరి. వారి దృష్టియందాతడొక మూర్ఖుని వలె కాన్పింపజొచ్చెను. ఒక నాడీతడు

తాను త్రవ్వించుచున్న "నిమ్రూద్" శిథిలములను సమీపించు సరికి, కూలీలుగ పనిచేయుచున్న అరబ్బులెల్లరును ఆతని వద్దకు పరుగెత్తుకొని వచ్చి భూమిలోనుండి యొక మహా భూతము వెలువడినదనియు, ఇంక తామా భూగర్భములో పని చేయజాల మనియు తెలిపి, పనిముట్లను పారవైచి యార్తి శ్వాసముతో తమ తమ యిండ్లకు పారిపోయిరి. నిజస్థితి యేమన భూమిని త్రవ్వింపగా అందుండి ఒక బ్రహ్మాండమైన మనుష్య విగ్రహము కానవచ్చెను. ఆ విగ్రహముయొక్క తల మాత్రము భూమిలోనుండి వెలువడెను. అది సర్వాంగసుందర మై చూచుట కింపుగ నుండెను. ఆ విగ్రహముయొక్క శిరస్సు సామాన్య మానవునికంటె యెత్తుగ నుండెను. ఈ యపూర్వ నిర్మాణమును చూచి అమాయకులైన అరబ్బుకూలీలు పురాతన కాలమునాటి మాంత్రికులు ప్రతిష్ఠించిన భూత మేదియో తలయెత్తినదని భయపడి పరువులెత్తిరి. నిరాధారము లైన వారి భయ ముపశమించు సరికి కొంతకాలము పట్టెను.

ఈ దేశముల పరిభాషము ప్రజల జీవిత విధానము

బాబిలోనియా అస్సీరియా రాజ్యములు రాజకీయ వ్యాపారములలో భిన్నముగ నుండి, అనేక సందర్భములలో ఒండొంటితో వైరము పాటించినను, నభ్యత, విజ్ఞానము మున్నగు నంశములలో ఈ దేశములు రెండిటిని ఏక ప్రాంత ముగ భావింప వచ్చును. బాబిలోనియా యను పేరుతో ప్రఖ్యాతి వహించిన దేశ మతి ప్రాచీన కాలములో కాల్డియా

యను నామముతో వ్యవహరింప బడుచుండుటకూడ మన మెరింగిన విషయమే. ఆ కారణముచే ఈ దిగువ తెలుపబడెడి యంశములు పై మూడు దేశములకును కూడ సమానముగ వర్తించునని తెలుపవచ్చును. చారిత్రికపరిశోధకులు ఈదేశముల ద్రవ్వి కనుగొనిన విషయములను, సత్యాంశముల యాధారముపై కావించిన యూహలను, మన మీ విధముగ క్రోడీకరింపవచ్చును. మనుష్య జీవితముపై భౌతిక పరిసరముల ప్రభావము విస్తారముగ నుండుననుట నిర్వివాదాంశము. అట్లే బాబిలోనియా అస్సీరియా ప్రజల జీవిత విధానము ఆ దేశపు స్థితిగతుల కనుకూలముగ నుండెడిది. ఉదాహరణమునకు పై దేశములలో ప్రజలు తమ నివాసమునకును, ఇతర ప్రయోజనములకును, ఎట్టి గృహముల నిర్మించుకొనెడివారో యించుక పరిశీలింతము. కాల్డియా లేక బాబిలోనియా దేశము యూఫ్రెటీసు నదీ ప్రవాహముచే కొనితేబడిన వండ్రుమట్టిచే ఏర్పడిన డెల్టా ప్రదేశము కాని మరొక్కటి కాదు. ఇచ్చటి భూమి మిక్కిలి మెత్తనిది. భూమి సారవంతము. కొండలు మున్నగునవి మచ్చునకైన లేవు. ఈ దేశములో నేవైపునకు చూచినను విశాలములైన సమ ప్రదేశములు కాన్పించును. ఉన్నతములగు వృక్షములుకూడ దృష్టినిరోధమును కావింపవు. చాల ప్రాంతములలో సుమారు నాలుగైదు గజముల యెత్తునకు పెరిగెడి రెల్లుగడ్డి మనకు కానవచ్చును. ఇట్టి సందర్భములలో ఆ దేశవాసులు గృహనిర్మాణము నెట్లు కావించుకొనెడివారో

తెలిసి కొనుట కష్ట సాధ్యము కాదు. అనాదియందు జనులు రెల్లు గడ్డితో ఇండ్లకు గోడలు కట్టుకొని వాటికి మట్టి పూతపూసి ఈ విధముగ గుడిసెలను స్థిరము గావించు కొను చుండిరి. మరికొంతకాలము గడచిన వెనుక ఈ దేశము ప్రజలకు తమ యిండ్లను పెద్దవిగను సురక్షితముగను కావించు కొనవలెనని అభిప్రాయము కలిగి యుండవచ్చును. అందులకై వారు మట్టితో ఇటుకలను సిద్ధపరచుట నేర్చుకొనిరి. ఇటుకలను చేయుటకై ఆవశ్యకమగు మెత్తని మట్టి కాల్డియా దేశములో విస్తారముగ లభించుచున్నది. ఈమట్టియందు గోధుమ పొట్టును కలిపిన యెడల ఇటుకలు మిక్కిలి గట్టిగా నుండును. ఈ ఇటుకలను ఎండలో ఎండబెట్టి గృహనిర్మాణమునకై వాడుచుండెడివారు. కాని బాబిలోనియా దేశములో వర్షములు విస్తారముగ కురియును. పచ్చిఇటుకలతో కట్టిన గోడలు వర్షములకు నాని త్వరలోనే కూలిపోవుట తటస్థించు చుండెడిది. అట్టినష్టము సంభవింపకుండుటకై పిదప మరికొంత కాలము గడచినవెనుక ఇటుకలనుకాల్చి గట్టిపరచుట ప్రారంభించిరి. ఇట్లు కాల్చిన ఇటుకలు మిక్కిలి గట్టిగా నుండుట నిజమేకాని యిందులకై చాల వ్యయ ప్రయాసములకు లోను కావలసివచ్చును. కావున బాబిలోనియా వారు కాల్చిన ఇటుకలను తమ కట్టడములలో ధారాళముగ వాడకుండిరి. అందుచే గోడలు కట్టునప్పుడు వాని లోపలి భాగము నంతను పచ్చియిటుకలతో కట్టి పైభాగమున ఒకటి రెండు

పరుసల మాత్రము కాల్చిన యిటుకలను వాడెడివారు. అస్సీరియా ప్రాంతములో కొండలు విస్తారముగ కలవు. కావున అచ్చట రాళ్ళ కెట్టి కొరతయును లేదు. అట్టి ప్రదేశములలో గోడలను కట్టుటలో రాళ్ళను విరివిగ వాడుచుండిరి.

### గృహనిర్మాణము

కాల్డియా బాబిలోనియా ప్రజలు వాడిన ఇటుక లన్నియు ఒకే విధముగలేవు. అందుకొన్ని మోటుగనున్నవి. మరికొన్ని మిక్కిలి సున్నితముగను మిక్కిలి దృఢముగను కూడనున్నవి. ఇటుకలను తయారు చేయించిన ప్రభువులు రాజులు మున్నగు వారు తమ నామములను, బిరుదావళిని ఆ యిటుకలపై వ్రాయించుచుండిరి. ఈ కారణముచే ఏ యిటుక లేకాలమునందు తయారు చేయబడెనో తెలిసి కొనుట కవకాశము లేర్పడు చున్నవి. వీనిలో కొన్ని యిటు కలు క్రీ. పూ. 3000 సంవత్సరము లప్పుడును, మరికొన్ని క్రీస్తునకు 600 సంవత్సరములకు పూర్వమును నిర్మింపబడినట్లు నిర్ణయింప బడినది. ఇందు : ండవ రకపు ఇటుకలు పనితనములో మిక్కిలి శ్లాఘనీయముగా నున్నట్లు తెలియుచున్నది. ఇటుకలు కాని రాళ్ళుకాని ఒండొంటితో హత్తుకొని యుండుటకై ఏదైన జిగురు పదార్థము అవసరము. అతి ప్రాచీన కాలమునాటి కట్టడములలో ఇటుకలను మిక్కిలి జతపరచు టకై జిగురు కలిగిన యెఱ్ఱ మట్టిని గోధుమ పొట్టుతో కలిపి వాడు చుండిరి. మరి కొంతకాలము గడచిన వెనుక తారును

సిద్ధపరచి దానితో ఇటుకలను రాళ్ళను కోసివేసెడివారు. ఈ పదార్థముచేత కట్టబడిన రాళ్ళు ముక్కలగునవి కొంత మాత్రమును కదలక స్థిరముగ నుండెడివి.

సామాన్యుల గృహములకును, రాజులయొక్కయు ధన వంతులయొక్కయు నివాసములకును భేదముండెడిది. అందును ముఖ్యముగా రాజభవనములు, కేవల మాడంబరముగనే కాక బలవత్తరముగ నుండుట యావశ్యకము. శత్రువుల బారి నుండి తన్ను తాను రక్షించుకొనుటకై ప్రభువగు వాడెట్టి ప్రయత్న లోపమును చేయరాదు. కావుననే రాజులు సాధార ణముగ తమ కోటలను, దుర్గమములును, సురక్షితములునగు ప్రదేశములందును, కొండలపైనను, నిర్మించు కొనెడివారు. కాల్డియా ప్రాంతమునందు దుర్గ నిర్మాణమున కనుకూలము లగు ప్రదేశములులేనందున ఆనాటి రాజులు చెత్త, ఇటుకలు రాళ్ళు మున్నగు వానితో పెద్దపెద్ద వేదికలను నిర్మించి వానిపై తమ ప్రాసాదములను నిర్మించుకొనుచుండిరి. కోయుంజిక్ నిమ్రూద్ అను ప్రదేశములలో నేడు కానవచ్చుచున్న బ్రహ్మాండమైన మంటి దిబ్బలొకానొక కాలమున నిట్టి విశాలమైన వేదికలే యనియు, వానిపై అనేకులు రాజులు తమతమ దివ్య భవన ములను నిర్మించు కొని యుండిరనియు చారిత్రిక పరిశోధకు లూహించుచున్నారు.

మంటిదిబ్బలలో కొన్ని విలక్షణమగు స్వరూపము కలవి. ఇవి మిక్కిలి ఎత్తుగా నుండి తుదకు కొనలు తేలి ఇంచు

మించు దేవాలయముల ఆకారములో నున్నవి. ఇట్టి మట్టి దిబ్బలు నిమ్రూద్, బార్సిప్ అను ప్రదేశములలో కలవు. ఇవన్నియు నిజమునకు కూడ దేవస్థానముల శిథిలములే. ఈ దేవాలయములలో పెక్కు అంతస్తు లుండెడివి. ఈ అంతస్తులు చతురస్రముగా నుండెడివి. ఇట్టి అంతస్తు లొకదానిపై వేరొకటి నిర్మింపబడుచుండెను. పై యంతస్తులు క్రమ క్రమముగా చిన్న వగు చుండెడివి. తుది యంతస్తునందు దేవతా విగ్రహము ప్రతిష్ఠింప బడుచుండెను. దేవతల కున్నత స్థానము నొసంగ వలయునను ఉద్దేశముతో బహుశః ఇట్టి పద్ధతు లవలంబింప బడుచుండెడివి. పురాతన కాల్డియా నివాసులు అసంఖ్యాక తారాగణ విరాజిత మగు నభోమండలమును నిరంతరమును పరిశీలించుచుండిరి. వీరికి జ్యోతిషమునందు మిక్కిలి అభిమానము. కావున నీ దేవాలయములు నక్షత్రశాలలుగకూడ ఉపయోగ పడుచుండెడివి. బార్సిప్ అను ప్రదేశమునందలి దేవాలయము 150 అడుగుల ఎత్తు గలిగి ఏడు అంతస్తులతో నిర్మింపబడియున్నది.

కోయుంజిక్ అను ప్రదేశములో మంటిదిబ్బలు సుమారు నూరు ఎకరముల విస్తీర్ణము కలవి. ఇచ్చటనే పురాతన కాలమునందు నైనివా పట్టణము నెలకొని యుండెను. కొన్ని ప్రదేశములలో నీ మట్టి దిబ్బలు 95 అడుగుల ఎత్తు కలిగి యున్నవి. ఇంతటి సువిశాలమైన వేదికను నిర్మించుట సామాన్యమైన అంశము కాదు. దీనిని నిర్మించుటకు 10,000 మంది

కూలీలు నిరంతరాయముగ పండ్రెండు సంవత్సరములు కష్టించి యుండ వలెనని అంచనా వేయబడినది. ఇవి కాక ఖోర్సాబాదు అను మరియొక ప్రదేశమునందు మహారాజ మట్టి నాలుగు దిబ్బలు కానవచ్చుచున్నవి. ఇప్పటికి మట్టి దిబ్బలు కలుగజేసిన ప్రదేశముల వైశాల్యమును, కొన్ని కొన్ని చోట్లలో 100 అడుగులకు మించిన యెత్తును కలిగి యున్నవి. దీని నిర్మాణమునకై 10,000 మందికూలీలు సుమారు ఆరు సంవత్సరముల కాలము పనిచేసి యుందురని యూహింపబడినది. అనేక దేశములను జయించి, శత్రుసైనికులలో పలువురను యుద్ధఖైదీలుగ నిర్బంధించి తెచ్చి, వారిని జీతబత్తెములు లేకుండ బానిసలవలె పని చేయింపగలిగిన గొప్ప మూర్ధాభిషిక్తులకే గాని సామాన్యులు కిట్టి నిర్మాణముల కావింపించుట దుస్సాధ్యము.

కాల్డియా అస్సీరియా దేశములలోని పురాతన మందిరములను గురించిన యొక అంశము గమనింప దగినది. బాబిలోనియా ప్రాంతములో దేశమంతయు సమ ప్రదేశముగానుండి, యెట్టి కొండలు గుట్టలు లేనందున అచ్చటి రాజులు తమ రాజ హర్మ్యముల నిర్మాణమునకై వేదికలను నిర్మించుకొనుట సహజమే. కాని పర్వతమయ మైన అస్సీరియా దేశములో సైతమిట్టి పద్ధతియే యవలంబింప బడుట చిత్రముగా నున్నది. అచ్చటి రాజులు తమ కోటలను నిర్మించు కొనుటకై అనువైన కొండలు విస్తారముగా కానవచ్చును. కోట గోడలునున్నగు నవి కట్టుటకు వలసినంత రాయికూడ వారికి సులభముగ లభిం

చున. అయినను ఇట్టి మార్గములను త్రొక్కక బాబిలోనియా యందు వలెనే విశేష శ్రమకోర్చి ఇటుకలతో వేదికలను నిర్మించుట చూడగా అస్సీరియా నివాసులకు స్వతంత్రాలోచనా శక్తి లోపించి యుండెనేమో యని యూహింపవలసి వచ్చుచున్నది. అనాదియందు కాల్డియా ప్రాంతములలో నివసించుచుండెడి ప్రజలలో కొందరు కొంతకాలముగడచిన వెనుక అస్సీరియా దేశములోనికి వలసపోయి యుండవచ్చు ననియు వారచ్చటికి వెడలిపోయిన తరువాత దేశస్థితిననుసరించి తమవాస్తు పద్ధతులను మార్చుకొనక తమ పూర్వీకుల మార్గములనే అనుసరించుచుండి రనియు ఊహించుట కాధారము లేర్పడుచున్నవి. అస్సీరియా దేశములోని కట్టడములలో రాళ్ళను వాడుట మాత్రము సామాన్యముగా నుండెడిది. ఈ రాళ్ళను అస్సీరియా దేశమునకు తూర్పున నున్న జాగ్రోసు పర్వతములనుండి బహుశః వారు తెచ్చుచుండెడి వారు. ఈ పర్వతములలో నుద్భవించి టైగ్రిసు నదిలో కలిసి పోయెడి 'జాబ్' అను ఉపనది మీదుగ తెప్పల సహాయమున వీరిట్టి రాళ్ళను తీరవేయుచుండి యుండవచ్చును. మనకు లభ్యమైన అస్సీరియా పురాతన చిత్రములలో నొక చిత్రమునందీ యూహను బలపరచు విషయములు కానవచ్చును. ఈ చిత్రమునందు తోలుతిత్తులను గాలితో నింపి వానిపై నొక తెప్ప నమర్చి ఆ తెప్పను నావికులు తెడ్లతో నడుపు చున్నట్లు చూపబడినది. ఈ తెప్పయందు పెద్ద పెద్ద రాళ్ళు ఉన్నించుచున్నవి.

లయార్డు మహాశయుడు కోయుంజిక్, నిమ్రూడ్, గనిలము లలో తాను కనుగొనిన శిలావిగ్రహములను టైగ్రిసు నది మీదుగ బాగ్దాదు బాస్రా ప్రాంతములకు పంపించబడి నప్పు డిట్టి తెప్పలే వాడబడి యుండెనట. సుమారు 4000 సంవత్స రములకు పూర్వమును నేడును కూడ టైగ్రిసు నదిపై ఇట్టి తెప్పలే వాడబడు చున్నట్లు స్పష్టమగు చున్నది.

## రాజభవనములు

చారిత్రిక పరిశోధకుడైన లయార్డు అస్సీరియా దేశపు ప్రభువుల రాజసభా భవనము లెట్లుండెనో వర్ణించి యున్నాడు. ఫెర్గుసన్ మున్నగు ఇతర పరిశోధకులు సైత మీ విషయమై కృషి చేసిరి. కాని ఈ దేశముల పురాతన కట్టడములను గూర్చి వారు గావించిన వర్ణన లన్నియు కేవలము ఊహాలపై నిర్మింప బడెను. లయార్డు యొక్క వర్ణనలుమాత్ర మట్లు గాక తాను స్వయముగ పరిశీలించి కనుగొనిన యంశములపై యాధారపడి యున్నవి. ఇట్టి సభాభవనములో ప్రవేశించు వరికి మన దృష్టిని నేలపై పరువబడిన Alabaster చలువ రాతి పలక లాకర్షించును. వీనిపై చిత్రములైన నగిషీ పనులు చేయబడి యుండును. కొన్ని చోటులలో ఈ రాతి శిలలపైనను అపూర్వమైన అస్సీరియా లిపితో వివిధము లగు శాసనములు చెక్కబడి యుండును. అక్షరములు చెక్కుటచే యేర్పడిన చిన్న గాడులవలనుండు ఇత్తడి కాని కంచుకాని కరగించి పోయబడి యుండును. వ్రాయింపబడిన శాసనములు

శాశ్వతముగా నుండవలయు నని దీని యుద్దేశము కావచ్చును. వచ్చుపోవు వారి కాళ్ళ రాపిడిచే నీ లోహపు టక్షరములు మెరుగెక్కి మెరయుచు నేలకంతకును వింతయందము కూర్చుచుండును. ఈ ప్రాంగణమును దాటి కమానుల యాకారములో నున్న ద్వారములలో నుండి మనము సభా మందిరములో ప్రవేశింపవలెను. కాని ద్వారము నొద్ద నిలువబడి యున్న అద్భుత ప్రతిమలు మన దృష్టి నాకర్షించి మనల నించుకకాలము నిలువ బెట్టును. ఈ ప్రతిమలు మనుష్యుని శిరస్సును, సింహ వృషభముల దేహమును, రెక్కలును గల యపూర్వ నిర్మాణములు. ఇయ్యవి పరిమాణము నందు చిన్న కొండలవలె నుండెను. అస్సీరియా శిల్పకారు లీ యపూర్వ చిత్రములకు అయిదు కాళ్లను చెక్కియుండుట మనము తప్పక గమనింతుము. అధికముగా నొక కాలు చేర్పబడి యుండుట వలన మన మేదెస నుండి చూచినను నాలుగు కాళ్ళు మాత్రము కాన్పించును. ద్వారములను దాటి సభా భవనము లోనికి ప్రవేశించు సరికి ఈ మందిరము యొక్క రామణీయకత మనల నాశ్చర్య నిమగ్నుల కావింపక మానదు. అచ్చటి గోడలు మిక్కిలి యెత్తుగానుండును. కుడ్య నిర్మాణము ఇటుకలతోనే జరిగినను సుమారు పదునైదడుగుల యెత్తు వరకును గోడలు లేత గోధుమ వర్ణము గల నున్నని (చలువ) రాళ్ళతో కప్పబడి యుండును. రాళ్లు కదలిపోకుండ ఇనుప కమ్ము లమర్పబడి యుండును. వీనిపై వివిధములగు చిత్ర

ములు చిత్రింపబడి యుండును. పూర్వకాలపు రాజులు, మృగయావినోద కృత్యములు, యుద్ధరంగమునందలి శిక్షణ ప్రదర్శనములు మున్నగునవి మిక్కిలి సహజముగ, కన్నుల పండువుగా చిత్రింపబడి యుండుట మనము గాంచెదము. అపూర్వకములైన చోటులలో ఈ బొమ్మలకు రంగులు కూడ వ్రాయబడినవి. రాజుల కిరీటములు, వస్త్రాలు, పాదరక్షలు, ఖడ్గములు ధనుర్బాణములు, చెట్లచామలు, పక్షులు మున్నగు వాని కుచితము లగు వర్ణములు పూయబడినవి. ఈ (చలువ) రాళ్ళకు పైన అనగా నేలనుండి పదునైదడుగుల పైన సుమారు మూడు నాలుగడుగుల వరకును గోడయంతయు రంగురంగుల ఇటుకలతో నిర్మింపబడి యుండును. ఈ రంగురంగుల ఇటుకల సహాయమున అనేక చిత్రములు, మనుష్యుల యొక్కయు జంతువుల యొక్కయు స్వరూపములు కల్పింపబడి యుండును. ఇందలి పనితనము మిక్కిలి కొనియాడదగి యున్నది. పూర్వకాలమునందలి అస్సీరియా శిల్పులు తమ చిత్రలేఖనాదుల యందు వివిధ వర్ణములను వాడుచుండినను వారు సర్వసాధారణముగ లేత రంగులనే వాడెడి వారు. కాని గాఢమై, కంటిని చెదరగొట్టు ముదురు రంగుల నుపయోగించెడి వారు కారు. ఈ విశాల సభా భవనములలోనికి గాలియును వెలుతురును ధారాళముగ వచ్చుటకై ఆ నాటి శిల్పులు గోడల పై భాగములలో గాలి కిటకీలను, ఇంటి కప్పులో చిన్న కంతలను నేర్పాటు చేయుచుండిరి. వర్షఋతువునందు

వీనిని దట్టమైన యున్ని కంబళ్ళు మున్నగు వానితో కప్పి వాన నీరు లోనికి రాకుండునట్లు జాగ్రత్త పరచుచుండిరి.

గృహ నిర్మాణమందలి లోపములు

సువిశాలములును, రమణీయములు నగు నీ సభాభవనముల నిర్మాణముల యందు కొన్ని లోపములు కానబడుచున్నవి. అందొకటి వాని పరిమాణములకు సంబంధించినది. ఈ సభా భవనములు మిక్కిలి పొడవుగను వెడల్పునందుచాల సన్నముగను నిర్మింపబడు చుండినందున, వానియందు సభా భవనముల కుండవలసిన గంభీరత కొరతపడి మందిరాంతర్భాగమునకు గొనిపోవు త్రోవలవలె కానవచ్చు చున్నవి. నిమ్రూద్ అను ప్రదేశమున లయార్డు మహాశయుడు భూమిని త్రవ్వించి నప్పుడు పైన వర్ణింపబడిన సభాభవన మొక్కటి వెలువడెను. అయ్యది అస్సీరియా రాజైన అషుర్‌నసిర్‌పాల్ అను నాతనిచే నిర్మింపబడిన సభామందిరము. దాని పొడవు 160 అడుగులు. వెడల్పు 40 అడుగులకు కొంచెమూ తక్కువగా నున్నది. ఖోర్సాబాద్ మంటిదిబ్బలలో నిట్టి సభా మందిరములు నాలుగైదు కానవచ్చినవి. వీని నిర్మాణము నందు నైతమిట్టి లోపమే చూడనగును. సుఖ్యాతుడైన సెన్నాచెరబ్ ప్రభువు కాలమునాటి సభామందిర మొకటి కోయుంజిక్ అను ప్రదేశమునందచి చారిత్రిక శిధిల ములలో వెలువడినది. దీనిపొడవు 180 అడుగులు, వెడల్పు 40 అడుగులుమాత్రమే. మ పరిమాణములు లేనందున నీ సభా భవనములు

మాచుల కేమంత యుక్తగ లేకున్నవి. అస్సీరియా గృహము లను నిర్మించిన శిల్పులకు తమ నిర్మాణముల యందలి యీ గొప్ప లోపము కానరాకుండెనా? స్తంభాల సృష్టిలో చూపిన సామర్థ్యము కిటికీల సృష్టి కూడ నాయందు లోపించెనా? అస్సీరియా దేశము కొక గొప్ప యాటంకము గలదు. రాతి ప్రాకారము లోని యభ్యంతర మందిరముల నిర్మాణములో నిట్టి లోపము కాన రాదు. అచ్చట గదులు చతురముగనో దీర్ఘ చతుర స్రాకారముననో ఉన్నవి. ఈ గదులు సాధారణముగ 25 అడుగుల పొడవును అంతే వెడల్పును కలిగి యున్నవి. అంతఃపురములలో విశాల ప్రాంగణములు ముంగిళ్లు కలవు. వీని నిర్మాణము కూడ సుందరముగనే యున్నది. వాని పొడవు 180 అడుగులును వెడల్పు 120 అడుగు లును, పొడవు 150 అడుగులును వెడల్పు 125 అడుగు లును, ఈ ఒరవడినే యున్నవి. ఈనాటి శిల్పులు కూడ వీని నిర్మాణమును గూర్చి యెట్టి ఆక్షేపణను చేయజాలరు. ఇట్టి సందర్భమున అస్సీరియా శిల్పులు రాజసభా మందిరముల నాపిఘముగ లోపభూయిష్ఠముగ నేల నిర్మించిరను ప్రశ్న బయలుదేరును. గృహనిర్మాణ సాధనములయందు ఆకాలమున గల అవిలంఘ్యమగు ప్రతిబంధకములే, సభా మందిరముల యందలి ఈలోపములకు కారణము. ఆ పురాతనయుగమునందు ఇనుపదూలములు మున్నగునవి లభింపనందున గృహనిర్మా

ణాముల యందు కఱ్ఱదూలములు మాత్రము వాడవలసివచ్చె డిది. ఎంతెంత పెద్ద వృక్షములను నరికినను ఒకే పరిమాణము గల దూలములు నలుబది యడుగులకు మించినవి లభింప జాలవు. దూలముల యాధారము లేకుండ కేవల మిటుకలతో నింటికప్పును నిర్మించుట సాధ్యము కానిపని. ఈ కారణముచే అస్సీరియా శిల్పులు తాము నిర్మించిన సభా మందిరములన పొడవుతో నిమిత్తము లేకుండ వెడల్పును 40 అడుగులవరకు పరిమితము చేయవలసి వచ్చెడిది. బాబిలోనియా అస్సీరియా దేశములలో ఉన్నత జాతి వృక్షములు పెరుగనందున, గృహ నిర్మాణాదుల కావశ్యకమగు కఱ్ఱను దూరప్రాంతముల నుండి వీరు తెచ్చుకొనెడి వారు. ఇట్టి కలప ముఖ్యముగ లెబనాన్ కొండలలో లభించుచుండిన కారణమున అస్సీరియా రాజు లీ ప్రాంతములపైతరచుగ దండువెడలి, అచ్చటి రాజులనుజయించి వారికడనుండి కప్పమునకు మారు తమ కావశ్యకమగు కఱ్ఱను పంపుచుండ వలయునని యేర్పాటు కావించుకొను చుండిరి. బాబిలోనియా అస్సీరియా ప్రాంతములలో నిర్మింపబడిన రాజ భవనములెల్లను చెత్త పచ్చిఇటుకలు మున్నగు వానిచే సిద్ధము కావింపబడిన వేదికలపై నిలచి యుండెడివి. ఈ దేశములలో వర్షములు విపరీతముగ కురియును. ఇట్లు వర్షములు కురిసి వాననీరు భూమిలో నింకినప్పుడు రాజప్రాసాదములకు పునా దిగ నేర్పడిన మంటి దిబ్బలు బలములేక లోనికి క్రుంగిపో చుండెడివి. ఇట్లు పునాదులు క్రుంగిపోయినప్పుడు మందిరము

నష్టపడుట సహజము. ఈవిధముగ ప్రా[illegible]
ఏమిమాత్రపుతువులు మిక్కిలి వర్షముతో [illegible]
భవనము లన్నియు శీఘ్రముగ పాడై పోవుచుండెను.
ఇట్టి అనర్థములు సంభవించు నని యూహించి [illegible]
వారలు వానసీరు నిలువ యుండకుండునట్లు [illegible]
యందును మురుగు నీటి కాలువలను నిర్మించి [illegible]
యుట తోడనే నీరంతయు బయటకు ప్రవహించి పోవున
ట్లేర్పాట్లు చేయుచుండిరి. కాని యింతమాత్రమునచే వారు నిర్మించిన మందిరములు చిరకాలము నిలువజాల కుండెను. ప్రకృతిజన్యములగు లోపములను మనుష్యయత్నములు సంపూర్ణముగ సవరింప జాలవుకదా! అస్సీరియా రాజు లిట్లు చెడిపోయిన మందిరములను బాగుచేయించుటకు యత్నించక,

ఎవరికివారు ప్రత్యేకముగ నూతన మందిరములను నిర్మించుకొను చుండెడివారు. ఈ రాజుల కాలములో మందిర నిర్మాణము విస్తారముగ జరుగుట కిదియే కారణము. కూలిపోయిన మందిరములలోని రాళ్ళు, కాల్చిన యిటుకలు మున్నగువానిని [illegible]నిపోయి నూతన భవన నిర్మాణమునందు వాడుచుండిరి. నెబుచడ్నెజారు అను అస్సీరియా ప్రభువు బార్సిప్ నగరము నందలి యేడంతస్తుల దేవాలయమును పునర్నిర్మాణము కావించి అందొక శాసనము వ్రాయించెను. పురాతన కాలమునం దొకరాజు ఈ దేవాలయమును ప్రారంభించి, యేడవ అంతస్తును మాత్రము కట్టక విడచి వేసెననియూ, ఆ దేవాలయమున

వానసీరు విశేషముగా నీటిచే పునాదులు గుల్లబారి కూలి పోయెననియు, పునాదియందున్న ఇటుకలు చెత్త మున్నగు నవి వానసీటిలో కొట్టుకొని పోయెననియు, ఆ రాజు తన శాసనములో వ్రాయించెను. బాబిలోనియా అస్సీరియా దేశముల భవన నిర్మాణము నందలి లోపము నీ శాసనము వ్యక్త పరచు చున్నది.

మ ర ణా న్ని వి శే ష ము లు

పురాతన జాతులను గూర్చిన యనేకాంశములు మనకా కాలపు సమాధుల వలననే తెలియవచ్చు చున్నవి. ఈజిప్టు దేశము నందలి "పిరమిడ్లు" అను కట్టడము లిందులకు గొప్ప నిదర్శనముగా నున్నవి. కాని అస్సీరియా దేశమునందు పూర్వ కాలమునాటిసమాధు లేవియును కానరాకున్నవి. ఈ దేశము లోని ప్రజలెవ్వరును మరణింపనేలేదాయని అప్పుడప్పు డాశ్చర్య పడవలసి వచ్చుచున్నది. బాబిలోనియా దేశములో మాత్ర మిట్టి సమాధులు విస్తారముగ కాన్పించు చున్నవి. అందును ముఖ్యముగ ప్రాచీన కాల్డియా ప్రాంతములో అనేకసమాధులను మనము నేటికిని గాంచవచ్చును. ఈ కాల్డియా ప్రాంతమునం దే అనాదియందు ప్రజలు నివసించుచుండిరనియు, కాలక్రమమున వారు విడిపోయి ఉత్తర దిక్కుననున్న అస్సీరియా దేశమునకు వలసపోయిరనియు, కావున వారు తమకు జన్మస్థానమైన కాల్డియా ప్రాంతమును పుణ్యభూమిగ పరిగణించి, మృతదేహ ములను పూడ్చి పెట్టుటకై ఇచ్చటికి తీసికొని వచ్చెడి వా

కానరావు. ఇది రుద్రభూమి యగుటకు సర్వవిధముల తగి యున్నదని లాఫ్టస్ వర్ణించి యున్నాడు.

ఈ కాలమునాటి సమాధులుకూడ చిత్రవిచిత్రముగ నున్నట్లు స్థల పరిశోధనవలన తెల్లమగుచున్నది. మృత దేహములను రెండు జాడీలవంటి వానిలో నిమిడ్చి పాతివేయుట యొక ఆచారము. ఈ జాడీ రెండువైపులయందును కూడ తెరచియే యుండును. కాని ఒక ప్రక్క మూతి సన్నము. రెండవవైపున నీటి తూము పరిమాణముగల వివర ముండును. ఇట్టి రెండు జాడీలలో శవమును బెట్టెడు వారు. ఆపైన రెండు జాడీలను తారుమొదలైన వానితో అతికించి భూమియందు సమాధి చేయుచుండిరి. ఇది దేశీయమైన పద్ధతిగా కానబడు చున్నది. ఈనాటి వరకునుకూడ బగ్దాదు నగరమునందు నీటిని తెచ్చుటకై యీ ఆకారముగల కూజాలనే వాడుచు నున్నారు. పళ్ళెమువంటి మూతలుగల మరియొక విధమగు శవ పేటికలనుసైతము పూర్వకాలపు కాల్డియా నివాసులు వాడు చుండెడివారు. ఇట్టి వానిని తెరచిచూడగా వీనియందు రెండు రెండు అస్థిపంజరములు కానవచ్చినవి. భార్యా భర్త లొకరి తరువాత వేరొకరు మరణించినప్పుడీ శవపేటికను తెరచి యందు దీర్ఘనిద్ర చెందుచున్న భార్యప్రక్కనో భర్తచెంతనో నూతన శవమును పరుండబెట్టి మరల శవపేటికను మూయుచుండెడి వారని దీనివలన నూహించుట కవకాశము కలుగుచున్నది. ఇట్టి శవపేటికలు ముఃఘీర్ అని నేడు వ్యవహరింపబడుచున్న

పురాతన "ఉర్" పట్టణము సమీపమున లభించినవి. [illegible]
పూర్వపుటదై మరియొక స్థలమునకూడ పూర్వకాలపు కాల్డియా
నివాసులు వాడుచుండిరి. ఉన్నత కుటుంబముల వారు ఘనా
ఘ్యులను తమ కొరకై ఇటుకలతో ప్రత్యేకముగ గదులను
నిర్మించుకొనెడివారు. వానికి లోపలకాని పైనకాని యింటి [illegible]
కుంపటునై చక్కని యేర్పాట్లు చేయుచుండెడివారు. ఇట్లు
నిర్మింపబడిన గదులలో కొన్ని [illegible] ములలో [illegible]
అస్థిపంజరములు లభించినవి. ఈ అస్థిపంజరము లన్నిటికిని
ఒక్కొక్క ఇటుక తలగడగ అమర్చబడియున్నది. మరణించిన
వారి హస్తములయందు మదకమును త్రాగుటకై యొక పాత్ర
యుంపబడినది. సమీపముననే అనేక యితర పాత్రలును,
కొన్నిటియందు భోజన పదార్థములును కానవచ్చుచున్నవి.
అస్థిపంజరములలో కొన్నిటికి చేతులకు బంగారు కడియములు
కానవచ్చుచున్నవి. విలువ గల జీర్ణ వస్త్రములు
కూడ నీ సమాధులలో లభించినవి. పైన వర్ణింపబడిన యీ
మూడు విధములైన సమాధులనుకూడ అతి ప్రాచీనకాలమున
కాల్డియా ప్రజలకు సంబంధించినవని నిర్ణయింపబడినది. సమాధు
లలో లభ్యమైన చిహ్నములవలన వీరికి మరణానంతరము
సైతము మనుష్యుడు జీవించియుండుననియు, అతనికి నిత్య
జీవితమునందలి వస్తువులు అవసర మగు ననియు, విశ్వాస
ముండెడిదని యూహింపవచ్చును. ఇట్టి నమ్మకములు ప్రాచీన
కాలపు గ్రీకులలోకూడ నుండెడివి.

## శిల్పము

అతి ప్రాచీనకాలమునందు కాల్డియా దేశములో నెట్టి శిల్పకళాభివృద్ధి జరిగెనో తెలిసికొనుటకు తగిన సాధనములు మిక్కిలి పరిమితముగ నున్నవి. ఆదేశములో రాళ్లు లభింప నందున రాతిపై విగ్రహములను చెక్కుట మున్నగు పద్ధా నము లా కాలము వారికి తెలియునా యని యనుమానింప వలసి వచ్చెను. కాని బాగ్దా పట్టణమునందు ఫ్రెంచిప్రభుత్వము వారి రాయబారిగా నున్న సార్జిక్ అను నాతడు కొన్ని రాతి విగ్రహముల తునుకలను సంగ్రహించెను. ఇయ్యవి పనితనము నందు మరే దేశపు రాతి విగ్రహములకును తీసిపోవు. వానిలో నొక తల ప్రాచీనకాలపు కాల్డియా నివాసులను తలపించు చున్నది. ముఖ లక్షణము లన్నియు చక్కగ తీర్చినట్టున్నవి. శిరము ముండితము. తలపాగ చుట్టబడి యున్నది. ఇట్టివే మరి కొన్ని ప్రాచీన శిల్పకళా చిహ్నములు లభించిన యెడల ఆనాటి కళాజీవితము బాగుగా వ్యక్తమగును. ఈవరలో సూచింప బడిన ఎరెక్ పట్టణమునకు సమీపమున లాఫ్టస్ అను పరిశోధ కుడు మట్టితో చేయబడిన అనేక పాత్రములను, ఇతర పని ముట్లను కనుగొన గలిగెను. ఇందు శిల్పకారుని నైపుణ్యము చక్కగ చూపబడియున్నది. వారి దేశమునందు మట్టిమాత్రె మేకష్టమును లేక దొరకుచుండి నందున కాల్డియా నివాసులు నిత్యజీవితమునందలి పరికరముల కొరకును, తమ కళాభినివేశ

మును చూపుటకుకూడ మట్టికే వారు చుంచిరని యూహించుట సత్యమార్గము కాదు.

### ప్రాచీన కాలపు గ్రంథాలయము

లయార్డు మహాశయుడు తన పరిశోధనలచే కనుగొనిన యనేక అద్భుతములలో ప్రాచీన కాలమునందలి గ్రంథాలయ మొక్కటి. కోయుంజిక్ శిథిలములు సుప్రసిద్ధ అస్సీరియా చక్రవర్తులైన సెన్నాచరబ్, అషుర్ బనిపాల్ అనువారల రాజ ప్రాసాదముల చిహ్నములు. ఈ శిథిలములలోని యొక గదిలో ప్రవేశించునరికి ఈతనికి ఆ ప్రదేశ మంతయు ఇటుకలతో నిండి యుండుటయు, వానిపై విచిత్రమగు లిపితో వ్రాయబడి యుండుటయు అతి యాశ్చర్యముతో కనుగొనెను. ఈ ఇటుక లన్నియు చక్కగ అమర్చబడి యుండినట్లు జీర్ణ స్థితి యందుసైతము తెలియ వచ్చుచుండెను. ఈ ఇటుకల పోగులు చారిత్రిక విషయసంగ్రహణమునకై యెంతయో యుపకరించు నని గ్రహించి లయార్డు మహాశయుడు వీరిలో పెక్కింటిని లండను నగరము నందలి చిత్రవస్తు ప్రదర్శనశాలకు పంపివైచెను. ఆ యపూర్వ వస్తువులు బ్రిటిషు మ్యూజియము నందు చిరకాలము వరకును నిరుపయోగముగ పడియుండెను. కాని వీని యందు ప్రాచీనకాలపు చారిత్రిక విషయము లనేకములు లిఖింపబడియున్నవని పండితు లూహింపక పోలేదు. కాని వారిలో నెవ్వరికిని స్వాయముగ వీనిని పరీక్షింప సమర్థతయు ఓరిమియును లేకుండెను. ఇతరు లెవ్వరైన యీ ఘన

కావ్యమునకు పూర్వకొందరాయని వారున్నిర్ధార్యారుచు నెదురు చూచుచుండిరి. కొంతకాలము గడచిన తరువాత బ్రిటీషు మ్యూజియము నందు ఉద్యోగిగ నున్న జార్జి స్మిత్ అను యువక చారిత్రిక పరిశోధకుడు ఇటుకలను పరీక్షించుట తటస్థించెను. ఇతడు మొదట్లో కొందరకు ప్రాచీన కాలపు లిపిని కర్రపై చెక్కు అచ్చు (Blocks) లను తయారు చేయుచుండెడి వాడు. కాని బుద్ధిశాలియు, జ్ఞాన పిపాసువును అయిన కారణమున నితనికి తాను కర్రపై చెక్కుచున్న యంశములేవియో తెలిసి కొనవలయునను కుతూహలము కలిగి ప్రాచీన అస్సీరియా భాషను నేర్చుకొని బ్రిటీషు మ్యూజియమునందలి ఇటుకలపై గల యంశము లన్నిటిని తెలిసికొనెను. ఇటుకలపై వ్రాతను చదువునవి కవియున్నియు పుస్తకము లనియు, కోయుంజిక్ మొదలగు ప్రదేశములలో నిట్టి ఇటుకలు లభించినగది సుప్రసిద్ధుడగు అస్సీరియా రాజు అషూర్ బనిపాలుని గ్రంథాలయ మనియు వ్యక్తమయ్యెను. ఈ ఇటుకలలో కొన్ని విరిగి పోయెను. కొన్ని అంశములకు రెండు ప్రతులు కాన్పించెను. మొత్తము మీద వీని నన్నిటిని శ్రద్ధగా పరిశీలింపగా అందు అతిప్రాచీన కాలమునాటి పద్యకావ్యమొకటి పండ్రెండు ఇటుకలపై వ్రాయ బడి యున్నట్లు జార్జి స్మిత్ కనుగొనెను. ఈ విషయములు పత్రికలలో ప్రకటింపబడిన తోడనే వైజ్ఞానిక ప్రపంచమునందు గొప్ప కలవరమును, సంభ్రమమును ఉత్పన్నమయ్యెను. ఈ ప్రాచీనకాలపు సామ్రాజ్యములనుగూర్చిన యన్ని విషయము

లను సంగ్రహించవలయునని యు, ఆస్సీ [illegible] గ్రంథ భాండాగారమును సంపూర్ణముగ [illegible] ము ఔత్సుక్యము ప్రకటించెను. [illegible] టెలిగ్రాఫ్ అను పత్రికవారు [illegible] సహాయముచేసి కోయింక్ [illegible] పని నియమించిరి. ఈతడును ఆ [illegible] పూనుకొని రెండు పర్యాయము లీ దేశములు ప్రదేశములకు ప్రయాణముచేసి యనేక నూతనాంశములను, చారిత్రిక చిహ్నములను సేకరించెను. కాని దురదృష్టవశమున మూడవ పర్యాయము మెసపొటేమియాకు యాత్రకు పోయినప్పుడు ఇతనికి స్ఫోటకవ్యాధిసంభవించి తన ముప్పదియారవయేట 1876వ సంవత్సరమున నితడు మరణించెను. స్మిత్ మరణమువలన నీ చారిత్రిక శాఖకు గొప్ప కొరత సంభవించెను. కాని నాటికొంత కాలమున కితర చారిత్రికు లుత్సాహముతో నిపనికి పూనుకొని పైన తెలుపబడిన ఇటుకలకు ప్రతులను, ప్రతిబింబములను తీసికొని, ఈ విజ్ఞాన భాండాగారములు పరిరక్షించు జాగ్రత్త వహించిరి.

పైన తెలుపబడిన గ్రంథాలయమునందు వివిధములగు గ్రంథములు కానవచ్చినవి. వీనిని ముఖ్యముగ రెండు విధములుగ విభజింపవచ్చును. కొన్ని మత విషయికములు. మరికొన్ని శాస్త్రీయ గ్రంథములు. శాస్త్రీయ గ్రంథములలో గణిత శాస్త్రము, జ్యోతిషశాస్త్రము మున్నగునవి కలవు. ఆకాలము

నందు సక్రమ పద్ధతిపై చరిత్రలను, వ్రాయుట తెలిసియుండి నట్లు తోపదు. కావున ఈ గ్రంథాలయమునందు కాన్పించిన చరిత్రలతి స్వల్పముగ నున్నవి. భూగోళశాస్త్రమును గూర్చిన కొన్ని పుస్తకములిందు కానవచ్చును. ఆకాలము నాటికి తెలిసియున్న దేశములు, నదులు, పర్వతములు మున్నగు వాని పట్టిక యిందు చేర్పబడినది. బాలబాలికలు చదువు పాఠగ్రంథములు సైతమిందు చేరియున్నవి. కొన్ని వ్యాకరణ గ్రంథములు, నిఘంటువులునుకూడ నిందు లభ్యమైనవి. పురాతన కాలమందు కాల్డియా విద్వాంసులచే వాడబడు చుండెడిభాష కాలక్రమమున వాడుక నుండితొలగిపోయినందున జన సామాన్యమున కా భాష యర్థమయ్యెడిది కాదు. మతాధికారులు మున్నగు వారు మాత్రమీ భాషను తెలిసి కొనగలిగియుండిరి. కాని యీనాడు సైతము హైందవులు తమ ప్రార్థనాదికములను సంస్కృత భాషయందు కావించు చున్నట్లే, అస్సీరియా దేశస్థులుకూడ ప్రాచీన "అక్కాదు" భాషలో తమ ప్రార్థనల కావించుచుండిరి. ఇట్టివారల ఉప యోగమునకై నిఘంటువులు సిద్ధ పరుపబడెను. ప్రాచీన భాషాపదములకు అస్సీరియా భాషయందలి సమానపదములు చూపుచు నీ నిఘంటువులు సిద్ధ పరుపబడెను. ఈ నిఘంటువుల సహాయముననే యీనాటి పాశ్చాత్య విద్వాంసులు ప్రాచీన కాలపు కాల్డియా గ్రంథముల నెరుంగ గలుగుచున్నారు. అషుర్ బనిపాలు రాజుయొక్క గ్రంథాలయమునందు గ్రంథ

ములు మాత్రమే కాక, రాజకీయ పత్రములు, స్థానికోద్యోగులు తమ రాజునకు పంపిన నివేదికలు, ఆకాలపు ప్రజలు తమ నిత్య వ్యవహారములలో వ్రాసికొనిన దస్తావేజులు, క్రయపత్రములు, యద్రాసు నామాలు మున్నగున వెన్నియో యిందు చూపట్టును. ప్రఖ్యాతిగాంచిన సెన్నాచరబ్ రాజు తన స్వంతఆస్తిని కొంత తన కుమారులలో నొకని కొసంగుచు మరణశాసనము వ్రాసియుండెను. అదికూడ నీ గ్రంథాలయములో లభ్యమైనది.

### ఇతర చారిత్రిక చిహ్నములు

ఈ యపూర్వ గ్రంథములు (ఇటుకలు) కొన్ని పెద్దవియు, కొన్ని చిన్నవియు కలవు. పెద్దవి తొమ్మిదంగుళముల పొడువును, ఆరంగుళముల వెడల్పును కలవి. చిన్న యిటుకలు ఒకటి రెండంగుళముల పొడవుమాత్రము కలవు. వీనిపై గల వ్రాత మిక్కిలి సూక్ష్మముగ నుండును. కావున కొన్ని యిటుకలను సూక్ష్మదర్శిని సహాయమున మాత్రమే చదువుటకు వీలగుచున్నది. ఇట్టి అద్దములు అషుర్ బనిపాలురాజు గ్రంథనిలయమున లభ్యమైనవి. ఈ యిటుకలపై వెడల్పయిన కొనలు గల ఘంటమువంటి సాధనముతో వ్రాయుచుండెడివారు. ఒక వైపున వ్రాత పూర్తియైన తరువాత రెండవ ప్రక్కకు ఇటుకను త్రిప్పి వ్రాయునప్పుడు మొదటి వ్రాత చెడిపోకుండుటకై అక్షరములకు సమముగల స్థలములో రెండు పుల్లలను గ్రుచ్చి వానిపై యిటుకను నిలువబెట్టి రెండవవైపు వ్రాయుచుండెడివారు. ఇటుకలను కాల్చి గట్టిపరచు నప్పుడు కూడ నిట్టి

పుల్లలపైననే వ్రాసిని నిలువబెట్టుచుండిరి. కొన్ని ఇటుకలపై చిత్రవిచిత్రములైన బొమ్మలు ముద్రింపబడి యున్నవి. వీనిని లోహములతో చేసిన ముద్రికలచే ముద్రించుచుండిరనిపరిశోధకు లూహించుచున్నారు. ఈ ముద్రికలు గుండ్రముగనుండి బంగారు, వెండి మున్నగు లోహములతో సిద్ధపరుపబడు చుండెను. కొన్ని సందర్భములలో నీ ముద్రికలనే తాయెత్తులుగ వాడుచు మెడలో ధరించెడివారు. కొన్ని ముద్రికలు మట్టితో చేయబడు చుండెను. వీనికి చారిత్రిక దృష్టిచే చాల ప్రాముఖ్యత గలదు. పూర్వకాలపు అస్సిరియా ప్రభువులు తమ నామములను, తాము జయించిన రాజ్యములను, తాము కావించిన యితర ఘనకార్యములను పేర్కొనుచు తరచు శాసనములు వేయించుచుండిరి. ఈ శాసనములు రాళ్ళపై చెక్కింపబడు చుండెను. కాని వారి కంతటితో తృప్తి కలుగలేదు. అగ్ని జల ప్రమాదములవలన తాము వ్రాయించిన శాసనములు చెడిపోవచ్చును; లేదా కాలపరిభ్రమణమున తమ వ్రాతలు నశింపవచ్చును. అట్టి యనర్థము సంభవింప కుండ వారు మట్టి, రాయి, లోహము మున్నగువానిచే గుండ్రని ముద్రికలను సిద్ధము చేయించి వానిపై తమ రాజ్యపాలనమును గూర్చిన విశేషాంశముల వ్రాయింపించెడి వారు. ఇట్టి ముద్రికలను తాము నిర్మించిన భవనముల పునాదులలో నాలుగు మూలలయందును నిక్షిప్త మొనర్చుచుండిరి. ఇటు కావించిన యెడల తామొనర్చిన ఘనకార్యములను చాటెడి వస్తు

# అస్సీరియా రాజ వంశావళి

# కాలనిర్ణయ పట్టిక

| రాజులు | వారి కాలము | ఇతరాంశములు |
|---|---|---|
| | క్రీ. పూ. 2400 | అస్సీరియా రాజ్యములోనికి సెమిటిక్ ప్రజలు వలస వచ్చుట |
| 1 ఉష్పియా | | అషుర్ దేవత దేవాలయమును స్థాపించినట్లు తెలుపబడుచున్నది. |
| 2 కికియా | — | అస్సీరియా రాజ్యమునకు ముఖ్య పట్టణము స్థాపించెను. |
| 3 బెల్ బానీ | — | అస్సీరియా రాజ్య స్థాపకుడు |
| 4 కాటేషియా | — | |
| 5 షాలిమ్ ఆఖుమ్ | | |
| 6 ఇలూషూమా | క్రీ.పూ. 2050 | |

| | రాజులు | వారి కాలము క్రీ.పూ. | ప్రధానాంశములు |
|---|---|---|---|
| 7 | ఇకీషమ్ | 2030 | |
| 8 | ఇకూనమ్ | 2000 | |
| 9 | షార్ కెంకాటె అషిర్ | 1950 | |
| 10 | ఎన్లిల్ కాపీ | 1900 | |
| 11 | షమ్షీఅదాద్ (ప్రథమ) | 1870 | |
| 12 | ఇష్మేదాగన్ (ప్రథమ) | 1850 | |
| 13 | ద్వితీయ షమ్షీ అదాద్ | 1820 | |
| 14 | ద్వితీయ ఇష్మేదాగన్ | 1800 | |
| 15 | ప్రథమ అషిర్ నిరారి | 1780 | |

ఈ సమయ కాలములో అస్సిరియా రాష్ట్రము కాసైటుల ఆక్రమణకు లోనయ్యెను. ఈ కాలపు చరిత్ర మనకు తెలియవచ్చుట లేదు.

| | | |
|---|---|---|
| 16 | మూడవ షమ్షీ అదాద్ | 1750 |
| 17 | ప్రథమ అషిర్ రాబీ | 1475 |
| 18 | రెండవ అషిర్ నిరారి | 1450 |
| 19 | అషిర్ బెల్ నిషేషు | 1900 |
| 20 | పుజుర్ అషుర్ | 1430 |

| రాజులు | వారికాలము క్రీ.పూ. | ఇతరాంశములు |
|---|---|---|
| 21 అషుర్ నాదిన్ అఖి | 1380 | |
| 22 ఎర్బా అదాద్ | 1373 | |
| 23 అషుర్ ఉబాలిట్ | 1350 | |
| 24 ఎన్లిల్ నిరారి | 1325 | |
| 25 అరిక్ డెన్ ఇలూ | 1325 | |
| 26 ప్రథమ అదాద్ నిరారి | 1315 | |
| 27 ప్రథమ షాల్మె నాసిర్ | 1300 | |
| 28 ప్రథమ టుకుల్టిని నిబ్ | 1275 | |
| 29 ప్రథమ అషుర్ నసిర్ పాల్ | 1260 | |
| 30 టుకుల్టి అషుర్ | 1250 | |
| 31 అతాద్ షమ్ ఐషిర్ | 1250 | |
| 32 మూడవ అషుర్ నిరారి | 1245 | |
| 33 నబూదాని | 1245 | |
| 34 ఎన్లిల్ కుదుర్ అసుర్ | 1240 | |
| 35 నినిబ్ అపిల్ ఎషారా | 1230 | |
| 36 అషుర్ దాన్ (ప్రథమ) | 1210 | |
| 37 ముతాక్కిల్ నుస్కూ | 1165 | |
| 38 అషుర్ రేష్ ఇషీ | 1145 | |
| 39 టిగ్లాద్ పిలాసిర్ (ప్రథమ) | 1120 | |
| 40 అషుర్ బెల్ కాలా | 1100 | |

| రాజులు | వారివంశము క్రీ.పూ. | ఇతరాంశములు |
|---|---|---|
| 41 నాల్గవ షమ్షీ అదాద్ | 1080 | |
| 42 రెండవ అషుర్ నసిర్ పాల్ | 1060 | |
| 43 రెండవ షాల్మే నాసిర్ | 1040 | |
| 44 రెండవ అదాద్ నిరారి | 1030 | |
| 45 రెండవ టిగ్లాద్ పిలాసిర్ | 1020 | |
| 46 రెండవ అషుర్ రాబీ | 1000 | |
| 47 రెండవ అషుర్ రేష్ఇషీ | 980 | |
| 48 మూడవ టిగ్లాద్‌పిలాసిర్ | 950 | |
| 49 రెండవ అషుర్ దాన్ | 930 | |
| 50 మూడవ అదాద్ నిరారి | 911-890 | |
| 51 రెండవ కుల్టి నినిబ్ | 890-884 | |
| 52 మూడవఅషుర్ నసిర్ పాల్ | 884-859 | |
| 53 మూడవ షాల్మేనాసిర్ | 859-824 | |
| 54 నాల్గవ షమ్షీ అదాద్ | 824-811 | |
| 55 నాల్గవ అదాద్ నిరారి | 811-782 | |
| 56 నాల్గవషాల్మే నాసిర్ | 782-772 | |
| 57 మూడవ అషుర్ దాన్ | 772-763 | |
| 58 ఐదవ అదాద్ నిరారి | 763-755 | |
| 59 నాల్గవ అషుర్ నిరారి | 755-746 | |
| 60 నాల్గవ టిగ్లాద్ పిలాసిర్ | 746-727 | |

| | రాజులు | వారివంశము క్రీ. పూ. | ఇతరాంశములు |
|---|---|---|---|
| 61 | ఐదవ షాల్మే నాసిర్ | 727-722 | |
| 62 | సారగాన్ | 722-705 | |
| 63 | సెన్నాచరబ్ | 705-681 | |
| 64 | ఇసార్ హాడన్ | 681-668 | |
| 65 | అషుర్ బనిపాల్ | 668-626 | |
| 66 | అషుర్ ఎటిల్ ఇలాని | 626-618 | |
| 67 | సిన్ షమ్ ఇషిర్ | 618-616 | |
| 68 | సిన్ షార్ ఇష్కుర్ | 616-606 | నైనివానగర పతనము. అస్సీరియా సామ్రాజ్య వినాశము. |

# ఆంధ్ర చంద్రికా గ్రంథమాల

## నియమములు

౧. ఈ గ్రంథమాలలో దేశచరిత్రలు, మహా పురుషుల జీవితములు, ప్రకృతి శాస్త్రములు, ఇతర విజ్ఞానాత్మక గ్రంథములు ప్రకటింపబడును.

౨. ఈ గ్రంథములన్నియు ప్రజా సాహిత్య సంబంధములుగా నుండి, సులభమైన వచనశైలిలో ఆకర్షణీయముగా ప్రకటింపబడును.

౩. గ్రంథములు పెద్దవిగా నుండక, వీలైనంత వరకు పరిమితమైన పుటలు కలిగి, అందరు కొనుటకు అందుబాటులో నుండులాగున ప్రకటింపబడును.

౪. ఈ గ్రంథమాలకు చందా లేదు. మాసపత్రిక కాదు. గ్రంథము తయారు కాగానే చందాదారులకు వి. పి. గా పంపబడును.

౫. మా గ్రంథమాల ప్రచురణము లన్నియు, కొనుటకు నొప్పుకొనువారు "శాశ్వతపు చందా దారు"లన బడుదురు.

౬. శాశ్వతపు చందా దారులు కాగోరువారు, తమ యామోదమును లిఖిత పూర్వకముగా తెలిపి ఒక రూపాయి ప్రవేశ రుసుముగా చెల్లించవలెను.

౭. శాశ్వతపు చందా దారులకు మా గ్రంథమాల పుస్తకముల వెలలో నాల్గవ భాగము తగ్గించి గ్రంథములు తయారు కాగానే వి. పి. గా పంపబడును. పోస్టుఖర్చులు చందా దారులే భరించవలయును.

౮. ఇంతవరకు ఆంధ్ర వాఙ్మయములో లేని గ్రంథములే ఇందు ప్రకటింపబడును. ఈ గ్రంథములలో విషయవర్ణనకు సంబంధించిన పటములు, గ్రంథకర్తల పటములు ఉండును.

౯. ఆంధ్ర భాషకు పుష్టి కలిగించుటయు, ఆంధ్రులలో విజ్ఞాన చంద్రికలను ప్రసరింపజేయుటయు మా యుద్దేశము. డబ్బు సేకరింపవలెనని మా యుద్దేశము కాదు.

౧౦. ఆంధ్ర భాషాభిమాను లందరును గ్రంథమాలకు శాశ్వతపు చందా దారులుగాచేరి, మా భాషా వ్యవసాయమునకు ప్రోత్సాహ మొసంగి, ఆంధ్ర సరస్వతీదేవి ఆరాధనమునందు పాల్గొని కృత కృత్యులు గావలయునని మా విజ్ఞాపన.

---

ఇదివరకు ప్రకటింపబడిన గ్రంథములు

౧. విస్మృత సామ్రాజ్యములు.

ఇదియొక చరిత్రగ్రంథము. నవలవలె మనోరంజకముగా నుండు కథాంశములతో నొప్పారుచున్నది. ఇందు కాల్డియా, బాబిలోనియా, అస్సీరియా యను ప్రాచీన సామ్రాజ్యముల చరిత్ర వర్ణింపబడినది.

ఈ సామ్రాజ్యములు నాలుగయిదు వేల సంవత్సరముల క్రిందట మిగుల వైభవదశలో నుండి కాలపురుషుని ప్రభావమున మాటుపడిపోయినవి. చరిత్రకారుల అవిశ్రాంత పరిశోధన ఫలితముగా వీటి అద్భుతకథనము బయటపడినది. ఇంగ్లీషు లోని పెక్కు ఉద్గ్రంథములను పరిశీలించి, ఈ సామ్రాజ్యముల సభ్యత, శిల్పసంపద, మత విశ్వాసములు, ఆచారములు, విజ్ఞానము,

శౌర్యపరాక్రమములు మున్నగు పెక్కువిషయములను గూర్చి మనోహరముగా, అందరికర్థమగునట్లు ఈ గ్రంథము రచింపబడినది. ఆ కాలపు కవులు, దేవతలు మొదలగు వారిని తెలుపు పటములు నుండి ఆర్ట్ పేపరుమీద ముద్రింపబడినవి కలవు. ప్రారంభమున ప్రాచీనమానవుడు నాగరికత శిఖరారోహణమునకు ఎట్లు ప్రయత్నముచేసెనో చక్కగా వర్ణింపబడినది.

గ్రంథకర్త: ఖండవల్లి బాలేందు శేఖరం, ఎం.ఏ. గారు.

పుటలు. ౨౭౦ నెల చందాదారులకు రు ౨--౦--౦
ఇతరులకు. రు ౨-౧౨-౦



## ౨. తెలంగాణా ఆంధ్రోద్యమము

ఆంధ్రచంద్రికా గ్రంథమాలలో నిది రెండవ కుసుమము. ఇది తెలంగాణములోని ఆంధ్రోద్యమమునకు సంబంధించిన చరిత్రగ్రంథము. ఇప్పటి ఆంధ్రులు తాము ఆంధ్రులమను సంగతి నెఱుంగక, సాంఘికముగ, రాజకీయముగ, భాషా విషయికముగ, వెనుక బడి యున్న తరుణమున వారిని మేల్కొల్పిన పవిత్రోద్యమచరిత్ర మిది. ఈ ఉద్యమ ప్రభావమున ఆంధ్రులకు రాజకీయముగ అస్తిత్వము లభించినది. ఆంధ్రభాషకు ప్రచండ ప్రోత్సాహము కలిగినది. ఆంధ్రసంఘమునకు గట్టి కట్టుదిట్టములేర్పడినవి. ఇప్పటి వివిధోద్యమములయందు ఆంధ్రులు చూపుచున్న చైతన్యమునకు బీజములు నాటిదోహదము కావించినదీ ఆంధ్రోద్యమమే.

ఈ ఆంధ్రోద్యమరథమునకుబుజాలు వేసిన మహనీయుల కృషిచక్కగా వర్ణింపబడినది. వారి పటములును ముద్రింప సవి. అతిశయోక్తులు లేకుండ, యథార్థ విషయములు మాత్రము సప్రమాణములుగా వ్రాయబడినవి. ఈగ్రంథమును ఆంధ్రు లందరు చదివితీరవలయును. గ్రంథకర్త:మాడపాటి హనుమ రావుగారు.

పుటలు. ౧౫౨ వెల చందాదారులకు రు ౧-౮
ఇతరులకు ౨-౦

రాబోవు గ్రంథములు

---

౧. ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము
కర్త: ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, ఎం ఏ
౨. వైజ్ఞానికుల జీవితములు,
కర్త: బి. వి. రమణారావు, ఎం.ఎస్సి
౩. పౌరధర్మములు.
కర్త: డాక్టరు మారేమండ రామరా ఎం.ఏ.పి.ఎచ్
౪. రాజకీయపరిజ్ఞానము.
కర్త: డాక్టరు రాంపల్లి విశ్వేశ్వరరావు, ఎం.ఏ.,బి. పి.ఎచ్.డి.

"ఆంధ్రకుటీరము"
సుల్తాన్ బజారు,
హైదరాబాద్ దక్కన్
౧-౩-౧౯౪౯

మేనేజరు.
ఆంధ్రచంద్రికా గ్రంథమా.